# ఆంధ్రసచిత్ర వారపత్రిక

14-20, మార్చి, '86
రు. 2-50

నేను చూసే 'దూరదర్శన్' కార్యక్రమాలు
జయసుధ

శిల్పకళాపేటి సత్తెమోలు శ్రీ రామలింగేశ్వరాలయం!

దైవత్వాన్ని ఆపాదించుకోని ప్రముఖ తత్వవేత్త "జె.కె."


"సీతా రామకల్యాణం"లో రజని, బాలకృష్ణ

# 25 పైసలు తగ్గింపు

# ప్రతి ప్యాక్ ట్రూ నీస్ బిస్కట్ల మీద!







నీస్ బిస్కట్‌ని ట్రూ మరింత శ్రేష్ఠంగా చేస్తుంది.



కోరిన కొబ్బరి, ఎక్కువ చక్కెర .... మరి యే ఇతర నీస్ బిస్కట్ కన్నా ఎక్కువగా యిదంటేనే యిష్టపడుతున్నారంటే



ఆశ్చర్యంలేదు. ఇప్పుడు తాజాగా, కరకర లాడే బిస్కట్ ప్రత్యేక ధరలో లభిస్తోంది. ఇప్పుడే ఒక ప్యాక్ కొనడానికి ఎన్నో కారణాలు వున్నాయి.

**ట్రూ నీస్**

**శ్రేష్ఠమైన మూలపదార్థములతో**
**ప్రేమ, శ్రద్ధ చేర్చి తయారు చేయబడినవి**

పరిమిత కాలానికే ఈ సదుపాయం

AFL-18

## ముఖచిత్రం

పెదవుల చిరునగవు ఒదిగి యుండ,
నయన చంద్రికలు నింగి చందురునికి సాటిగ నుండ
ధనస్సును బోలు కనుబొమలు టిక్కుగ నిలచి యుండ,
కొటేరు ముక్కు కొసను కొలది వంపుగ నుండ,
నీలాంబర ధారి మాధవి ముఖ చిత్ర సుందరియై నిలచియుండ
(7–2–86)నాటి పత్రిక గాంచి పరవశించె నామనసునిండ

కె యస్ శక్తిసామంత్ యాదవ్ కర్నూలు

## సమృద్ధిగా ఉన్న కథనం

ఇప్పుడు వస్తున్న కథలలో లోపిస్తున్న కథనం 24–30 జనవరి సంచికలో ఎమ్ ఆర్ ప్రసాద్ కథ 'కాటుక వెన్నెల'లో సమృద్ధిగా వుంది పాత్రల చిత్రీకరణకు ఎక్కడా దెబ్బతగలకుండా హోరుగా జోరుగా సాగిన కథ రాసినందుకు ఆయనకు అభినందనలు అయితే ప్రారంభంనుండి తరువాతి పేజీలోని 'స్వాగతంబిచ్చు మేల్కొల్పు పల్కుడింక ఉదయలక్ష్మికి' అన్నంతవరకూ తీసేసి కథలోకి సూటిగా వెళ్ళిపోతే బ్రెవిటీతో ఎక్కువ ఎఫెక్టివ్‌గా ఉంటుందని నా అభిప్రాయం

–కొడవంటి కాశీపతిరావు,
–విజయనగరం

## కథలు

జనవరి 24–30 సంచికలోని 'లోకం పోకడ' కథ నేటి సమాజాన్ని ప్రతిబింబించింది రావ్ లాంటి వారికి ఈ కథ గుణపాఠం 'ముడుపు' కథ బావుంది

–ఐ ఎల్ ఎన్ చంద్రశేఖర్,
పోరుమామిళ్ళ

## ఉత్తరాలు

* * * *

జనవరి 24–30 సంచికలో ప్రజలకోసం ప్రజలసొమ్ముతో, ప్రజలచే నిర్మించిన ప్రభుత్వ ధర్మాసుపత్రిలో నిత్యం జరిగే అధర్మం, అన్యాయం, అశ్రద్ధ, ఆలస్యము, ఆశ్రిత పక్షపాతము, అధికారదర్పనియోగాలకు నిలువుటద్దం పట్టింది ఎమ్ ఆర్ ప్రసాద్ గారి కాటుకవెన్నెల కథానిక దారిద్ర్యం దినదినాభివృద్ధి చెందుతున్న ఈ దేశంలో అమాయక ప్రజలకు అనారోగ్యం ఆసించి వరవిహారం చేస్తుంటే, ధర్మాసుపత్రులలోని ధర్మం యిలా కొనసాగితే, తగిన తీర్పు చెప్పే రోజు రాక తప్పదు.

–క్రిష్ణంశెట్టి మాణిక్యారావు,
క్రిష్ణంశెట్టి నాగరత్నం
పరుచూరు

## చక్కని వివరణ

హిందినటి ఫారా ముఖచిత్రంతో వెలువడిన పత్రికలో శ్రీ బులుసు వేంకట రమణయ్య గారు ధర్మపథం లో మెప్పు కోసం ప్రాకులాడే వారిని గురించి చాల చక్కగా వివరించారు

–బందిగి బాలరాజు, నారాయణపేట

(74 వపేజీ చూడండి)


# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు (1938-1972)

14-20 మార్చి, 1986,
శ్రీ క్రోధన నామ సం. ఫాల్గుణ శు చవితి
సంపుటము 78 : సంచిక 27

సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు. 2-50 |
| పోస్టులో 6 నెలల చందా | రు. 71-50 |
| పోస్టులో 12 నెలల చందా | రు. 143-00 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

**ముఖచిత్రం :**
"సీతారామ కల్యాణం"లో రజని

**కథలు :**



**సీరియల్ నవలలు:**



**వ్యాసాలు, శీర్షికలు :**

# ఆదా చేయండి రు. 11 లు!




**పోస్టుద్వారా భారతి తెప్పించుకోండి!**

**ఆఫ్‌సెట్ ముద్రణలో భారతి!**

భారతి సంవత్సర చందా (పోస్టు ద్వారా రు. 51/–లు) ఒకేసారి చెల్లించే వారికి రు. 11/–ల 'ముదరా' వుంటుంది.

**అంటే మీరు కేవలం రు. 40/–లు చెల్లిస్తే ప్రతినెలా భారతి పోస్టు ద్వారా మీ ఇంటికే అందుతుంది.**

చందా పైకమును ఆంధ్రపత్రిక, గాంధినగరం, విజయవాడ–3కి మనియార్డరు లేదా డిమాండు డ్రాఫ్టు ద్వారా పంపుతూ ఈ దిగువ కూపను జతపర్చ కోరుతాము.

---

నేను 'భారతి' మాసపత్రికకు చందాదారునిగా చేరదలుచుకున్నాను
చందా పైకము రు. 40/– డి.డి. / ఎం. ఒ. ద్వారా పంపుతున్నాను.

పేరు : ______________________

ఊరు : ______________________

చందాదారుని సంతకం

# జాతి-మతం-సంస్కృతి

## న్యూఢిల్లీ లేఖ



**డా. జయదుబాషి**

ఆయన వచ్చారు, చూసారు, తిరిగి వెళ్ళారు నేను ఈ మాటలు అంటున్నది పోప్ గురించి ఆయన పది రోజుల పాటు మనదేశంలోని వివిధ ప్రాంతాలని సందర్శించారు ఆయన పర్యటనకి మన వార్తాపత్రికలు విపరీతమైన ప్రాముఖ్యతని ఇచ్చి హడావుడి చేసాయి కానీ విదేశీ వార్తాపత్రికలు చాలా బాగం పోప్ పర్యటన విఫలం అయినట్లు పేర్కొన్నాయి

టైమ్ వారపత్రిక ఇలా రాసింది జాన్‌పాల్‌ని గౌరవ మర్యాదలతో చూసినప్పటికీ ఆయనకి స్వాగతం పలికిన తీరు చాలా చప్పగా ఉందంటే తప్పు లేదు బారత రాజకీయ నాయకులు క్రయిస్తవేతర మతాలకి చెందిన నాయకులు పోప్‌కి కొంచెం దూరంగానే ఉండటానికి చాలా శ్రమ తీసుకున్నారు పోప్‌తో ప్రదానమంత్రి సమావేశం కూడా 20 నిమిషాలు మాత్రమే జరిగింది

ఇది ఉండవలసిన విదంగానే ఉన్నది కాథలిక్ చర్చి ప్రాబల్యం బాగా ఉన్న ప్రాంతంలో బాల్యం అంతా గడిపిన ఒక వ్యక్తిగా నేను ఇది రాస్తున్నాను గోవాలో ఇప్పటికీ చర్చిలు, క్రయిస్తవ ప్రార్థనా మందిరాలు ఎక్కువగా కనిపిస్తాయి అవి ఢిల్లీలోని మసీదులు, గోరీల కన్నా ఎక్కువే ఉంటాయి అయినా వాటి ప్రభావం మామీద చాలా తక్కువ మా హిందువులంతా కాథలిక్ స్కూళ్ళకి వెళ్ళేవాళ్ళం, కాథలిక్ ఉపాధ్యాయులు చెప్పిన పాఠాలని వినే వాళ్ళం, వారిలో చాలా బాగం పాదిరీలు ఉండేవారు కాథలిక్ రచయితలు రాసిన పుస్తకాలని చదివే వాళ్ళం కాథలిక్‌ల సంపాదకత్వంలో వెలువడే వార్తాపత్రికలని చదివేవాళ్ళం కానీ తట్టుకుని నిలబడగలిగామే కానీ వాటి ప్రబావానికి కొట్టుకుపోలేదు మతం మార్పిడి ప్రయత్నాలు సాగినా అవి ఫలించలేదు బయటికి మాలో చాలా మంది వారిలాగే ప్రవర్తించినా వారి వస్త్రదారణని, అలవాట్లని అనుకరించినా మాకు హిందువులుగా ఎలా నిలదొక్కుకోవాలో తెలుసు ఆ కారణం చేతనే 5 శతాబ్దాల కాథలిక్ పాలన కింద ఉన్నా హిందువులం హిందువులుగానే ఉండగలిగాము

నేను గోవాలో ఉన్నంత కాలం నాకు చర్చికి వెళ్ళినట్లు జ్ఞాపకం లేదు ఆ మాటకి వస్తే అసలు క్రయిస్తవుల ఇంట్లో బోజనం చేసిన గుర్తు కూడా లేదు ఈ బేదాలు మతపరమైనటువంటివి కానే కావు సంస్కృతికి సంబందించినవి

ప్రాదమికంగా ఇక్కడ ఈ రెండు మతాల వారికి మూలం ఒకటే అయినప్పటికీ కాథలిక్‌లకి ఉన్న తేడాల వల్లనే వారిని మా నుంచి దూరంగా ఉంచడం జరిగింది మా కాథలిక్ మిత్రులలో చాలా మందికి బారతీయ సంగీతాన్ని గురించి కానీ సాహిత్యాన్ని గురించి కానీ తెలియదు రామాయణ మహాబారతాల గురించి అస్పష్టమైన అబిప్రాయాలు ఉన్నాయి వారి బారతదేశ చరిత్ర అధ్యయనం కూడా ఆరవ శతాబ్ది ప్రారంబంలోనే ఆగిపోయింది మాట్లాడే భాష ఒక్కటే, వాళ్ళు, మేము కొంకణి మాట్లాడుతాము అయితే విద్యావంతులైన కాథలిక్కులు మాత్రం తమ పనివాళ్ళతో తప్ప ఇంట్లో కొంకణి మాట్లాడటానికి నిరాకరిస్తారు

దుస్తుల విషయంలో, ఆహారం విషయంలో మేము సంప్రదాయాన్ని పాటిస్తాము మా తాతగారు చిన్న ధోవతి తప్ప మరేమీ దరించే వారు కాదు మార్కెట్‌కి వెళ్ళేటప్పుడు మాత్రం ఒక శాలువా బుజాలపై కప్పుకునే వారు బిన్న సంస్కృతులు గల అన్ని సమాజాలూ సంప్రదాయాన్ని వదలలేనట్టివిగానే ఉంటాయి. ఇస్రాయిల్‌లోని యూదులు యూరోప్‌లో ఉన్న యూదుల కన్నా ఎక్కువ పూర్వాచార పరాయణులుగా ఉంటారు ఇస్రాయిల్‌లో వారికి వారే యజమానులు గోవాలో కాథలిక్‌లు ఎక్కువగానే ఉన్నా హిందువులు వారితో కలిసి పోకుండా వేరుగానే ఉన్నారు ఆపీసులు తదితరచోట్ల కలుసుకున్నా నివాసాలు మాత్రం వేరుగానే ఉంటాయి ఏది ఎలా ఉన్నప్పటికీ ఒక పెద్ద తేడా మాత్రం కనిపిస్తుంది మేము వారి మతపరమైన వేడుకలలో పాల్గొనకపోయినప్పటికీ వాళ్ళలో కొందరు మా ఉత్సవాలలో పాల్గొనేవారు రక్తంలోని జన్యువులు వారి హిందూ గతాన్ని విస్మరించక పోవటమే దానికి కారణం అవే వారిని మా మతపరమైన ఉత్సవాలలో పాల్గొనేలా చేసి ఉండాలి కాథలిక్ కుటుంబాలు కొన్ని-కొబ్బరి కాయలు బియ్యం మొదలైన వాటిని తీసుకు వచ్చి స్థానిక హిందూ దైవానికి అర్పించి ప్రసాదం తీసుకునే వరకూ ఇంటికి తిరిగి వెళ్ళేవారుకారు అన్నిచోట్లా ఇలా జరిగేది కాదు నగరాలలో, పెద్ద పట్టణాలలో కాక చిన్న పట్టణాలలో, గ్రామాలలో జరిగేది

ఒక జాతిని వేరు చేసేది మతం కాదు మతపరంగా ఏర్పడే సంస్కృతి పరమైన విబేదాలే దానికి కారణం కొన్ని సంవత్సరాల క్రితం వరకూ అన్ని కాథలిక్ పేర్లూ పోర్చుగీసు లేదా ఇంగ్లీషువిగా ఉండేవి ఇప్పుడు పరిస్థితి వేరుగా ఉన్నది కాథలిక్ పిల్లలలో శాలిని అశోక్ వంటి పేర్లు కనిపిస్తాయి నా చిన్నప్పుడు ఇలాంటివి ఎక్కడా వినిపించేవి కావు అయినప్పటికీ వారు మంచి కాథలిక్‌లే ప్రతి ఆదివారం వాళ్ళు చర్చికి వెళ్తారు బ్రిటన్‌లోని యూదులు ఎలా మంచి క్రయిస్తవులుగా ఉంటారో అలాగే, వీళ్ళు గూడా మంచి హిందువులుగా ఉంటారు నేనుహిందూ, క్రయిస్తవ అన్న మాటలని మతపరంగా ఉండే మామూలు అర్థంలో వాడటం లేదు సంస్కృతి పరంగా ఉపయోగిస్తున్నాను హిందూ సమాజంలో మంచి క్రయిస్తవుడిగా లేదా మంచి హిందువుగా ఉండటానికి వీలు ఉన్నది ఇటువంటి సమాజంలో హిందూ తత్వానికి హాని ఉదాహరణకి మతం మార్పిడుల వంటివి, చెయ్యని వారే మంచి క్రయిస్తవులు

నేను మొదటిసారిగా క్రయిస్తవ చర్చిని చూసింది లండన్‌లో వెస్ట్ మినిస్టర్ అబేని సందర్శించినప్పుడు అంతవరకూ అబే అన్నది క్రైస్తవ చర్చి అన్న ఊహ నాకు లేదు నేను అదొక రకం మ్యూజియం లాంటిదిగా బావించి ప్రసిద్ధ కవులు రచయితల సమాదులు చూద్దామని అక్కడికి వెళ్ళాను అది మొదలుకొని నేను రోమ్‌లోని సెయింట్ పీటర్స్ సహా అన్ని పెద్ద రోమన్ చర్చిలనీ సందర్శించాను పురాతనమైన ఈ దేవాలయాలని చూసిన ఎవరూ వాటిని మెచ్చుకోకుండా ఉండలేరు దానికి కారణం అవి దేవాలయాలని కాదు మన చరిత్రలో ఒక బాగం కాబట్టి కానీ నేను మాత్రం వాటిని చూసి అచ్చెరువొందలేదు పైపై వాటిని చూసి ఏ హిందువూ అంత తేలికగా అబ్బురపడడు ఢిల్లీలోని ఎర్ర కోటని తాజ్‌మహల్‌ని, న్యూయార్క్‌లోని ఆకాశహర్మ్యాలని చూసి నేను ఆశ్చర్యపోను ఈ నిర్మాణాలు అన్నీ బలవంతులైన రాజులు, ప్రబువులు నిర్మించినటువంటివి అదికారం కూడా మా హిందువులని ఆకట్టుకోలేదు దేనిలో అయినా అంతర్గతమైన సౌందర్యం, గొప్పతనం ఉన్నప్పుడే అది మమ్మల్ని ఆకట్టుకోగలుగుతుంది ప్రాపంచికమైన విషయాలని త్యజించిన వారి పట్ల ఆకర్షితులము అవుతాయి కానీ ప్రపంచాన్ని కత్తికి ఎర చేసే వారి పట్ల కాదు మిగిలిన చోట్ల లాగే క్రయిస్తవ ఇస్లామ్ మతాలు కత్తితోనే బారతదేశానికి వచ్చాయి అందుకే వాటిపై అనుమానం ఈ పోప్ శాంతి గురించి మాట్లాడవచ్చు అయితే గతంలో ఇతర పోప్‌లు అన్ని సమయాలలోనూ శాంతి గురించి మాట్లాడలేదు గోవన్‌లని శతాబ్దాల పాటు హింసించిన వారందరూ దేవుని పేరు మీద లేదా పోప్ పేరు మీదే మాట్లాడారు అల్బేనియన్ మహిళ ఒకరు కలకత్తాలో కొంతమంది పిల్లల ఆలనాపాలనా చూస్తున్నప్పటికీ మాకు అంటే హింసింపబడిన వారి పిల్లలకి మాత్రం క్రయిస్తవుల పాలన కన్నా సుదీర్ఘమైన ఆ జ్ఞాపకాలు అలాగే ఉంటాయి □

# ఎల్లప్పుడూ ఆంప్రోనే!

పిల్లలకు
ఆంప్రో అంటే ప్రాణం...
అందుకే ఎప్పుడూ
తయారుగా ఉంచుతాను!
అందులో ఎంతో రుచి,
బలమూకల బిస్కట్లు!

కాస్త ఆగండి...
ఒక్క బిస్కట్టును తినండి.




**ఆంప్రో గ్లూకోజ్ బిస్కట్లు**
**ఆంప్రో తో మీకు నాణ్యత ఖాయం.**

సీరియల్

# బ్రూస్ లీ చరిత్ర



యత్రగుంట్ల వరలక్ష్మీ దేవి

(గత సంచిక తరువాయి)

కుంగ్ఫూ స్కూల్లో చేరిన మొదటి రోజుల్లో కొన్ని పాఠాలు నేర్చుకున్నాక తన వీధి పోరాటం యెంత మెరుగు పడ్డిందో తెల్సుకునేందుకు తన జట్టుతో ప్రక్కసందుల్లో తిరుగుతుండే వాడు జట్టిల కోసం ఓసారి ఏం జరిగిందంటే మరో గాంగులీడరు తన ఆధిక్యతను నిరూపించడానికి బ్రూస్‌లీతో సవాల్ చేసేడు- మనిద్దరం ఆ కనిపించే అయిదంతస్తుల భవనంపై నున్న డాబాపైన పోట్లాడుదాం గెలిచిన వాడు ఓడిన వాడిని భవనం పై నుండి వీధిలోకి విసరేయొచ్చు అని పలికేన్నాడు బ్రూస్‌లీ ఉత్సాహంగా

అందరు ఆ భవనం పై నున్న డాబా పైకి చేరేరు బ్రూస్‌లీ చొక్కావిప్పి ఓ ప్రక్కకు పెట్టుంటే ఆ ప్రత్యర్థి యువకుడు బాణంలా వచ్చి కంటి మీద కాలితో తన్నేడు ఆ దెబ్బకు ఒళ్ళు మరచినంత కోపం వచ్చి బ్రూస్‌లీ విజృంభించి తన కాళ్ళతోను చేతులతోను కొట్టి ఆ శత్రువు రెండు చేతులు విరగకొట్టేసేడు ఆ యువకుడు ఓడిపోయి బాధతో డాబామీద కూల బడిపోయే సరికి గాంగుల్లో ఉన్న కుర్రాళ్ళందరు ఒప్పందం ప్రకారం బ్రూస్‌లీ ఆ ప్రత్యర్థిని ఎత్తి ఆ అయిదంతస్తుల పై నుండి క్రిందకు విసరి పారేస్తాడనుకున్నారు కాని బ్రూస్‌లీ అలా చేయలేదు ఆ మేడదిగి ఆ ఓడిపోయిన యువకుని బంధువులకు ఫోను చేసి వాడిని హాస్పటల్‌కి చేర్చమని చెప్పి పోయేడు

క్రమేపి కుంగ్ ఫూ విద్యలో ప్రావీణ్యం సంపాదించజొచ్చేడు బ్రూస్‌లీ మామూలు స్కూళ్ళలో అతని కోపాన్ని దౌష్ట్యాన్ని తట్టుకో లేక ఆ హెడ్ మాస్టర్లు టి సి ఇచ్చి పంపించి వేస్తుండేవారు తల్లితండ్రులకు బ్రూస్‌లీ వల్ల గుండెపోటు వచ్చేది కొందరు హెడ్‌మాస్టర్ల కాళ్ళు పట్టుకుని ఎలాగో స్కూలు చదువు పూర్తి చేయించాడు బ్రూస్‌లీ తండ్రి

1956 సంవత్సరంలో బ్రూస్‌లీ కాస్త బుద్ధి తెచ్చుకుని తన జోరు తగ్గించుకుని హాంకాంగ్‌లోని సెంట్ ఫ్రాన్సిస్ ఎక్సావియర్ కాలేజిలో చేరేడు కాలేజీలో చేరిన తరువాత బ్రూస్‌లీ చాల మారిపోయేడు సక్రమంగా క్లాసులకు వెళ్ళేవాడు కాలేజిలో ఎవ్వరితోను పోట్లాడేవాడు కాదు సిగరెట్లు త్రాగేవాడుకాదు చదువులో అంత తెలివి తేటలు ప్రదర్శించకపోయిన శ్రద్ధగానే చదివేవాడు

ఇంటర్ కాలేజి పోటీలలో పాల్గొని యూరోపియన్ విద్యయైన బాక్సింగ్ అంతగా తెలియక పోయినా తన నైపుణ్యంతో బాక్సింగ్ చాంపియన్ అయ్యేడు అలా మూడు సంవత్సరాలు సెంట్ ఫ్రాన్సిస్ ఎక్సావియర్ కాలేజిలో చదివేడు

బ్రూస్‌లీ ఆ కాలేజిలో ఆఖరి సంవత్సరం చదువుతుండగ అతడికి మళ్ళీ సినిమా ఛాన్స్ వచ్చింది ఆర్ఫన్ ఆ శామ్ అనే సినిమాలో కథానాయకుడు పాత్ర ఇచ్చేరు ఆ చిత్రములోని కథ అతడి నిజ జీవితమునుండి తీసుకున్నట్టుంది ఒక కుర్రాడు వీధి గూండా ముఠాలలో చేరి చిరుదోపిడీలు చేస్తుంటాడు ఆఖరికి పోలీసులకు చిక్కుతాడు జైలుకు పోతావా లేక స్కూలుకు పోతావా? అని న్యాయాధికారి అడుగుతే స్కూలుకు పోయి బుద్ధిగ చదువుకుంటానని జవాబు చెప్పి జీవితంలో నూతన అధ్యాయాన్ని మొదలు పెడతాడు- అది చిత్ర కథాంశం

గురువు ఇప్‌మాన్ కుంగ్‌ఫూ విద్యను బ్రూస్‌లీకి నేర్పుతూ అతడి యొక్క అగ్ని పర్వతం లాంటి మనస్తత్వాన్ని కాస్త చల్లార్చినా, బ్రూస్‌లీ అప్పుడప్పుడు గూండాలతో వీది పోరాటాలలో పాల్గొనడం పూర్తిగా మానుకోలేదు అందుకే బ్రూస్‌లీ అన్నయ్య పీటర్‌లీ బ్రూస్ హాంకాంగ్ వదలి అమెరికాకు పోవడమే మంచిదని తలచేడు

1958వ సంవత్సరంలో బ్రూస్‌లీ నటించిన 'అర్ఫన్ ఆ శామ్' హాంకాంగ్‌లో విడుదలై మన విజయాన్ని సాదించిన తరువాత బ్రూస్‌లీ తన సామానుని సర్దుకుని, నూరు డాలర్లను జేబులో వేసుకుని అమెరికాకు పడవలో ప్రయాణమయ్యేడు అప్పటికి అతడి వయస్సు పద్దెనిమిది సంవత్సరాలు

* * *

ఎన్నోవందల సంవత్సరాలు చైనాయొక్క యుద్ధనైపుణ్య విద్యలు చైనా దేశాన్ని దాటి పోలేదు అందుకే ఆ విద్యలు ఎవ్వరికి తెలియలేదు ఈ శతాబ్దంనుంచే ఆ యుద్ధప్రక్రియలు క్రమేపి ప్రపంచమంత తెలియ జొచ్చేయి

అసలు ఈ కుంగ్‌ఫూ విద్య ఏవిదంగా పుట్టిందో ఎవ్వరికి తెలియటం లేదు కొందరు శాస్త్రజ్ఞులు పరిశోదన ప్రకారం ఈ కుంగ్‌ఫూ విద్య నాలుగువేల ఆరు వందల సంవత్సరాల క్రితం మహారాజు 'హుసాంగ్‌డి' కాలంలో ఉద్భవించిందని తేలింది

కాని జనవాక్యమేమంటే క్రి శ 525వ సంవత్సరంలో 'దారుమా తాషి' అనే హిందూ సన్యాసి–అతడినే బోదిదర్ముడు అని ఆనాటి ప్రజలు పిలచేవారు–భారతదేశం నుండి చైనా దేశం వెళ్ళి అక్కడున్న 'లియాంగ్' వంశ సన్యాసులకు బౌద్ధమతం గురించి ప్రబోదం చేసేడు అతడు తన యాత్రలో హునాన్ మండలంలోనున్న 'షావలిన్' మఠానికి చేరి అక్కడ మతబోదనలు చేస్తుండేవాడు ఆ మఠంలోని సన్యాసులు చాల బలహీనంగా ఉండి, ఆ మఠాన్ని దోచుకునేందుకు అప్పుడప్పుడు దాడి చేసే బందిపోటు దొంగల నుండి తమ్ముతాము



బ్రూస్ లీ కండ పుష్టి

రక్షించుకొలేక పోవడం గమనించేడు

అప్పుడు బోధిదర్ముడు వారికి ఏకికింక్యో అనే పేరుగల 18 విదాలైన శారిరక, మానసికపరిశ్రమలను నేర్పేడు ఈ పద్దెనిమిది సాదనలే తరువాత యువాన్ రాజ్యపాలనలో యేన్ అనే మరో సన్యాసి 72 సాదనలుగా మలచేడు ఈ సాదనలే కుంగ్‌ఫూగ నేడు పిలవబడుతున్న యుద్ధ ప్రక్రియలకు మూల విద్యలైనాయి

ఆ విదంగా బౌద్ధ సన్యాసులు చైనా దేశంలో మతబోదనకై చేసిన యాత్రలలో వివిద స్థలాలలో వివిద మఠాలను స్థాపించినప్పుడు మత ప్రబోదనలతో పాటు స్వయం రక్షణకు ఈ కుంగ్‌ఫూ పోరాట ప్రక్రియలను కూడ నేర్పేవారు కాలక్రమాన ఓ నూరు కుంగ్‌ఫూ సంస్థలు వెలసినప్పటికీ, షావలిన్ మఠపరమైనటువంటివి, దానికి అనుగుణమైన హాంగ్ లీ, చోయి మరియు మోక్ అనే అయిదు సంస్థల విద్యలు ఈనాడు చాలా ప్రసిద్ధిగాంచేయి

చైనాలో కమ్యూనిస్టుల విప్లవం రాకపూర్వం, ఈ షావలిన్ బోదనాలయాలు అందులో ప్రసిద్ధి చెందిన, యుద్ధ నైపుణ్యత కల్గిన సన్యాసులు ఉండేవారు ఆనాడు ఒక్క చేతిదెబ్బతో 12 ఇటుకలను కూడ విరక్కొట్టే నైపుణ్యం దారుడ్యం గల కుంగ్‌ఫూ బోదకులుండేవారు ఈ కుంగ్‌ఫూ



## బ్రూస్‌లీ చరిత్ర

విద్యవలన శారీరకంగానే కాక మానసికంగా కూడ ఎంతో శక్తిని పొందేవారు కమ్యూనిస్టు విప్లవం జరిగినప్పుడు చాలమట్టుగ ఈ మఠాలను కమ్యూనిస్టు సైనికులు ధ్వంసం చేసెరు మఠాధిపతులు సన్యాసులు అడవులలోకి కొండలలోకి పారిపోయేరు తరువాత వచ్చిన చైనా ప్రభుత్వం కొన్ని మఠాలను పునర్నిర్మించినప్పటికి అందరు సన్యాసులు తిరిగి రాలేదు

కమ్యూనిస్టుల బాధి నుండి తప్పించుకుని పారిపోయిన కుంగ్‌ఫూ మాస్టర్లు కొందరు హాంకాంగ్‌లో నివాస మేర్పర్చుకొని అక్కడ ఈ పోరాట విద్యను నేర్పడానికి స్కూళ్ళను తెరచేరు కాలక్రమాన వారిలో ప్రసిద్ధిగాంచిన గురువు ఇప్‌మాన్ తననితాను కాపాడుకుంటు బాణంలా మాసుకోపోయి ప్రత్యర్థిని కొట్టడంలో నైపుణ్య ముండాలన్నది ఇప్‌మాన్ గురువు సిద్ధాంతం బ్రూస్‌లీ కుర్రవాడిగ ఏది పోరాటలలో నేర్చుకున్నది మరో విధమైన పోరాటం ఇప్‌మాన్‌కి మల్లే ఒకేవిధమైన పద్ధతిని అవలంబించకుండ పోరాటాలలో ప్రత్యర్థి పొరపాటలను గమనించి పోరాడటంలో బహు నేర్పరి అయినాడు బ్రూస్‌లీ

ఆఖరికి అన్ని పద్ధతులను క్షుణ్ణంగా నేర్చుకుని వాటిలోని మేటి ప్రక్రియల్ని కలగలిపి ఓ కొత్త పద్ధతిని ప్రవేశపెట్టేడు దానిపేరే జీత్‌కునేదో – అంటే అన్ని దాడులను చేతులతో ముఖ్యంగ ఎదురుకునే పద్ధతి

బ్రూస్‌లీ అంతతో విరమించక ఇతర దేశస్తులు వాడే పోరాట ప్రక్రియల్ని నేర్చుకున్నాడు కుంగ్‌ఫూలోని అన్ని రీతులు కరాటే జూడో బాక్సింగ్ కుస్తీ విధానాలు యూరోపియన్స్ చేసే ఫ్రెన్సింగ్ కుస్తీలు థాయిలాండ్‌వారు కాళ్ళతో తంతు చేతులతో బాక్సింగ్ చేసే విధానం మొదలైనవి ఆఖరికి అమెరికా నగర సందులలో గుండాలు తన్నే రీతుల్ని తెల్సుకున్నాడు తన పోరాటాలలో తన ప్రత్యర్థి ఉపయోగించే పోరాట విధానాన్ని కనిపెట్టి దానిని ఎదుర్కొనే పద్ధతిని తను వాడేవాడు

హాంకాంగ్‌లోని బ్రూస్‌లీ లైబ్రరీలో వందల కొలది పుస్తకా లుండేవి యుద్ధ నైపుణ్యంమీద పోరాట పద్ధతులపైన ఏ ఒక్క వ్యక్తి అన్ని పుస్తకాలను ఆ విషయంపై జమచేయడం దుర్లభమని చెప్పొచ్చు అవన్ని చదివి అందులోని ముఖ్యమైన అంశాలను గుర్తించుకుని తన పోరాట రీతులలో పొందుపర్చేవాడు

మన సినీ కథానాయకులకు మల్లే దొంగ పోరాటాలు స్లోమోషన్ కొట్టుకోడాలు కావు నిజంగా పోరాటాన్ని ఓ విలువైన కళగ అభ్యసించి వాస్తవంగా పోరాడి తన నైపుణ్యాన్ని సినిమాలలో ప్రదర్శించేవాడు

బ్రూస్‌లీ 5 అడుగుల 7 1/2 అంగుళాల ఎత్తుండేవాడు మంచి కండపుష్టితో నుండేవాడు అతడి శరీరమే ఓ పవర్ హౌస్ లాంటిది సినిమాలలో అతడు చూపెట్టిన పోరాటాలు ఏవీ ట్రిక్ ఫోటోగ్రాఫితో కూడుకున్నవి కావు అతడు వాస్తవంగా చేసి చూపెట్టినవే

(ఇంకావుంది)

# దైవత్వాన్ని ఆపాదించుకోని ప్రముఖ తత్వవేత్త "జె. కె."



పుట్టింది ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని మదనపల్లిలో అయినప్పటికీ, మన రాష్ట్రంలో కంటే యితర రాష్ట్రాలలోను మనదేశంలో కంటే యితర పాశ్చాత్య దేశాల్లోను ఆయన్ను ఒక మహాతత్వవేత్తగా ప్రజలు ఎరుగుదురు పేరు పక్కా ఆంధ్ర ప్రాంతానికి చెందినప్పటికీ, ఆయన పూర్తి జీవితం యించుమించు విదేశాల్లోనే కొనసాగింది ఆయన మరెవరో కాదు అసలైన, నిసలైన బ్రహ్మచారి, తత్వవేత్త, రచయిత, విద్యావేత్త శ్రీ జిడ్డు కృష్ణమూర్తిగారు

కృష్ణమూర్తిగారిని, ఆయన సహచరులంతా 'కృష్ణాజీ అని పిలుచుకుంటారు కృష్ణమూర్తి గారు, మే 11, 1895 లో ఒక బ్రాహ్మణ కుటుంబంలో జన్మించారు ఆయన తల్లిదండ్రులకు కృష్ణమూర్తి గారు ఎనిమిదవ సంతానం కావడం మూలాన ఆంధ్రుల ఆరాధ్య దైవం శ్రీకృష్ణ పరమాత్మ కూడ ఎనిమిదవ సంతానం కావడం మూలాన కృష్ణమూర్తి గారికి ఆ పేరు పెట్టుకొన్నారట ఆయన తల్లితండ్రులు

కృష్ణమూర్తిగారి తల్లి ఆయన ఏడవ ఏటనే కాలధర్మం చెందడం మూలాన ఆయన బాల్యం అంతా కూడ సంతోషం లేకుండానే గడిచింది ఆయనను సరిగా పెంచి పెద్ద చేసేవారు లేకపోయారు తన ప్రాథమిక విద్యలో కృష్ణమూర్తి గారు ఫెయిల్ అయినప్పటికీ, ఆయన తండ్రిగారు కృష్ణమూర్తి గారిలో ప్రకృతిపై లోతైన జిజ్ఞాస ప్రేమ వున్నట్లుగా గుర్తించారు ఆయనకు స్కూలు పుస్తకాల కంటె నిశ్శబ్ద వాతావరణంలో ప్రకృతిని ఆస్వాదించడం అంటే ఎంతో వుత్సాహాన్ని కనబరిచే వాడు

కృష్ణమూర్తిగారి తండ్రి జన్మతః వైదిక బ్రాహ్మణ కుటుంబీకుడైనప్పటికి 1909 లో మద్రాసులోని అడయార్‌లో డా అనిబిసెంట్ నిర్వహిస్తున్న ది థియోసాఫికల్ సొసైటీలో చురుగ్గా పాల్గొన్నారు ఈ సొసైటి 1875 లో కొలొనల్ హెన్రీ అల్కాట్ చే యునైటెడ్ స్టేట్స్‌లో నెలకొల్పబడింది వివిధ మతాల సిద్ధాంతాలకు అన్వయించి చూడడం, ప్రకృతిలో సమాధానం లభించని సూత్రాలను వెలికి తీయడం మానవ జాతికి సంబంధించి మరుగున పడి వున్న ఎన్నో ముఖ్యాతి ముఖ్యమైన విషయాలను వెలికి తీయడం వంటి విషయాలకు ప్రోత్సాహాన్ని కలిగించడమే ఈ సొసైటి యొక్క ముఖ్య ఉద్దేశ్యం సొసైటికి కేంద్ర స్థలం మనదేశంలోని తమిళనాడు 'అడయార్' అన్నమాట! ఇక్కడే డా అనిబిసెంట్‌కు అతిముఖ్యమైన సహచరుడు అయినటువంటి సి డబ్ల్యు లెడ్‌బీటర్ కృష్ణమూర్తిగారిని మొదటిసారిగా చూచి, అప్పటికప్పుడే ప్రపంచ బోధకుడితడే సుమా! అని ప్రకటించాడు

ఒకరోజు కృష్ణమూర్తిగారు తన సోదరుడైన నిత్య'తో ఆడుకుంటున్నసమయంలో, ఆయనలో నుంచి వెలువడుతున్న స్వచ్ఛమైన తేజస్సును లెడ్ బీటర్ గుర్తించగలిగాడు ఇదే విషయాన్ని ఆయన డా అనిబిసెంట్‌తో ముచ్చటించగా కృష్ణమూర్తిగారిని, ఆయన సోదరుడు నిత్యను ఆవిడ సంరక్షణలోనికి తీసుకోవడం జరిగింది

1910 సెప్టెంబరు నెలలో డా అనిబిసెంట్ ఈ సోదరులనిద్దరిని తీసుకొని వారణాసికి బయలుదేరింది శాంతి కుంజ్ అనే ఆవిడ నివాసంలో వారిని వుంచడం జరిగింది

ఒక సందర్భంలో, శ్రీమతి అనిబిసెంట్ కృష్ణమూర్తి సోదరులకు అతి ప్రతిష్టాకరమైన ఆక్స్‌ఫర్డ్ కళాశాలలో, ప్రవేశం కొరకు ప్రయత్నించినప్పుడు ఆ కళాశాల అధిపతి అన్ని లోకరక్షకులకు (మెస్సయా) బోధించేంతటి సామర్థ్యం యీ కళాశాలకు లేదు అన్నాడు దీన్ని బట్టి కృష్ణమూర్తి గారిలో, బాల్యంలోనే తత్వవేత్త లక్షణాలు బహిర్గతమయినట్లుగా తెలుస్తోంది కృష్ణమూర్తిగారు, తన తండ్రిగారితో తెగతెంపులు చేసుకొన్న తరువాత, డా అనిబిసెంట్, ఆవిడ అనుచరుడైన లెడ్ బీటర్, కృష్ణమూర్తిగారిని ఏసుక్రీస్తు అంతటి ప్రపంచ ప్రబోధకుడుగా తయారు చేయాలని నిశ్చయించుకొన్నారు

విద్యాభ్యాసాన్ని ఓ మూలకు నెట్టి ఒకచోటి నుంచి మరో చోటికి ప్రయాణం సాగించి ఎన్నో ప్రదేశాలు తిరిగారు మూర్తిగారు తరువాత కాలిఫోర్నియాలోని 'ఓజా కు చేరుకున్నారు అప్పటి నుంచి ప్రకృతి ఒడిలో నిర్విష్టమైన తపస్సును కొనసాగిస్తూ ఒంటరి జీవితాన్ని గడపడం మొదలు పెట్టారు

అప్పటి నుంచి ఆయనలో మానవాతీతమయిన అనేక లక్షణాలు కన్పిస్తూ వచ్చాయి ప్రజలు ఆయన్ని ప్రపంచ రక్షకుడుగా గుర్తించడం మొదలు పెట్టారు ప్రపంచమంతటా ఆయన శిష్యులు వేలల్లో తయారయ్యారు అయితే కృష్ణమూర్తి గారికి యిదంతా యిష్టం లేదు ప్రపంచ రక్షకుడిగా తనను ఆరాధిస్తూ, తన వద్దకు చేరిన అనేకమందిని ఉద్దేశిస్తూ కృష్ణమూర్తిగారు "నాకు శిష్యులెవరూ లేరు మీ ఊత కర్రగా నన్ను మీరు వూహించుకోవడం నాకు యిష్టం లేదు పూజ అనే పంజరంలో బంధింపబడడం నాకు యిష్టం లేదు అన్నారు ఇది విని నిర్ఘాంతపోయిన తన అనుచరుల నుద్దేశిస్తూ నేను మళ్లీ చెబుతున్నాను నాకు శిష్యులు లేనేలేరు' అని నొక్కి చెప్పారాయన ఈ సంఘటన 1928 లో జరిగింది

1929 లో ఆయన థియోసాఫికల్ సొసైటి అధ్యక్ష పదవికి రాజీనామా యిచ్చారు వ్యక్తి మానసిక పరివర్తన ద్వారానే సమాజంలో మార్పు ప్రపంచ శాంతి సాధ్యమని ఆయన ప్రకటించారు కృష్ణమూర్తిగారికి ప్రత్యేకమయిన సిద్ధాంతాలంటూ ఏమీ లేవు ఎలాంటి సిద్ధాంతాలు మతాలు లేకుండా స్వేచ్ఛగా స్వచ్ఛంగా వుండాలన్నది ఆయన సందేశం

ప్రపంచ యుద్ధకాలంలో, డా అనిబిసెంట్ మరణానంతరం కృష్ణమూర్తిగారు - కాలిఫోర్నియాలోని ఓజా' లోనే స్థిరపడి పోయారు చాల మట్టుకు సమయాన్ని ఆయన ఒంటరిగానే గడిపారు

పది సంవత్సరాల అనంతరం, అంటే 1984 లో కృష్ణమూర్తి గారు మనదేశానికి వచ్చారు ఆ సమయంలో మనదేశంలో జరుగుతున్న హింసను రక్తపాతాన్ని, మహాత్మాగాంధీ హత్యను నిరసించడానికే ఆయన స్వదేశం తిరిగి వచ్చినట్లు అన్పిస్తుంది

చిచ్చులా రగిలిన హింస యుద్ధాలు, హత్యలు, లంచగొండితనం, మట్టిగరిసిపోతున్న నైతిక విలువలు ఆయన్ని దిగ్భ్రాంతుణ్ని చేశాయి మానవ భవిష్యత్తు గురించి వాపోయారాయన

కృష్ణమూర్తి గారు అప్పుడప్పుడు మనదేశం వచ్చి తమిళనాడులోని కృష్ణమూర్తి ఫౌండేషన్ లో ప్రసంగిస్తూ వుండేవారు

గతనెల మొదటి వారంలోనే కృష్ణమూర్తిగారు మద్రాసు నుంచి కాలిఫోర్నియాకు వెళ్లారు

90 సంవత్సరాల వయస్సున్న శ్రీ జిడ్డు కృష్ణమూర్తిగారు చాలకాలంగా కాన్సర్ పాలిక్రియాస్ తో బాధ పడుతున్నారు ఫిబ్రవరి 17వ తేదీన ఆయన కాలిఫోర్నియాలోని 'ఓజా'లో తమ స్వంత కుటీరంలోనే ఆయన కన్ను మూసారు

ప్రవక్తలుగా దేవుళ్ళుగా ప్రకటించుకొని ఎన్నో మోసాలతో శిష్యగణాన్ని తప్పుడు త్రోవలు తొక్కించి పూర్తి వాతావరణాన్నే కాలుష్యం చేస్తున్న స్వామీజీలున్న యీ కాలంలో, కృష్ణమూర్తిగారి వంటి అసలైన సిసలైన తత్వవేత్త దివంగతులు కావడం ప్రపంచ శాంతి కాముకులకు ప్రజావనికి తీరని లోటు అవుతుంది

— డా కె ఎల్ వి ప్రసాద్

# బిలాంగింగ్స్

## ఆళ్ళ కృష్ణవేణి

"బ్రాహ్మణ జన్మ ఎత్తాక వంటరాని మగాడు వుండడు ఒంటరితనం అనే చింతలేకపోతే హాయిగానే బ్రతకగలం నేను గుండ్రాయిలా బాగానే వున్నాగా, ఇప్పుడే మీ యిళ్ళకి వచ్చి కూర్చొని వుండటం ఎందుకో? అన్నది నా అభిప్రాయం తమతో రమ్మనమని బలవంతం చేస్తున్న పిల్లలతో అన్నారు శాస్త్రిగారు

శాస్త్రిగారి భార్య గోమతి పది రోజుల క్రితం హఠాత్తుగా కన్నుమూసింది వారికి ముగ్గురు కొడుకులు ఒక కూతురు నలుగురు నాలుగు వేపుల వున్నారు తల్లి చావు కబురు విని కుటుంబంతో సహా వచ్చి వాలారు

పెద్ద కర్మ అయ్యింది

తరువాత పెద్దకొడుకు రామశాస్త్రి - నాన్నా అంత దూరం నుండి సంవత్సరికం కోసం రావాలంటే బోల్డు ఖర్చు, పైగా సెలవు దొరకదు అని నాన్నాడు.

మరి చేయాలిగా బ్రాహ్మణ జన్మ ఎత్తాక శాస్త్రిగారు అన్నారు

సంవత్సరికం కూడా యిప్పుడే చేయించేస్తే

సంవత్సరికం యిప్పుడు చేయించడమేమిటిరా? చోద్యం కాకపోతే బ్రాహ్మణ జన్మ ఎత్తి పుట్టేక యింతవరకూ నేను కనీవినీ ఎరుగలేదు

అది కాదు నాన్నా! ఆ కాలంలో అంటే అంతా ఒకే చోట వుండేవారు కాబట్టి మాసికాలు సంవత్సరికాలు చేసేవారు మరి! మేము దూరాభారంలో వుంటున్నప్పుడు నసిగాడు లక్ష్మణశాస్త్రి

అయినా కర్మఅయిన వెంటనే సంవత్సరికం ఏమిటోయ్'

ఇప్పుడు పెద్ద పెద్ద పట్టణాలలో అంతా ఒకేసారి చేస్తున్నారు రామశాస్త్రి అన్నాడు

ఎలాగైతేనేం కొడుకులు తండ్రిని ఒప్పించారు

సంవత్సరికం శాస్త్రోక్తం అయింది

పుణ్యా వచనం అయింది

అంటే ఆ యింటిలో చావు మాసిపోయిందన్న మాట

మామూలు లోక వ్యవహారాలు చూచుకోవచ్చన్న మాట అప్పుడే పెద్దకొడుకు తండ్రిని తనతో వచ్చేయమన్నాడు

రెండో కొడుకు తనతో రమ్మనమన్నాడు అలానే మూడో కొడుకు కూతురు వరలక్ష్మి కోరారు

శాస్త్రిగారు గర్వించారు శరీరం వుప్పొంగిపోయింది వెళ్ళాలనే అన్పించింది అయినా అరగ్గనే అంగీకరించకూడదనే భావనతో నే పైమాట అన్నారు

"వంట చేసుకోగలిగినా ఒంటరిగా ఎన్నాళ్ళని వుండగలరు? కొడుకులు అన్నారు

అది నిజమేననుకో! ఇంత యిల్లు యీ సామాను ఏం చేసేది? బాధగా అన్నారు

ఇంటి నిండా బోల్డు అంత సామాను సాధారణంగా చదువుకున్న వారిని పెద్దవారిని మీ హాబీ ఏమిటి అని ప్రశ్నిస్తారు చదవడమో రాయడమో చిత్రకళ ఇలా చెప్పుకుంటారు

చదువు అన్నది అసలు లేకపోయిన గోమతికి షాపింగ్ పైత్యం చాల ఎక్కువ చెప్పుకోవాలంటే హాబీలలో అతి ఖరీదైన హాబీ అన్నమాట ఒక చీర కావాలని గాని ఒక నగ కావాలని గానీ అడగదు, గానీ నెలకి ఒకసారి అయినా బజారుకు వెళ్ళి నాలుగు అంగళ్ళు తిరిగిఏదో ఒక వస్తువు కొనందే ఆమెకి నిద్ర రాదు

అలా కొన్న సామానులు స్టీలు సామానులు యిత్తడివి, రకరకాల వాల్ పేట్లు, పూలవాజులు ఫర్నిచరు అంతా యింతా కాదు క్రొత్తగా ఎవ్వరైనా ఆ యింటికి వస్తే ఎగ్జిబిషన్‌లో చూసినట్లే చూడవచ్చు అన్ని రకాల సామానులు

అసలు హేండ్ బ్యాగులే ఓ వందైనా వుండి వుంటుంది అయితే ఒకనాడు ఒక్క పర్సు పుచ్చుకొని బయటికిపోయిన పాపాన పోలేదు

ఎంత ఖరీదైనా సరే చిత్రపటాలు కొనేది మంచి అభిరుచులు

పురాణాలలో వర్ణించిన బ్రాహ్మణ ముత్తైయిదుగానే కనిపించిన ఆమె అంతరాంతరాలలో ఎన్నో ఆధునికమైన ఆదర్శమైన భావాలు వుండేవి అందుకే అత్తగారు ఎంత వద్దని మొత్తుకున్నా పెద్ద పిల్ల అయిన తరువాత కూడా వరలక్ష్మిని స్కూలుకి పంపి ఎస్ ఎస్ యల్ సి వరకూ చదివించింది

పురాణాలు చదివేది కావ్యాలు చదివేది నవలలు చదివేది అవి అన్ని కొని భద్రంగా దాచుకుంది నెల నెల కలరా వుండలు కొని పుస్తకాల మధ్య వుంచేది.

చిన్న లైబ్రరీనే యింటిలో వున్నది ఈ పుస్తకాలన్నీ ఏం చేయాలి ప్రతి పుస్తకం మీద అది పూర్తిగా చదివిన తరువాత తన అభిప్రాయాన్ని విపులంగా వ్రాసి ముందు పేజీలో అంటించి వుంచింది

పుస్తకం చదవడం ఒక ఎత్తు అయితే ఆమె అభిప్రాయాలని చదవడం యింకో ఎత్తుగా వుండేది శాస్త్రిగారికి

ఎప్పుడైనా భార్యని వుడికించాలనే చిలిపి కోరిక కలిగినప్పుడు ఆమె అభిప్రాయానికి వ్యతిరేకంగా వాదన లేవదీసేవాడు చిత్రంగా ఆ వాద ప్రతి వాదనలలో నే తెల్లవారి పోయేది

ముప్పై ఎనిమిది సంవత్సరాలు ఆమెతో కాపురం చేసినా అది నిన్నా మొన్నటిలానే వుంది అసలు రిటైయిర్ అయితే - కాలక్షేపం కావడం చాల కష్టం అని అందరూ అనేకవిధాల బయపెట్టారు

తనకి అది క్షణాలుగానే నడచింది

యవ్వనాన్ని ఎప్పుడో దాటి వేశారు కాబట్టి వారిద్దరి మధ్య ఆకర్షణలేదు అనుబంధం అనురాగం స్నేహం తప్ప ఇద్దరూ కూర్చొని సాహిత్య చర్చ చేసుకునేవారు

శంకరాభరణం సినిమా నచ్చింది కాబట్టి. త్యాగయ్య సినిమా కూడా బావుంటుందని వెళ్లారు

అది చూస్తూ గోమతి చక్కటి వ్యాఖ్యానం చేసింది

ఏమిటండి' మన వివాహం అయిన క్రొత్తలో నాగయ్యతో త్యాగయ్య సినిమా వచ్చింది అది చూస్తూ వుంటే పంచభక్ష్యపరమాన్నాలతో చవులూరించే విందు భోజనం చేసినంత తృప్తి కలిగింది

ఇప్పటి యీ త్యాగయ్య చూస్తూ వుంటే - వయస్సు అయింది, తిండి తగ్గించండి, వుప్పు కారం లేని చప్పటి కూరలు తినండి అని డాక్టర్లు అంటే తినే చప్పటి భోజనంలా వుంది అప్పుడు మనకి వయస్సు వుంది యిప్పుడు లేదు అని అంది

ఎంత చక్కగా పోల్చింది

అటువంటి యిల్లాలు పోగు చేసే పుస్తక సంపదని భద్రపరచడం కోసం నానా తిప్పలు పడి గవర్నమెంటు లోను శాంక్షను చేయించుకుని యీ యిల్లుని ముచ్చటగా కట్టుకున్నాడు ఇంట్లో విజ్ఞాన సంపదని పొందుపరిస్తే, యింటి ముందు కనులు విందు చేసే పూదోట. వెనుక కాయగూరల పాదులు

అటువంటి యీ యింటిని ఏం చేయాలి? అద్దెకివ్వాలంటే యీ సామానేం చేయాలి?

తాళం వేస్తే మొక్కల సంరక్షణ ఎవ్వరు చేస్తారు?సమస్యని పిల్లల ముందు వుంచారు శాస్త్రిగారు

పిల్లలు తృటిలో సమస్యని పరిష్కరించారు

నగలు పంచాలి సామానులు పంచుకోవాలి

అక్కర్లేనివి అమ్మేయాలి మా యిళ్ళు చిన్న చిన్నవి కాబట్టి వెదవ ఈ పుస్తకాలు మోసుకెళ్ళి ఏం చేసుకుంటాము వాటిని కూడా సెకెండ్ హేండ్ పుస్తకాల షాపుకి అయినకాడికి అమ్మి సొమ్ము చేసుకోవడమే అని అన్నారు

బాకు గుండెల్లోకి చివ్వున దించినట్లు ఆ రక్తం కళ్ళల్లోకి చిందినట్లు అనిపించింది శాస్త్రిగారికి

వీళ్ళు చదువుకున్న వారే కదా! అన్నిటికన్నా పుస్తకాలనే గొప్ప ఆస్తిగా తలవాలనే? వీళ్ళేమిటి ఒక్క చిటికెలో ఇలా అన్నారు అని చాల బాధపడ్డారు

ఇంకా వారి నోటి నుండి ఏమేమి వినవలసి వస్తుందోనని భయపడి ప్రస్తుతానికి సంభాషణలకి చుక్క పెట్టేశారు శాస్త్రిగారు

నేనసలికే గుండె నీర్సం మనిషిని ఒక రోజు బాగుంటే యింకొక రోజు బాగోదు నాకు బాగున్ననాడు పప్పుచారు చేసి లేవనినాడు చింతపండు చారు చేసి కాలక్షేపం చేస్తున్నాం మీ నాన్నగారిని మనతో తీసుకుని వెళ్తే రోజూ ఒక అదరువు అయినా చేయాలి అది నావల్ల కాదు బాబు పెద్ద కోడలు మొగుడితో మొరపెట్టుకుంది

అవ్వా కావాలి బువ్వా కావాలి అంటే ఎలానే పెద్ద పిల్ల పెళ్లో అని గోల చేస్తున్నావా? యీ



సంవత్సరం రెండో వాడిది ప్లెస్ టు అయితే యింజనీరింగు సీటుకి ప్రయత్నించాలా? దానికి డొనేషనుకి మూట కావాలి కదా! ఇదంతా ఎక్కడి నుండి తేను సిటీలో నా సంపాదన పెద్దదేగానీ లంకల మేత గోదావరి యీతలా వచ్చే జీతం యింటి అద్దెకు పెట్రోలు ఖర్చుకు సరిపోతోంది మా నాన్న మనతో వచ్చేస్తే యిల్లు అమ్మవలసి వస్తుంది ఆయన పి యఫ్, ఇన్సూరెన్సు డబ్బు వుంది అది నలుగురికి పంచితే మన గండం గడుస్తుంది అని అనగా విన్నారు

ఇది క్రొత్త విషయం కాదు, తనకి తెలియంది కాదు తరతరాలుగా తండ్రులు పొందే శాపమే

శాస్త్రిగారు రాత్రంతా ఆలోచించారు ఇన్ని రోజులు తన పరంగా ఆలోచించుకొన్నారు ఈనాడు వాళ్ల పరంగా ఆలోచించగా సమస్యకి పరిష్కారం దొరికినట్లు అయింది

మరునాడు చిన్నకొడుకు కొంచెం తొందర స్వభావం కలవాడు కావడం వలన - నాన్నా మీ విషయం తెలియజేస్తే లీవు పొడిగిస్తాం లేదంటే ప్రస్తుతానికి వాయిదా వేసి మేము వెళ్తాం అని అన్నాడు

శాస్త్రిగారు బ్రీఫ్‌కేస్ వారి ముందు వుంచి తెరిచారు అందులో నగలు నోట్ల కట్టలు వున్నాయి

అందరి కళ్లు మెరిశాయి

బాబూ! మీరు నలుగురు మా సంతానం అందరూ మాకు సమానమే వరలక్ష్మికి కట్నం యిచ్చి పెండ్లి చేసాం కాబట్టి ఆమెకు డబ్బులో వాటా లేదు తల్లి నగలు ఆడపిల్లకే కానీ మీ అమ్మకి తన నగలని కోడళ్ళకి యివ్వాలని ఆశగా వుండేది వున్న నగలని ఐదు వాటాలు వేసి, వరలక్ష్మికి రెండు వాటాలు యివ్వండి పి యఫ్, ఇన్సూరెన్సు డబ్బు యాభైవేలు వచ్చింది దానిని మీ ముగ్గురు పంచుకోండి వరలక్ష్మి కొడుకు తాతా స్కూటర్ కొనుక్కుంటాను అని అడిగాడు వాడికో ఐదు వేలు యిచ్చి మిగిలింది







**బేబీ డార్లింగ్,**

మీరు తీసుకోండి,

వెండి సామానులు స్టీలు సామానులు పంచుకోండి

నాన్నా! మరి యిల్లు పెద్ద కొడుకు ఆత్రంగా అన్నాడు

నేను బ్రతుకున్నంత కాలంలో యీ ఇల్లుని నేను అమ్మనురా! అది నా కష్టార్జితం అందులో నా ప్రతి అణువులో నాజీవిత జ్ఞాపకాలు వున్నాయి ఒక్కొక్క కోణంలో చూస్తే ఒక్కొక్క సంఘటన నా కళ్ళకట్టినట్లు వుంటుంది వాటిని చూచుకుంటూనే నా శేష జీవితాన్ని గడపగలను మీ ఇంటికి రావడం వలన నాకు తొత్తిగా తోచదు అలా వీదిలోకి వెళ్తే పదిమందిలో ఒక్కరైనా తెలిసినవారు కనిపిస్తారు ఆ వూరిలో నాకెవరున్నారు నాకు భయంగను వస్తుంది నా ఒంటి కట్టెకి అది చాలు మీరు ఆర్థిక సహాయం నాకు చేయవలసిన పనిలేదు నా కాలు చెయ్యి బాగా వుంచినంత కాలం నేను యిక్కడే వుంటాను తరువాత విషయం అప్పట్లో మీ చేతుల్లో వున్నది అని తేల్చారు

దంచినమ్మకు బొక్కిందే దక్కుడు అన్నట్లు ఏదో ఇధైనా వచ్చింది ఇది చాలు ఇంకో మనిషి బాధ్యత మీద పడకుండా -

నగలకి కంసాలిని తెచ్చి తూకాలు వేసుకొని క్రిందా మీదా పడి పంచుకుని సొమ్ము వారు భద్రపరచుకొని, స్టీలు సామాను వెండివి కూడాపంచుకుని మూటలు కట్టి రిజర్వేషన్లు లేకపోయినా పారిపోయారు

ఆఖరికి శాస్త్రిగారు, తినే వెండి కంచం కూడా పంచుకొని తీసుకొని వెళ్లిపోయారు

ఇల్లు బోసిపోయినట్లు అయింది

ఒక్క పుస్తకాన్నిగానీ ఒక్క బొమ్మనిగానీ ఎవ్వరూ ముట్టలేదు

పిల్లలకి తల్లిదండ్రుల గుణాలే వారసత్వంగా వస్తుందని అంటారు గోమతికి వుండే సాహిత్యాభిలాష నలుగురి పిల్లల్లో ఒక్కరికైనా రాకపోవడం శాస్త్రి గారికి చాల విచారాన్ని కలిగించింది

* * * * *

కుయ్ కుయ్ కుయ్ కుక్క పిల్లలు ఒకటే ఏడుస్తూ వున్నాయి

అవి ఎందుకో రాత్రంతా నిద్రపోకుండా అలా ఏడుస్తూనే వున్నాయి

శాస్త్రిగారు గతంలో నుండి బయటికి వచ్చారు అర్ధరాత్రి అయింది

ఏమైనా వయసులో వున్నప్పుడు కంటే వయస్సైన కాలంలోనే తోడు కావాలి గోమతి వున్నప్పుడు రోజులు క్షణాల్లా గడిచేవి

ఒక్కొక్క రోజు ఒక్కొక్క పుస్తకాన్ని తీసుకొని దాని గూర్చి పూర్వాపరాలు చర్చించుకుంటూ కూర్చుంటే గడిచిన కాలమే తెలిసేది కాదు

అచ్చ తెలుగు రామాయణం చదువుతూ వుంటే ఆరే మన తెలుగులో ఎన్ని రకాల శబ్దాలు వున్నాయి అని ఆశ్చర్యం కలిగేది

గోమతి లేదు ఆమె పొందుపరచిన సంపదే పెద్ద ఆస్తి

అయినా ఒంటరి ప్రాణం

ఒకసారి ఒక స్నేహితుడింటికి వెళ్తే వాళ్ళ యింట్లో వున్న బొచ్చు కుక్క పిల్ల పిల్లలని వేసింది చిన్నవిగాతెల్లగా బొద్దుగా ముద్దుగా వున్నాయి

శాస్త్రిగారు ముచ్చటపడ్డారు తనకి ఓ రెండు యివ్వమని అడిగారు స్నేహితుడు సంకటస్థితిలో పడ్డాడు స్నేహితుడికి డబ్బుకి అమ్మలేడు, అలా అని వూరికే వాటిని వదులుకోలేడు ఇది గ్రహించి ఓ నెయ్యి తీసి అక్కడ కుర్చీలో పెట్టి రెండు పిల్లలు రెండు చేతుల్లో పుచ్చుకొని బయటికి నడిచారు

గోము, రాము అని వాటికి పేరుపెట్టారు పిల్లలు అందంగా ముద్దుగా వున్నాయి

తెల్లవారు ఝామునలేచి పాచి తుడిచి కల్లాపు

# స్కూల్ ఆఫ్ కరస్పాండెన్సు కోర్సెస్

## ఆంధ్ర విశ్వవిద్యాలయం, విశాఖపట్నం - 530003

## ఎంట్రెన్సు పరీక్ష ప్రకటన

ఏ విధమైన ఫార్మల్ విద్యార్హత లేకుండా సరాసరి బి.ఎ./బి.కాం. కోర్సుల ప్రవేశమునకు ఎంట్రెన్సు పరీక్ష.

భారతదేశ నివాసులైన అభ్యర్థులనుండి 1986-87 విద్యా సంవత్సరానికి బి.ఎ./బి.కాం. కరస్పాండెన్సు డిగ్రీ కోర్సుల మొదటి సంవత్సర ప్రవేశమునకు దరఖాస్తులు కోరబడుచున్నవి.

ఈ ఎంట్రెన్సు పరీక్షకు హాజరగుటకు ఏవిధమైన కనిష్ఠ విద్యార్హత అవసరం లేదు. అభ్యర్థులు ది. 1-7-1986 నాటికి 20 సం.ల వయస్సు నిండి ఉండాలి. ఎంట్రెన్సు పరీక్షలో ఉత్తీర్ణులైన అభ్యర్థులు బి.ఎ., బి.కాం. కోర్సులకు స్కూల్ ఆఫ్ కరస్పాండెన్సు కోర్సెస్‌లో మొదటి సంవత్సర ప్రవేశమునకు అర్హులు. వారు కరస్పాండెన్సు కోర్సుద్వారానే కోర్సు పూర్తిచేయాలి. దరఖాస్తులు ఫిబ్రవరి 25, 1986 నుండి ఇవ్వబడును. పూరించిన దరఖాస్తులు ది 9-4-1986 నాటికిగాని అంతకు ముందుగా కాని చేరాలి. నిర్ణయ తేదీ (9-4-86) తర్వాత స్వీకరించు దరఖాస్తులు ఈ క్రింది పేర్కొన్న విధంగా ఫీనల్ ఫీజుతో స్వీకరించబడును.

ది. 11—4—86 వరకు [మొదటి రెండు రోజులకు] రూ. 2/-.

ది. 19—4—86 వరకు [మూడు నుండి 10 రోజుల మధ్య] రూ. 10/-.

ది. 29—4—86 వరకు [పదకొండు నుండి 20 రోజుల మధ్య] రూ. 50/-.

ది. 29—4—86 తర్వాత చేరిన దరఖాస్తులు గరిష్ఠ ఫీనల్ ఫీజు చెల్లించినను స్వీకరించబడవు.

**బి.ఎ., మరియు బి.కాం. ఎంట్రెన్సు పరీక్షలు ప్రారంభమగు తేదీ 19-5-1986**

ఆసక్తి కలిగిన అభ్యర్థులు ఈ క్రింది పేర్కొన్నవారి నుండి By Disignation దరఖాస్తు, సిలబస్, మాదిరి ప్రశ్నాపత్రమును పొందుటకై రూ. 5/- డిమాండు డ్రాఫ్ట్ రూపంలో డైరెక్టరు, స్కూల్ ఆఫ్ కరస్పాండెన్స్ కోర్సెస్, ఆంధ్ర విశ్వవిద్యాలయం వాల్తేరు వారి పేరు మీద చెల్లించి, 9" × 6" సైజుగల ఎన్వలప్ సొంత చిరునామాతో (స్టాంపులు లేకుండా) జతపరిచి పంపించి పొందవలెను. అభ్యర్థులు దరఖాస్తు కొరకు కరస్పాండెన్సు స్కూలులో ఉన్న కాష్ కౌంటర్‌నందు సొమ్ము చెల్లించవచ్చును. పోస్టల్ ఆర్డర్లు, మనియార్డర్లు, చెక్కులు వంటివి అంగీకరించబడవు.

ఈ స్కూలుకు సంబంధించి ఏ విధమైన ప్రతినిధులు లేరు. ప్రవేశానికి సంబంధించి ఏ ఇతర సంస్థ చేసిన వాగ్దానాలకు గాని, ఇచ్చిన ప్రాస్పెక్టస్‌కు గాని ఈ స్కూలుకు బాధ్యత లేదు.

☞ ఈ స్కూలుకు చెందిన ఇంటర్మీడియట్ కోర్సు విద్యార్థులు దరఖాస్తు, సిలబస్ మొదలైన వాటి కొరకు రూ. 5 చెల్లించ నవసరం లేదు. మరియు ఎంట్రెన్సు పరీక్ష దరఖాస్తు కొరకు రిక్విజిషన్ లెటరు పంపనవసరం లేదు. ఇంటర్మీడియట్ కోర్సుల విద్యార్థులకు స్కూలువారే అవసరమైన దరఖాస్తు ఫారం పంపించెదరు. కాని పూరించిన దరఖాస్తుఫారం అవసరమైన అన్ని పత్రములు జతపరచి ది. 9 - 4 - 86 నాటికి స్కూలుకు పంపించవలయును.

వాల్తేరు,
ఫిబ్రవరి 17, 1986

ప్రొఫెసర్ వి. అబ్రహాం
డైరెక్టర్.

---

☞ దరఖాస్తుదార్లు వారు కోరే దరఖాస్తు ఫారం బి. ఏ., ఎంట్రెన్స్ పరీక్షకా లేక బి. కాం., ఎంట్రెన్స్ పరీక్షకా అన్నది స్పష్టంగా వ్రాయాలి.

# ఫ వమాస పద్యాలు




తీర్ప నార్పలేని నేర్పరితనమేల
కూర్ప విప్పలేని నేర్పదేల
పెట్టి పొయ్యలేని వట్టి బీరములేల
విశ్వదాభిరామ వినురవేమ.

జల్లి ముగ్గు వేసి పాదులకి నీళ్ళు పెడతారు శాస్త్రిగారితో బాటు గోము, రాము నూతికి పాదు దగ్గరికి అవే నళ్ళు తోడ పోసె మాదిరి హడావుడిగా అటు ఇటు తిరుగుతూ వుంటాయి

వంట చేసేటప్పుడు వంట గదిలో కాళ్ళు చాపుకొని కూర్చొని వుంటాయి శాస్త్రిగారు గోము, రాము అని పిలుస్తూ వాటితో మాట్లాడుతూ వంటని కానిస్తారు ముగ్గురూ ఒకే చోట భోజనం కానిస్తారు

వరండాలో పుస్తకమో పేపరో చదువుకుంటూ కూర్చుంటే అవి నిశ్శబ్దంగా మెదలక కుర్చీకి ఆ ప్రక్క యీ ప్రక్క చేరి నిద్రపోతూ వుంటాయి

## బేబీ డార్లింగ్

రాత్రింపవళ్ళు ఆయనకి అవే తోడు

శాస్త్రిగారు కుక్క పిల్లలని పెంచుతున్నారని తెలిసి కొడుకులు వేరు వేరు భావాలతో ఒకే అర్థం వచ్చేలా లెటర్సు వ్రాశారు వాటి అన్నింటి సారాంశం ఏమిలేదు "మనుష్యులకే సరిగ్గా తిండి దొరకని యీ రోజుల్లో అంతంత ఖర్చు పెట్టి కుక్క పిల్లలు ఎందుకు పెంచడం అంత డబ్బు ఎక్కువగా వుంటే దానిని మాకు యివ్వవచ్చు కదా! అని

దానికి శాస్త్రిగారు వారికి ఇలా లెటరు వ్రాశారు

బాబూ!

పుట్టినప్రతి ప్రాణిలో కూడా మాతృ భావం, పితృ భావం అనేవి తప్పక వుంటాయి పులి ఇతర ప్రాణులని చూస్తే చంపకుండా వుండదు కానీ తన పిల్లలని అతి ప్రేమగా నాకుతుంది. అదే సృష్టిలోని గొప్ప

విచక్షణా జ్ఞానం మనిషికి అధికంగా వుండటం వలన బాధ్యతని అధికంగా వాంఛిస్తున్నాడు

పిల్లలని కావాలనుకోవడం తనలోని ప్రేమని వ్యక్తీకరించుకోవడానికి

పూర్వకాలంలో సంతతి కావాలనుకొన్నది వంశం కోసం తరువాత రక్షణ కోసం ఈనాడు పిల్లలు కావాలనుకోవడం కేవలం తాము తల్లిదండ్రి అని అనిపించుకోవడం కొసమే అలా మేము నలుగురు బిడ్డలకి జననీ జనకులం అయ్యాం మా బాధ్యతలు మీయందు తీరిపోయాయి

నాకు నిస్వార్థంగా నన్ను నన్నుగా ప్రేమించే ప్రాణి కావాలి అలా నన్ను అభిమానించగల వ్యక్తి మి అమ్మ దురదృష్ట వశాత్తు ఆమె నాకన్నా ముందుగా వెళ్ళిపోయింది

మి అమ్మ తరువాత నన్ను ప్రేమించగల ప్రాణులు అవే అందుకే వాటిని పెంచుతున్నాను ఆస్తి కావాలని, నగలు కావాలని అడగవు రాత్రి పవళ్ళును ప్రేమాభిమానాలను కోరుకొంటాయి అని వ్రాశారు

అదే ఆలోచిస్తూ వున్నారు రోజంతా

గోము, రాము ఏడుస్తూనే వున్నాయి

శాస్త్రిగారు వాటి దగ్గరకి వెళ్ళారు అవి మీదికి ఎగిరి ఆయనని పీకి, గోకి తమ అసమ్మతిని తెలిపాయి

హఠాత్తుగా శాస్త్రిగారికి జ్ఞాపకం వచ్చింది రాత్రి పడుకోబోయే ముందు వాటిని ముద్దుపెట్టుకొనితల నిమిరి గుడ్ నైట్ బేబీ డార్లింగ్స్ అని వీడ్కోలు చెప్తారు ఆయన గుడ్ నైట్ చెప్తే ఆనాటితో వాటికి రోజు పూర్తి అయినట్లే శాస్త్రిగారు చెప్పక పోతే యింకా రోజు వున్నట్లే లెక్క ఈ రోజు శాస్త్రిగారు మనోవ్యథతో పడి వుండటల వలన వాటికి గుడ్‌నైట్ చెప్పక పోవడం వలన "ఎందుకు కష్టావ్ నాన్నా మమ్మల్ని వదులు అని అవి ఏడుస్తూ వున్నాయి

శాస్త్రిగారు వాటి మధ్య కూర్చొని రెంటిని ప్రేమగా తడిమి మూర్కొని "బుజ్జి కన్నల్లారా! గుడ్‌నైట్ రా బేబీ డార్లింగ్స్ అని గాద్గద కంఠంతో అన్నారు

అవి తృప్తిగా తోకాడించి కాళ్ళు చాచి కూర్చున్నాయి రాత్రి విశ్రాంతిగా

శాస్త్రిగారి మనసు తేలికపడింది వాటి ప్రేమతో తడిసి □

మార్చి సంచిక

# బాలరంజని

వెలువడినది

వెల రు. 2.00






ముఖ చిత్రం : ఛత్రపతి శివాజీ

### పానకాలు, గుంటూరు

★ అనాదిగా ఆడది?

● పురుషాహంకారానికి బలి!

★ త్యాగం అంటే?

● నేను కి ముందు నువ్వుకి ముఖ్యం యివ్వడం

★ సృష్టిలో స్వార్థం లేని ప్రేమ ఎక్కడుంది?

● పసివారి తల్లిలో

### ఎస్ ఎల్ లక్ష్మీనరసుపేట

★ ఇప్పుడున్న పరిస్థితులలో మగవాడే ఆడదానికి తాళి కడుతున్నాడు మరి స్త్రీ పురుషునికి తాళి కట్టే సమాజం ఎప్పుడు వస్తుంది?

● ఎందుకు?! తాళి మీద సన్నగిల్లి పోతున్న గౌరవం - యింకా పోడానికా! తాళి కట్టడం కట్టించుకోవడం కాదు ప్రశ్న

### ఎమ్ ఎల్ జనగాం

★ అందమైన 'యువతి' ఏగర్ ప్రశ్నావళి శీర్షికలో వేస్తున్నారేమిటి?

● తీరని కోరిక! ఇదిగో అసలు బొమ్మ ఒకటి పంపుతున్నా – రిప్లేస్ చెయ్యడానికి?

★ ఆ బొమ్మని చూసి మిమ్మల్ని తెలిసిన వాళ్ళు నవ్వుకుంటారేమో?

● నవ్వి పోదురుగాక – నాకేటి సిగ్గు?!

### వి. ఎం., వడ్లమూడి

★ రాజకీయ నాయకులే దొంగలైతే ఎట్లా?

● అసలందుకే నేననేది - స్టూఅర్టుపురాన్ని క్రిమినల్ సెటిల్‌మెంట్ అనే హక్కు మనకి లేదని! అసలు దేశమంతా పెద్ద క్రిమినల్ సెటిల్‌మెంట్‌గా తయారైందనిపించడం లేదూ రోజూ పేపర్లు చూస్తుంటే?




### ఎం బి ఆర్ భిలాయి

★ కథలో లాగ జీవితంలో ఆఖరి మెట్టు విషాదం అయితే?

● ప్రతి మెట్టు విషాదంగా సాగుతున్న జీవనయాత్ర ఇది ఇక మొదటి మెట్టు ఆఖరి మెట్టు ఏమిటి?!

### ఎం. వై బళ్లారి

★ మీరు దురుసుగా యిచ్చే జవాబులు తగ్గించుకోవలెను లేకుంటే మీ ప్రశ్నావళి టాయ్‌మంటుంది - తెలుసా?

● ఇ ఏం బెలూనా టయ్‌మనడానికి! మరేం పరవాలేదు

★ మీరు కుటుంబసమేతంగా దిగిన ఛాయాచిత్రం పంపగలరా?

● లేదు! అంచేత పంపే ప్రసక్తే లేదు!

### గుండాలు, ఖర్గపూరు

★ సమగ్ర ఆంధ్ర సాహిత్యం కాపీలు ఎక్కడ దొరుకుతాయి? ధర చిరునామా తెల్పండి.

● దొరకవు. 86 చివరలో సెట్టు వస్తుంది. చిరునామా నాదే!

### ఎన్. ఎస్. బాపట్ల

★ మీకు ఎందరో ఉత్తరాలు రాస్తారు వారు గుర్తుంటారా? వారు రాసే లెటర్సుని బట్టి వారి మనస్తత్వం గుర్తుంటుందా?!

● కొందరు గుర్తుంటారు– వారి తత్వాలూ– గుర్తుంటాయి– అందుకే కిలెరిగి ఓ వాత పడేస్తూంటాను అలాగే కొందరు యింకొందుకు గుర్తుంటారు– నన్ను పొగిడారని కాదు– కాస్త కామన్‌సెన్సు ప్రదర్శించినందుకు!

★ మీ సూటి జవాబులు నాకు నచ్చుతాయి కొందరు విమర్శిస్తారెందుకు? వారు సూటిగా ఆలోచించరా?

● మనసులో ఆలోచించుకుంటారేమో గాని పైకి తీపి తీపి మాట లుండా లంటారు నాకు చేతకాని పని అది నేను మనసు నొప్పించను కాని నిజం నొప్పిస్తే నేనేం చెయ్యలేను అంతే

★ కొందరు ప్రముఖులమీద ఎంతో గౌరవాభిమానాలు వుంటాయి కాని తీరా దగ్గరగా తెలిశాక అవి పోతాయి నిరాసక్తత వస్తుంది ఎందుచేత?

● వారి ప్రవర్తన చేత! ముట్టుకోకుండా మాట్లాడే పెద్ద మనుషులే చాలా తక్కువ సరదాగా మాట్లాడితే భుజంమీద చెయ్యి వెయ్యొచ్చును కుంటారు– అది మన కిష్టమో కాదో తెలుసుకుందుకు ప్రయత్నించరు ఇదే కాదు– వారి ద్వంద్వనీతులు. ప్రవర్తన– దగ్గర నుంచి భూతద్దంలోలా కన్పిస్తాయి! అంచేత అలా అనిపిస్తుంది

### పద్మజ, శ్రీకాకుళం

★ రంగనాయకమ్మగారి జానకి విముక్తిపై మీ అభిప్రాయం

● నేనింకాపూర్తిగా చదవనేలేదు!

### పి. ఎం. ఎం. కూనవరం

★ స్త్రీని స్త్రీగా గౌరవించనంతవరకు యీ సమాజంలో వ్యక్తి స్వాతంత్ర్యానికి ఒక సార్థకత వుండదు. ఒక రచయితగా మీరు చీకటి పొరల్లో మగ్గుతున్న స్త్రీలను వెల్గులోకి తీసుకురావలసిన బాధ్యత కల్గి వున్నారని భావిస్తాను.

● నేనూను! కాని ఎలా? ఒకరు ఛేదించేవి, తొలగించేవి కావి స్త్రీలు మగ్గుతున్న చీకటి పొరలు చదువుకుని, ఉద్యోగాలు చేస్తూ కూడా - కనీసపు ఆర్థిక స్వాతంత్ర్యం కూడా లేని స్త్రీలున్నప్పుడు - యిక - నిరక్షరాస్యుల కోసం - ఎలా రాయాలి?!

### డి. హెచ్. బి. ఆర్. విశాఖపట్నం

★ మీరెందుకు ఆలస్యంగా జవాబులిస్తారు?

● డిలే యీజ్ బెటర్ దేన్ ఎర్రర్ - బ్రదర్ - అంచేత!

### కె. వి కె. రాజమండ్రి

★ వాగే వాళ్లకు మీ సలహా?

● వంద నాలుకల ప్రవాహ దాటిని రెండు చెవులు పీల్చేయగలవు కదా! విని వూరుకోడమే □






# వారిచే మహిళా లోకానికి
# సరిక్రొత్త కానుక.

**500 గ్రా రుచికరమైన బాంబినో**

**వెర్మిసెల్లిని ప్యాకెట్లు ఉచితం.**




IS 1485

నేడే బాంబినో వెర్మిసెల్లిని కొనండి. రుచికరమైన పకోడా, వడ, కట్‌లెట్లు రుచికరంగా చేసుకొని, ఖాళీ ప్యాకెట్లు దాచి వుంచండి. ఎందుకంటే మీరు 11 ఖాళీ 250 గ్రా ప్యాకెట్లును లేదా 6 ఖాళీ 500 గ్రా ప్యాకెట్లును డీలరుకు వాపసు ఇస్తే మీకు 500 గ్రా బాంబినో ప్యాకెట్లు మా డీలరు ఉచితంగా ఇస్తారు.

ఖాళీ ప్యాకెట్లును దాచుకోవడంలో కూడా ఆనందం ఉంది కదా!

బాంబినో **బాంబినో వెర్మిసెల్లిని**

తీపైనా ఖారా అయిన బాంబినోతో రుచే రుచి

గుర్తుంచుకోండి. ఈ సదవకాశం 31-3-86 వరకు మాత్రమే.

ఆంధ్రప్రదేశ్‌లో మాత్రమే

# సినిమా విశేషాలు

-జి.వి.జి.

## హరికృష్ణ సారథ్యంలో "అరుణ కిరణం"

"సృష్టికి మూలం, మమతానురాగాలకు నిలయం. ఇంటికి దీపం స్త్రీ. ఆ దీపం వెలుగు వంట గదికి, నాలుగు గోడల మధ్య పరిమితం చేయాలనుకోవడం భానుకిరణాలను బంధించడం లాంటి అవివేకమే. విద్యాధికురాలైన స్త్రీ విజ్ఞానకిరణం నలుదిశలా విస్తరించాలి అని చాటి చెప్పే సమస్యాత్మక చిత్రం. తొలి షెడ్యూల్ ఫిబ్రవరి 10 నుంచి 26 వరకు జరిగింది. మార్చి 25 నుంచి ఏప్రిల్ 5 వరకు జరిగే మలి షెడ్యూల్‌తో షూటింగ్ పూర్తవుతుంది," అన్నారు ముత్యాల సుబ్బయ్య. ఈయన దర్శకత్వంలో వై. అనిల్‌బాబు నిర్మించే కృష్ణ చిత్ర వారి పైచిత్రంలో విజయశాంతి, రాజశేఖర్, వేలు, కోట శ్రీనివాసరావు, సాయికుమార్, ముచ్చెర్ల అరుణ, అన్నపూర్ణ. ఒక కీలకమైన పాత్రలో శరత్‌బాబుతో పాటు ఢిల్లీకి చెందిన స్వాతి అనే నవ నటి పరిచయం గావింపబడుతోంది. మైనంపాటి భాస్కర్ కథకు ఎం.వి.ఎస్. హరనాథరావు సంభాషణల కర్త. చక్రవర్తి స్వరకల్పనలో సి. నారాయణరెడ్డి, వేటూరి గీతాలు రాశారు. ఆర్. రామారావు ఛాయ. చిన్నబాబు నిర్వహణ. యోగి సహ దర్శకత్వం, గౌతమ్‌రాజు కూర్పుతో తమ్మారెడ్డి భరద్వాజ ప్రొడక్షన్ కంట్రోలర్.

## చిరంజీవి, కోదండరామిరెడ్డి కాంబినేషన్‌లో క్రియేటివ్ కమర్షియల్స్ "రాక్షసుడు"

"మనో ప్రవృత్తి రీత్యా దుష్టవర్తనుడు కాకపోయినా— చెడును ఎదుర్కోవడంలో రాక్షసుడుగా ప్రవర్తించే విశిష్టమైన పాత్రలో చిరంజీవి అసమాన చాతుర్యంతో నటిస్తున్నారు. దుష్టశిక్షణలో ఆయనకు సహకరించే నాయికగా సుహాసిని, రాధ, సుమలత జయమాల పాల్గొంటున్నారు. మార్చి 1 నుంచి 10 వరకు తూర్పుగోదావరి జిల్లాలోని అంతర్వేదిలో, ఏప్రిల్ 1 నుంచి 15 వరకు హైదరాబాదులో, మే 15 నుంచి 21 వరకు కాశ్మీర్‌లో తదుపరి షెడ్యూల్స్," అన్నారు ఎ. కోదండరామిరెడ్డి. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే క్రియేటివ్ కమర్షియల్స్ వారి పై చిత్రంలో అన్నపూర్ణ, రావుగోపాలరావు, రాజేంద్ర ప్రసాద్, సాయికుమార్, కన్నడ ప్రభాకర్, చిరంజీవి సోదరుడు నాగేంద్రబాబు తక్కిన పాత్రలు పోషిస్తున్నారు. యండమూరి వీరేంద్రనాథ్ నవలకు ఎమ్. ఎస్. హరనాథరావు సంభాషణలు, ఇళయరాజా బాణీలకు వేటూరి గీతాలు రాశారు. లోక్‌సింగ్ ఛాయ. శ్రీనివాసరావు శిల్పం. కతినేని అజయకుమార్ సహదర్శకత్వం. సూపర్ సుబ్బరాయన్ సాహసాలు. ప్రసాద్ సహకార దర్శకత్వం. కోటగిరి వెంకటేశ్వరరావు కూర్పుతో సాయిప్రసాద్. మోహన్ ప్రొడక్షన్ కంట్రోలర్స్. కె. వెంకటేశ్వర్లు నిర్మాత.

"చట్టానికి కళ్ళుంటే"లో ఇందిర, అర్జున్.



## శోభన్‌బాబు, బి.వి. ప్రసాద్ కాంబినేషన్‌లో కొడాలి బోసుబాబు చిత్రం "జీవనరాగం"

"అన్నా చెల్లెల అనురాగబంధాన్ని హృదయాలను స్పందించే రీతిలో చిత్రీకరించాం," అన్నారు బి.వి. ప్రసాద్. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వం నెఱపిన తారకేశ్వరి మూవీస్ వారి పై చిత్రంలో శోభన్‌బాబు, జయసుధ, సుమలత (ద్విపాత్రలు) ఈశ్వరరావు, పద్మనాభం, ప్రభాకరరెడ్డి, మిక్కిలినేని, మాడా, నాగేష్, మధుబాబు, కుమార్‌బాబా, శ్రీనివాసరావు, జగ్గు, జయశీల, మహిజా, జయమాలిని నటించారు. రాజశ్రీ సంభాషణలకర్త. సత్యం స్వరకల్పనలో రాజశ్రీ, బి.వి. ప్రసాద్ గీతాలు రాశారు., పి. చంగయ్య ఛాయ, దిలీప్‌సింగ్ శిల్పం, సతీష్ నృత్యాలు. రామకిశోర్ సహదర్శకత్వం, ఎల్.పి. రామారావు సహకార దర్శకత్వం, కృష్ణంరాజు కూర్పు, అశోక్‌కుమార్ నిర్మాణ సారథ్యంతో కొడాలి బోసుబాబు నిర్మాత.

## శోభన్ "మిస్టర్ భరత్"గా జయకృష్ణ చిత్రం మార్చి రెండవ వారంలో

"కన్న తల్లికి తీరని అన్యాయం చేసి, తనను సంఘంలో అనాథగా నిలబెట్టిన తండ్రిమీద ప్రతీకారం తీర్చుకునే యువకుడుగా మా హీరో అమోఘంగా నటించారు," అన్నారు జయకృష్ణ. ఈయన నిర్మించిన పై చిత్రంలో సుహాసిని, శారద, సత్యనారాయణ, గొల్లపూడి, రంగనాథ్, రాజశేఖర్, సాయికుమార్, రజని, కె. విజయ, సంఘారి, అనూరాధ పాల్గొన్నారు. గణేష్‌పాత్రో మాటలు, వేటూరి పాటలు, ఇళయరాజా సంగీతం, కె. ఎస్. హరి ఛాయ, బి. చలం శిల్పం, డి. రాజగోపాల్ కూర్పు, ఎమ్మెల్ సహదర్శకత్వంతో రాజాచంద్ర దర్శకుడు.

## సమాజంలో స్త్రీ

"ఉద్యోగినిగా ఇంటి గడపదాటిన యువతి ఎన్నో గండాలు ఎదుర్కోవలసి వస్తోంది. ఇది ప్రధానాంశంగా నవరసభరితంగా ఈ చిత్రాన్ని సమర్పించే దొరైగారే కథ, స్క్రీన్‌ప్లే సమకూర్చారు." అన్నారు బి.ఎస్. సురేష్‌కుమార్– ఈయన నిర్మాణ సారథ్యంలో కశ్యప్‌గ్రూప్ క్రియేషన్స్‌వారి పై చిత్రంలో సుమన్, భానుచందర్, రావుగోపాలరావు, గొల్లపూడి మారుతిరావు, సాక్షిరంగారావు, హేమసుందర్, మల్లికార్జునరావు, నవనటుడు శరత్‌కుమార్, విజయశాంతి, ఎస్. వరలక్ష్మి, నిర్మల, అనూరాధ, కె.వి. లక్ష్మి, దేవికారాణి, షిలా, షకీలా, మాస్టర్ సురేష్ నటించారు. కాశీ విశ్వనాథ్ మాటలు, వేటూరి పాటలు, కృష్ణచక్ర సంగీతం, ఎ. మనోహర్ ఛాయ, పి వెంకటేశ్వరరావు కూర్పు ముక్కామల రామకృష్ణ దర్శకత్వంతో డా॥కోజా కశ్యప్ నిర్మాత



జీవన పోరాటం లో శోభన్‌బాబు, విజయశాంతి




## 'నేను చూసే "దూరదర్శన్" కార్యక్రమాలు' _జయసుధ

"జయసుధకు ఏమాత్రం తీరుబడి లభించినా, ఆంగ్ల నవలలు చదువు కుంటూంటుంది. లేదా, వీడియోలో చక్కని సినిమాలు ఏ భాషవైనా సరే– చూస్తూంటుంది. ఐతే, టి.వి.లో ఏవి కార్యక్రమాలు చూస్తూంటారని అడిగితే –

"మద్రాసు కేంద్రం నుంచి అడపాదడపా తమిళ కార్యక్రమాలు కొన్ని చక్కనివి ప్రసారమౌతూంటాయి. ఐతే, నేను షూటింగో, డబ్బింగో ముగించుకుని ఇంటికి చేరుకునేసరికి ఒక్కోసారి రాత్రి తొమ్మిదిన్నర.... పది కూడా దాటిపోతూంటుంది. అప్పుడు నేషనల్ ప్రోగ్రామ్స్‌లో, ఏముంటాయ్ చూడ్డానికి? కాని, ఒక్కోసారి నేను టి.వి. సెట్‌కే గుడ్డప్పగించి చూస్తూండి పోతాను– ఎప్పుడో తెలుసాండి? క్రికెట్ మేచ్‌లు ఉన్నప్పుడు. ఇటీవల ఆస్ట్రేలియాలో టెస్ట్ మేచ్‌లు జరిగినప్పుడు వేకువ ఝామున నాలుగున్నరకే మేల్కొనేదాన్ని. ఆఖరికి షూటింగ్‌లకు వెళ్తున్నప్పుడు కూడా పోర్టబుల్ టి.వి. సెట్‌ని నాతో పాటు తీసుకెళ్ళేదాన్ని. షూటింగ్ స్పాట్‌లో నాతో పాటు అందరూ చూసేవారు.

అసలు మనవాళ్ళు గెలవ్వాల్సిందండీ. అంపైర్లు చాలా పక్షపాతం వహించినట్లు స్లోమోషన్‌లో "ఆక్షన్ రీప్లే"లో స్పష్టంగా తెలుస్తూనే ఉంది. మనవాళ్ళు ఔట్ కాకపోయినా ఔట్ చేయడం, ఆస్ట్రేలియన్ జట్టువాళ్ళు ఔట్ అయినా ఔట్ చేయకపోవడం ఎంత అన్యాయం?

మరికొన్ని కారణాలు కూడా లేకపోలేదు...

శ్రీకాంత్ వల్ల మొదటి ఇన్నింగ్స్‌కే ఎక్కువ పరుగులు తీయకపోవడం.

మొహిందర్ అమర్‌నాథ్, అజారుద్దీన్, అశోక్ మల్హోత్రా, రవిశాస్త్రి, కపిల్‌దేవ్ అతి వేగంగా పరుగులు తీయక ఔట్ అయిపోవడం.

బౌలింగ్‌లో మన జట్టు కేవలం కపిల్‌దేవ్, రవిశాస్త్రిల మీదనే ఆధారపడి ఉండటం. ముఖ్యంగా శివరామకృష్ణన్ సరిగా బౌల్ చేయలేక పోవడం.

ఫీల్డింగ్ కూడా సరిగా చేయలేక పోయారు మనవాళ్ళు.

పైగా మన జట్టు పాల్గొన్న చివరి టెస్ట్ మేచ్‌లో "పిచ్" సరిగా లేకపోవడం కూడా దురదృష్టకరం.

బెటర్ లక్ నెక్స్ట్ టైమ్!

(జి. ఎ. జి.)

## ఎన్. రామచంద్రరావు దర్శకత్వంలో శ్రీ కామాక్షి క్రియేషన్స్ తొలి చిత్రం

"ఎంతటివారికైనా నయాన, అనురాగంతో మార్పవచ్చుగాని, భయాన వారిలో ఆ మార్పు తేవాలనుకోవడం వ్యర్థప్రయత్నం. ఒక సంపన్నుల కుటుంబంలోకి ప్రవేశించిన ఓ మేస్టారు, అపమార్గం పట్టిన ఆ ఇంట్లోని పిల్లలను క్రమశిక్షణతో తీర్చి దిద్దే గుల్జార్ రాసిన "పరిచయ్" ఈ చిత్రానికి మూలం. ఫిబ్రవరి 5 నుంచి 13 వరకు మొదటి షెడ్యూల్ పూర్తయింది. మార్చి 1 నుంచి 18 వరకు ఊటీలో రెండో షెడ్యూల్. ఏప్రిల్ 1 నుంచి 10 వరకు చివరి షెడ్యూల్." అన్నారు ఎన్. రామచంద్రరావు. ఈయన దర్శకత్వంలో ఎస్. కృపాకరరెడ్డి నిర్మించే తొలి చిత్రంలో భానుచందర్, శరత్‌బాబు, సత్యనారాయణ, వేలు, వీరభద్రరావు, జెనర్జి, పొట్టి ప్రసాద్, మదన్ మోహన్, ఎస్. వరలక్ష్మి, బేబీ సిత, మాస్టర్ హరి, మాస్టర్ రాజేష్, మాస్టర్ రాజశేఖర్‌తో పాటు వంగ రాష్ట్రానికి చెందిన అమల అనే నవ నటి పాల్గొంటోంది. గణేష్‌పాత్రో మాటలు, వేటూరి పాటలు, చక్రవర్తి సంగీతం, సుధాకర రెడ్డి ఛాయ, తోట యాదు శిల్పం, శివశంకర్ నృత్యాలు, సాహుల్ సాహసాలు, బండ్రెడ్డి నరసింహారావు సహ దర్శకత్వం, చంద్రశేఖర్– రాజా ప్రొడక్షన్, కె. జయరామకృష్ణ సహకార దర్శకత్వంతో ఎస్. కృష్ణప్రసాద్ రెడ్డి ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్.

"కసాయి గుండెలు"లో పూర్ణిమ





"ఇదే నా న్యాయం" లో మాష్టర్ గణేష్, మనో చిత్ర, చంద్రమోహన్



"ప్రతిధ్వని"లో నూతన్ ప్రసాద్, అల్లు, పరుచూరి, మాడా, చలపతిరావు



కొంటె కాపురం లో సుత్తివేలు వీరభద్రరావు గొల్లపూడి ప్రేమకుమార్ వాసు

# సినిమా

## "మగధీరుడు" లో విప్లవకారుడు

చిరంజీవి మగధీరుడు గా విజయబాపినీడు రూపొందించే శ్యాంప్రసాద్ ఆర్ట్స్ చిత్రంలో విప్లవ ధోరణిలో సాగే హిట్లర్‌గా సాయికిరణ్ తద్విరుద్ధమైన శాంతి పాత్రలో కె విజయ నటిస్తున్నారు వీళ్ళిద్దరి మధ్య సాగే సంభాషణ ఎంత తమాషాగా ఉంటుందంటే –

శాంతి పిల్లలకు ఏవో మాత్రలు ఇవ్వబోతూంటే హిట్లర్ అడ్డుపడ్డాడు తెల్లని మాత్రలు ఇస్తున్నావా? నో! శాంతికి చిహ్నమైన ఈ తెల్లని మాత్రలు వాడి పిల్లల విప్లవ భావాలకు ద్రోహం చెయ్యకు!



[illegible] నటుడ్ని మనూళ్ళో చూడగలిగాను– అంతమంది జనం మిద తొక్కిసలాట జరిగినా !

శాంతికి దాదాపు ఏడుపు వచ్చినంత పనైంది ఇదేం గొడవండీ! వాళ్ళకు రోజూ ఆవకాయతో అన్నం పెట్టించారు ఇప్పుడు వాళ్ళకి విరేచనాలు పట్టుకుంటే – మందు కూడా వెయ్యొద్దంటారేమిటండీ?

వెయ్యనివ్వను రక్త విరేచనాలు పట్టుకోగానే ఈ విప్లవ సింహం కడుపున రెండు విప్లవ పులులు పుట్టినట్టుగా భావిస్తాను

బాబోయ్! మాకే బోజనం వద్దు మాకు మళ్ళీ అంటూ ఆ ఎల్లలు కడుపు చేతో పట్టుకుని పరుగు లంకించుకున్నారు

చిరంజీవి జయసుధ తొలిసారి నాయకా నాయికలుగా నటించే మగధీరుడు చిత్రాన్ని విజయబాపినీడు కథ స్క్రీన్‌ప్లే దర్శకత్వంతో మాగంటి రవీంద్రనాథ్ చౌదరి నిర్మించారు



"ప్రతిభావంతుడు"లో ప్రసాద్‌బాబు, కృష్ణ, షావుకారి జానకి, శ్రీధర్, గుమ్మడి

## మార్చిలో "సీతారామ కల్యాణం"

సంగీత సాహిత్యాల పట్ల ఎక్కువ మక్కువ గల యువచిత్ర అధినేత కె.మురారికి తన ప్రతి

## సినిమా

చిత్రంలోనూ ఏదో ఒక అపూర్వమైన ఆకర్షణ ఉండాలని తపన. ఒక ఎఫెక్ట్ సాధించాలంటే

దానికోసం ఎంత వ్యయప్రయాసలైనా వెనుకాడక అనుకున్నది సాధించే టాస్క్‌మాస్టర్ సీతారామ కల్యాణం చిత్రంలో కల్యాణ వైభోగమే అనే ఆత్రేయ విరచిత టైటిల్‌సాంగ్ చిత్రీకరణకు గోదావరి మధ్య మనోహరమైన లంకల్లో ఆరు బ్రహ్మాండమైన సెట్స్ వేసి వాటిని నక్షత్రాలు దివి నుంచి భువికి దిగివచ్చాయా అన్నంతగా రెండు లక్షలకు పైగా రంగు రంగుల సీరియల్ బల్బులను విజయవాడ రాజమండ్రి వగైరా ప్రాంతాల నుంచి తెప్పించి అలంకరించారు సెట్స్‌మీద నాలుగు జెనరేటర్స్‌ను అమర్చారు దాదాపు 140 మంది ఎలెక్ట్రీషియన్స్‌ను నియమించారు మూడు రోజుల పాటు సాయంత్రం ఏడు గంటల నుంచి తెల్లవారు ఝామున మూడు గంటల వరకు రెండున్నర లక్షల రూపాయల వ్యయంతో చిత్రీకరించబడిన ఈ పాట ఈ చిత్రంలో హైలైట్ అని డైరెక్టర్ జంధ్యాల తెలిపారు ఈ నవరసభరిత చిత్రంలో జంధ్యాల మార్కు సున్నితమైన హాస్యం కూడా గిలిగింతలు పెడుతుందనడానికి శ్రీ తార్కాణం

18వ శతాబ్దం నాటి గ్రంథాలు తాళపత్రాలు కందుకూరు వీరేశలింగంగారి లాంటి ప్రముఖుల వ్రాత ప్రతులు పదిలపరచబడిఉన్న గౌతమి గ్రంథాలయం లో బాలకృష్ణ (రాజా) లక్ష్మి (రజని) వేలు (లైబ్రేరియన్) పాల్గొన్న సన్నివేశం

లైబ్రేరియన్ కాలుకాలిన పిల్లిలా అటు ఇటు




రాజాచంద్ర · మాగంటి వెంకటేశ్వరరావు · కిషోర్

కృష్ణా శ్రీ వెంకటలక్ష్మి ఫిలింస్, నైజాం విక్రమా ఫిలింస్, సీడెడ్: వియం.పి,



విజయశాంతి, బాలకృష్ణ, "ముద్దుల క్రిష్ణయ్య లో



కృష్ణ పరమాత్మ లో రాధిక నరేష్

తిరుగుతూ వె నిశ్శబ్దం శబ్దం వచ్చినా ఒప్పుకోన్నేను కావాలంటే నోరు విప్పకుండా మాట్లాడుకోండి కాలేజిలో మిగతా చోట్ల మీ ఇష్టం వచ్చినట్లు ప్రవర్తించండి కాని లైబ్రరీలో మాత్రం నిశ్శబ్దంగా ఉండకపోయారో ఒప్పుకోన్నేను సైలెన్స్! నిశ్శబ్దం" అన్నాడు

ఏదో పుస్తకాన్ని తీస్తూ లక్ష్మి ఇక్కడ నేనొక్కదాన్నే తప్ప ఇంకెవరూలేరు సార్ నిశ్శబ్దం నిశ్శబ్దం అంటూ మీరే అరుస్తున్నారు అంది

అరుస్తున్నానా? ఏమిటో నమ్మా– పుట్టుకు చెముడున్నదాన్ని చేసుకున్నాను అతి రహస్యం కూడా అరిచి చెప్పడం అలవాటై పోయింది అంటూన్న లైబ్రేరియన్ అక్కడికి అప్పుడే వచ్చి లక్ష్మి వంక చూస్తున్న రాజాని గమనించి ఏం కావాలి నాయనా అని అడిగాడు

తృళ్ళిపడి తమాయించుకుంటూ వేడిగా ఏమున్నాయ్? అన్నాడు రాజు

# సినిమా

వేడిగానా! ఇదేం హోటలను కున్నావా?పవిత్రమైన గ్రంథాలయం నా దగ్గర వేడిగా ఉండే ఆట్మ్స్ఫియర్ వాడిగా ఉండే తిట్లుంటాయి కావాలా?

సారీ సర్ పొరపాటైపోయింది

ఏం కావాలో చెప్పు' ది మదర్ – క్వశ్చన్ అండ్ ఆన్సర్స్ కావాలా? 15 వాల్యూమ్స్ చాలా బాగుంటాయి చదువుకో?

మీ దగ్గర ప్రేమదాసు రాసిన అంటూ రాజా లక్ష్మిని ఉద్దేశించి ప్లీజ్ నవ్వండి నవ్వితే మీరెంతో అందంగా ఉంటారు అన్నాడు

తననే అనుకొని లైబ్రేరియన్ ఆఫ్‌కోర్స్! అన్నాడు ఉప్పొంగిపోతూ

నా వైపు తిరగండి

తిరిగే ఉన్నాను కదా? అంటూ లైబ్రేరియన్ ఉలిక్కిపడి రాజా ధోరణిని గుర్తించాడు ఎమ్ మిస్టర్!

పోనీ ఫ్రెడరిక్ యంగ్ లవ్ రాసిన లవ్ మి క్విక్ ఉందా?

ఆ లవ్ మి క్విక్ లేదు ఐ విల్ గివ్ యు ఎ కిక్ ఉంది– సర్ హెంగ్రి యంగ్ మాన్ రాసిన షటప్ ఉంది గెటౌట్ ఉంది దూర్వాసుల అగ్నిహోత్రావధానులు రాసిన మళ్ళీ వస్తే పళ్ళు రాలగొడతా ఉంది ఇవ్వనా కావాలా?

పానకంలో పుడకలా విడెక్కడ దాపరించాడు బాబూ– అనుకుంటూ రాజా నిట్టూర్చాడు

మార్చిలో విడుదలయ్యే ఈ ప్రతిష్ఠాత్మక చిత్రంలో జగ్గయ్య శ్రీధర్ గొల్లపూడి రామకృష్ణ రాజేష్ సుధాకర్ గిరీష్ అరుణ సంగీత రమాప్రభ ఇతర పాత్రధారులు కె వి మహదేవన్ సంగీతం నందమూరి మోహనకృష్ణ ఛాయ యు వి బాబు సహ దర్శకత్వం నాగబాబు కూర్పుతో కె నరసింహం నాయుడు సమర్పణ

(56 వపేజీ చూడండి)













# నచ్చే ధరలో మీరు మెచ్చే తెల్లదనం...




దీని రహస్యం ఏమిటో ? ఆ అద్వితీయమైన ఆల్ఫాఓలెఫిన్ బెస్టోలో మాత్రం వుండటమేమరి. ఫలితంగా కాటన్ లేక సాటిన్, సింథెటిక్ లేక సిల్క్, బట్టలతీరు బెస్టో యొక్క సురక్షితమైన ప్రభావంతో అలాగే నిలిచి వుంటుంది. పైగా దీంతో మీ చేతులకు పూర్తి రక్షణకూడా !

బెస్టో ఉతికే తరహా చూస్తే మీరనే మాట–సరసమైన ధరతో బెస్టో చౌకరకం పౌడర్లపై దెబ్బతీసిందనీ తెల్లదనం ఇచ్చే తీరులో ఖరీదైన పౌడర్లతో పోటీగా నిలుస్తుందనీను.

ఆల్ఫాఓలెఫిన్
గల
ఒకే ఒక పౌడర్
ధర
ప్రతి కిలో
రూ. 7.65
(స్థానిక పన్నులు అదనం)

గోద్రెజ్ వారి

కొత్త బెస్టో

బ్లూ డిటర్జెంట్ పౌడర్

CHAITRA-B G 356 TEL

# అభిమాన తారలపై అభిప్రాయం

నా వరకు నేను మెచ్చిన నాకు నచ్చిన ఏకైక నటుడు డా. అక్కినేని నాగేశ్వరరావు ఈయన నటుడిగా కన్న ఒక మహోన్నత వ్యక్తిగా ఆయన నాకు గురువు మార్గదర్శకులు



ఒక నటుడు తన నటనను ఎవరైనా సన్మానించి గౌరవించాలనుకోవడం, గౌరవించడమనే విషయం సాధారణ విషయమేమో కానీ తన సహ నటీనటులను, సాంకేతిక నిపుణులను ఏవత్ పరిశ్రమను గౌరవించడమనేది మొత్తం చలనచిత్ర పరిశ్రమలో దాదాపు అసాధారణమనే చెప్పాలి.

నటుడు విద్యాధికుడవడం అనేది సహజమేమో కానీ విద్యాదాత అవడం అసహజం. అసహజాన్ని సహజం చేసిన ఏకైక సినీనటుడు ఈయనే.

పారిశ్రామిక వేత్తగా ఎన్నో పరిశ్రమలు స్థాపించి చాలామంది నిరుద్యోగులను ఉద్యోగులుగా చేసిన ఘనుడు. సాంస్కృతిక రాయబారిగా మొట్టమొదటి సారిగా ఆహ్వానింపబడ్డ ఏకైక తెలుగు సినీ కళాకారుడు.

తెలుగు చలన చిత్ర పరిశ్రమను ఏ నాటికైనా భాగ్యనగరంలోనే స్థిరపరచాలనే స్థిరచిత్తంతో ఏకాకిగా తరలి వచ్చిన ఏకైక నటుడు.

ఇలాంటి మహామనిషి, మేధావి సినీ పరిశ్రమకూ విశిష్ట సేవ చేసిన ఈ కళాతపస్వి చిరంజీవుడై ఆంధ్రప్రజల హృదయాలలో నిలిచిపోవాలని సర్వదా భగవంతుడిని ప్రార్థిస్తున్నాను.

-నిష్టల వేంకటపద్మావతి,
దాసన్నపేట రోడ్, విజయనగరం.

★ ★ ★

నేను సుహాసిని అభిమానిని. సుహాసిని అంటే నాకు చాలా యిష్టం. సుహాసిని నటించిన ప్రతి చిత్రం నేను మొదటిరోజునే చూస్తాను. నేను సుహాసిని



అభిమానిని ఎందుకంటే, ఆమె కొద్ది కాలంలోనే పెద్ద తారల స్థాయిలోకి వచ్చింది. "సూపర్‌స్టార్" కూడా అయినది ఆమె నటనలో ఒక ప్రత్యేకత ఉన్నది చిన్న పిల్లల దగర నుంచి పెద్దవాళ్ల వరకూ ఆమె నటనను మెచ్చుకుంటారు ఆమె ఏ పాత్ర వేసినా చాలా బాగుంటుంది ఫ్యామిలీ టైప్ పాత్రలలో సుహాసిని నటన చాలా అద్భుతంగా ఉంటుంది

సుహాసిని ఈ మధ్య మంచి పాత్రలను వేయటం లేదు. తన యొక్క అభిమానులకు నిరుత్సాహము కల్గించు చున్నది. కావున సుహాసిని ఎక్కువగా ప్రధాన అంశముగల పాత్రలను వేయవలసిందిగా కోరుచున్నాను.

– కొమ్మినేని వెంకటేశ్వరరావు,
చెంచుపేట, తెనాలి

★ ★ ★

నా అభిమాన నటి సుహాసిని నటించిన చిత్రాలన్నింటిలో నూ "మాంగల్యబంధం"లోని నటన నాకెంతో నచ్చినది. అందులోని ఆమె పాత్ర 'సెంటిమెంటల్ ఫూల్' అనిపించేట్టుగా ఉన్నా పాత్రోచితంగా చక్కగా నటించారు. "స్వాతి" చిత్రంలోని ఆమె ఆదర్శప్రాయమైన నటన యువతరానికి గొప్ప సందేశము. చక్కటి



వర్చనాలిటీతో 'శారిస్'లో అందముగా కన్పించే ఆమె ఈ మధ్య ఎక్కువగా 'ఫామ్లీ టైప్' చిత్రాలలోనే నటిస్తున్నారు. అలా కాకుండా అన్నిరకాల పాత్రలలో నూ ఆమె నటించాలి. ఒక 'నృత్య' ప్రధానాంశ చిత్రములో సుహాసిని నటిస్తే చూడాలని నేనూ, నాలాంటి ఎందరో అభిమానులు ఎదురు చూస్తున్నారు. మరి ఆ కోరిక ఎప్పటికి తీరుతుందో!

–కె. మనోరమ, మహంతిపురం,
విజయవాడ.

★ ★ ★

నా అభిమాన నటుడు చిరంజీవి. అతని నటనంటే నాకు చాల ఇష్టం. హాస్యరస పాత్ర అవనీ, కుటుంబ కథా చిత్రం అవనీ క్రైమ్, పోరాట సన్నివేశాల చిత్రం అవనీ. ఏ పాత్రయినా అత్యంత ప్రతిభావంతంగా పోషించగల మహానటుడు మా చిరంజీవి. తాను పోషించే ప్రతి పాత్రలోనూ అతను నటించడు, జీవిస్తాడు. నటనలో స్పీడంటూ ప్రేక్షకులకి రుచి చూపించినవాడు చిరంజీవి. ఇకపోతే అభిమానిగా ఆయనకిచ్చే సలహా ఏమిటంటే. పులి, చిరంజీవి లాంటి సినిమాల్లో నటించి అభిమానులను నిరాశపర్చవద్దు ఒకే టైపు పాత్రలో నటించవద్దు. సంభాషణల ఉచ్చారణ విషయంలో ఇంకొంచెం శ్రద్ధ చూపాలి ఉత్తమనటి సుహాసినితో జంటగా ఎక్కువ సినిమాల్లో చూడాలని అభిలాష రక్తసింధూరం, కిరాతకుడు, విజేతలో నటించిన



పాత్రలలో నూ, వైవిధ్యం ఉన్న పాత్రలలో నూ చూడాలనుకొంటాం.

– కొండమూరి శ్యాము, గుత్తేనదీవి.

★ ★ ★

చలనచిత్ర పరిశ్రమలో ఒక మంచి మనస్సున్న వ్యక్తిగా ధైర్యసాహసాలు, కీర్తిప్రతిష్టలు ఆర్జించి అత్యున్నత స్థాయిలో తనదంటూ ఒక ప్రత్యేకతను ఏర్పరచుకున్న నటుడు నటశేఖర కృష్ణ గారి లక్షలాది అభిమానులలో నేను ఒకడిగా చెప్పుటకు గర్విస్తూ ముఖ్యంగా కృష్ణగారు తన పాత్రలను ఎన్నుకోవటంలో అతిజాగరూకత వహిస్తూ అవి తన ఇమేజ్‌ని పాడు చేసేవిగా కాకుండా పెంచేవిగా ఉండే పాత్రల వైపు తన దృష్టిని ఎక్కువగా కేంద్రీకరించి న్యాయం చేకూర్చాలి. ఒక బాధ్యత గల నిర్మాతగా... దర్శకుడిగా భారీ బడ్జెట్ చిత్రాలను నిర్మించడమే కాక ప్రయోజనాత్మక, సందేశాత్మక చిత్రాలను నిర్మించి ప్రేక్షకులకు ఒక ప్రయోజనాన్ని చేకూర్చి చిత్ర పరిశ్రమలోనే క్రొత్త అధ్యాయాన్ని సృష్టించగలగాలి. అంతేకాదు! చిత్రంలోని ప్రతి సన్నివేశంలోని తన నటన ప్రత్యేకంగా నటిస్తున్నట్టుగా కాకుండా ఆ పాత్రలో పూర్తిగా జీవిస్తున్నట్టుగా, తన డైలాగ్ డెలివరీలో సమయసందర్భాలను బట్టి లాలిత్యం, గంభీరం,



అమాయకత్వం. ఉట్టిపడేలా శ్రద్ధ వహిస్తూ అఖిలాంధ్ర ప్రేక్షకుల మన్ననలు పొందగలగడానికి అవిరామ కృషి సలుపవలెను

–బుయిశ్రీ, కమ్మపాళెం

నా అభిమాన తార జయసుధ నటనలో ంతురతలో అభినయంలో పొరపాటు రాని నటి ఎ ఖంలో చిలిపితనంలో గర్వంలో ప్రేయంగా గార్యగా, తల్లిగా, ఒక్కటిమిటి నవరసాల



కథానాయిక, మూడు సంవత్సరాలు సూపర్‌స్టార్ అయినా... ఇక ముందు కూడా తెరపై కనిపిస్తూ, నట్టనకై జీవించాలని ఈ తమ్ముడి చిన్ని కోరిక. దర్శకత్వం మానించినా తెరమరుగు కారాదని అభ్యర్థన పండంటి కాపురంలో 16 సం రాల కన్య అయినా దీనంగా మద్యతరగతి కుటుంబీకుని కూతురి నటన మొదటిసారి నన్ను అభిమానిగా మార్చింది

కె విజయనరసింహారెడ్డి అచ్చంపేట

* * *

నటనలో హావబావ విన్యాసాలు కురిపిస్తూ నవరసాలు ఒలికిస్తూ బహుముఖ నటనలో ప్రతిభా శాలి అనిపించు కుంటున్న దిట్ట– సత్యనారాయణ క్రౌర్యం మూర్తీభవించిన విలన్‌గా కష్టాల కడలిలో ఈదులాడే పేద వానిగా హాస్య నటనతో సైతం అన్ని పాత్రల్ని అవలీలగా దరించి మెప్పించగల సాటిలేని నేటి మేటి నటుడు అంటే అతిశయోక్తి కాదు

విలన్ పాత్ర అతని ప్రత్యేకత క్రౌర్యానికి ప్రతి రూపమా అన్నట్టుంటుంది ప్రేక్షకులకు మచ్చుకు రామ కృష్ణులు చిత్రంలోని విలన్ కారెక్టర్ తీసుకోవచ్చు కన్నవారిల్లు చిత్రంలో ఆర్థికంగా చితికి పోయి నిస్సహాయ స్థితిలో నున్న పేద వానిగా చూపించిన అనన్య సామాన్య మైన ఈయన నటనలో కరుణరసం తొణికిసలాడి కంట తడి పెట్టించింది

ఇకపోతే జానపద పౌరాణిక చిత్రాల్లో అనేక పాత్రలు ధరించి మెప్పించిన తీరు గణనీయం. కాని ఇటీవలి 'అగ్ని పర్వతం' చిత్రంలో ఈయన పాత్ర



మితిమిరి బఫూనిలా చిత్రించబడిన తీరు బాధాకరం. ఇటువంటి పాత్రలు ఇకమీదట అంగీకరించ వద్దని మనవి

–పాట్నిడి చక్రరావు
కొత్తరోడ్ విశాఖపట్నం

## మనవి

అభిమాన తారలపై అభిప్రాయం శీర్షికకి రాసేవారు తమ రచనలని పావుతావు సైజు పేజికి (500 అక్షరాలు) మించకుండా కాగితానికి ఒకవైపే సిరాతో లేదా బాల్‌పెన్‌తో రాసి పంపాలి. రచనలతో పాటు తమ పాస్‌పోర్ట్ సైజు ఫొటో జతపరచి పంపాలి. ప్రచురణకి స్వీకరించని వాటిని తిప్పి పంపకోరేవారు తమ రచనలతో పాటు తగినన్ని స్టాంపులు అంటించిన స్వంత చిరునామా కల కవరు జతపరిచి పంపాలి. వాటిపై ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలకి అవకాశం లేదు. ఈ శీర్షికకి రాసే పాఠకులు తమ రచనలని, ఫొటోలని సంపాదకుడు, ఆంధ్రసచిత్ర వారపత్రిక, గాంధినగరం, విజయవాడ– 520003 అన్న చిరునామాకి పంపుతూ కవరుమీద "అభిమాన తారలపై అభిప్రాయం శీర్షికకి" అని స్పష్టంగా రాయాలి.

– సంపాదకుడు

ఆనాడు "కళాభినేత్రి" వాణిశ్రీ తరవాతెవరుఅన్న ప్రశ్నకు "సహజ నటి" జయసుధ సమాధానంగా నిలిచింది. మరి నేడు జయసుధ స్థానం ఎవరిది అన్న విషయంలో, ఇద్దరు ప్రముఖ హీరోయిన్‌లు పోటీపడుతున్నారు. వీరిలో ఈ పోటీని, ప్రతికూల పరిస్థితులను ఎదిరించి చిత్రసీమలో తన స్థానాన్ని సుస్థిరము, పటిష్టము చేసికొన్న నటి, నా అభిమాన కథానాయిక, "సిల్వర్ స్క్రీన్ బ్యూటీ" విజయశాంతి.



నాడు "కిలాడికృష్ణ" ద్వారా చిత్రరంగంలో కాలిడి దినదిన వర్థమానమవుతూ నేడు అగ్రనటిగా గుర్తింపు పొందింది. "పెళ్ళిచూపులు", "నేటిభారతం," "వందేమాతరం," "దేవాలయం," మొన్నమొన్నటి "ప్రతిఘటన". మొదలగు చిత్రాల ద్వారా అఖిలాంధ్ర ప్రేక్షకులను తన అద్భుత నటనా చాతుర్యంతో వేశేషంగా ఆకట్టుకొంది. ముఖ్యంగా "ప్రతిఘటన" చిత్రంలోని ఆమె నటనని చూసినప్పుడు, విమర్శకులు సహితం ముక్కున వేలువేసుకున్నారు అనడంలో సందేహంలేదు.

ఇటీవలే విడుదల అయిన "శ్రావణ సంధ్య"లో ఆమె పాత్ర అమోఘంగా ఉంది. ముందు ముందు విజయశాంతి, మరిన్ని మంచిపాత్రలు ధరించి, మావంటి అభిమానులందరిని అలరించాలని అభిమానిగా నా కోరిక. విజయశాంతికి డబ్బింగ్ చెప్పేవారు తరుచు మారుతుండడంవల్ల చాలా అసౌకర్యంగా ఉంటోంది ఈ విషయం ఆమె గమనించాలనీ అభిమానిగా నా ప్రార్థన

– రమణమూర్తి విజయనగర్ కాలనీ
హైదరాబాదు

నా అభిమాన నటుడు కృష్ణ మంచి నడవడికతో చిత్ర పరిశ్రమలో తనకంటూ ఓ ప్రత్యేకమైన సంహాసనాన్ని ఏర్పరుచుకున్న మహామనిషి కృష్ణ అంటే నాకు ఎనలేని అభిమానం. ఎప్పుడూ



అన్నార్తుల ఆక్రందనలను అర్థం చేసుకుని సహాయపడగల అసహాయ శూరుడు కృష్ణ! తా చేపట్టిన కార్యాన్ని క్రమశిక్షణతో సాధించగల అభినవ విక్రమార్కుడు కృష్ణ! ఏ అవలక్షణాలు లేని సలక్షణమూర్తి కృష్ణ! ఇన్ని సుగుణాలు వున్న వ్యక్తిపై ఎవరి కుండదు అభిమానం? అందుకే ఈనాడు ఎక్కడ చూసినా కృష్ణసేన వుంటుంది ఎన్నో ప్రగతి కార్యక్రమాలను చేపడుతుంది ఆ కార్యక్రమాలన్నిటికి ఆ ఉద్దండుని అండదండలు ఉండనే ఉంటున్నాయి ఇంత మంచి అభిప్రాయాలను సేకరిస్తున్న ఆంధ్రసచిత్ర వారపత్రిక వార్కి నా నమస్సుమాంజలి!!

–యస్కే బాబు ఆకివీడు

★ ★ ★

నా అభిమాన నటి సుహాసిని సుమధుర భాషణాల సుందర దరహాసని ఆమె కాంతులీనే కళ్ళల్లో హావభావాలు ప్రస్ఫుటిస్తాయి ఆమె మోములో నవరసాలు నటనాభిషేకాలు చేస్తుంటాయి విషాద పాత్రల్లో ఆమె నటిస్తుంది అనేకంటే జీవిస్తుందంటే అతిశయోక్తి కాదు ఎలాంటి పాత్రనైనా తనదైన బాణీలో అమోఘంగా మెప్పించగల నటశిరోమణి కొత్త జీవితాలు చిత్రం ద్వార తెలుగు తెరకు తారగా పరిచయమైన ఆమె నేడు సినీ వినీలాకాశంలో ధృవతారగా మారిందంటే కారణం ఆమె నటన పట్టుదల పాత్రలఎడ పరిపక్వత

ఆమెకు నేనిచ్చే సలహా ఒక్కటే ఇకపైకూడా కథాబలంగల స్త్రీ సమస్యలకు అద్దంపట్టే "స్వాతి", "కొంగుముడి", "స్రవంతి" వంటి



చిత్రాలల్లోనే నటించమని, తద్వారా ఒక కొత్త చరిత్రకు శ్రీకారం చుట్టమని కోరుతున్నాను.

–సి. వి. నరసింహదాసు,
రిహాదాణిపేట, విజయనగరం

సీరియల్

# ప్రేమ సాగరం

ఎన్. భారతీ దేవి



(గత సంచిక తరువాయి)

స్వప్న పడుకోబోయే ముందు, రోజూ రాత్రుళ్ళు గార్డినాల్ టాబ్లెట్లు వేసుకోవటం మొదలు పెట్టింది. టాబ్లెట్లు వాడకపోతే నిద్రపోలేని స్థితికి వచ్చింది. ఆ టాబ్లెట్లు వాడటం ప్రమాదమని జయరాం ఎంత చెప్పినా ఆమె వినిపించుకోవటం లేదు.

టాబ్లెట్ వేసుకుని, మంచినీళ్ళు తాగి లైటార్పి బెడ్‌మీద కొచ్చింది స్వప్న.

"స్వప్నా! ఇలా ఎంతకాలం టాబ్లెట్లు వేసుకుని నిద్రపోతావు?"

"బ్రతికినంత కాలం."

"నువ్వు సమాధానం చెబుతావని నాకు తెల్సు."

"మళ్ళీ అడగటం ఎందుకు?"

"నిన్ను నేను ప్రేమించాను. ఇప్పటికీ ప్రేమిస్తూనే ఉన్నాను. నువ్వు లేకపోతే నేను బ్రతకలేను".

"ఈ సినిమా డైలాగులు ఇంకెప్పుడూ మాట్లాడొద్దు."

"స్వప్నా! ఇప్పుడు నన్నేం చెయ్యమంటావో చెప్పు. ఈ బాధ భరించలేక ఉరిపోసుకుని చావమంటావా? నేను తప్పు చేసాను. ఆ తప్పు ఎందుకు ఏ పరిస్థితుల్లో చేసానో కూడా నీకు తెల్సు. అన్నీ తెల్సికూడా నన్నెందుకిలా సాధిస్తావు? ఇలా ఎంతకాలం నన్ను సాధిస్తావు? రెండు సంవత్సరాల నుంచి మనశ్శాంతి లేకుండా చేస్తున్నావు. నీకు పిల్లలు పుట్టినట్టయితే, మరో ఆడదానివైపు కన్నెత్తి కూడా చూసే వాడిని కాదు. పిల్లలు కావాలన్న కోరికతో పొరపాటు చేసాను. ఇప్పుడు నువ్వెంతగా సాధిస్తే మాత్రం ప్రయోజనం ఏముంది? అయినా, ఇప్పుడు నీకేం తక్కువయింది?"

జరిగిన కథ–8 : జయరాం ప్రియురాలు మోహిని గర్భవతియిందని రఘునాథ్ స్వప్నకు చెపుతాడు. స్వప్నకు తను అండగా ఉంటానంటాడు. అతనికి తనపైనున్న ప్రేమకు చలించి పోతుంది స్వప్న. మోహినిని రహస్యంగా గుళ్ళో పెళ్ళి చేసుకున్నాడు జయరాం. మోహినికి కొడుకు పుట్టాడు. మోహినిని, బాబుని, వాళ్ళతో పాటు మోహిని తల్లిని స్వప్న ఇంటికి తీసుకు వచ్చేస్తాడు జయరాం. మాధవరావుగారు కూతురి సుఖం కోసం కూడబెట్టిన ఐశ్వర్యమంతా మోహిని, వాళ్ళమ్మ అనుభవిస్తున్నారు. స్వప్నకు రోజు రోజుకి జీవితం సమస్యలమయం అవుతోంది.

"ఏమి తక్కువ కాలేదు. చూడండి. పిల్లలు లేకపోవటం నాతప్పు కాదు. అది నా దురదృష్టం. పిల్లలు కోసం మీరు మరో ఆడదానితో సంబంధం పెట్టుకున్నారు. మీ దాంపత్యాన్ని చూస్తూ, నాకేమీ పట్టనట్టుగా ఉండటానికి, నేను రాయిని కాదండి. మనిషిని.

మనస్సున్న మనిషిని. ఒక్క విషయం ఆలోచించండి. రఘునాథ్ నన్నెంతగా ప్రేమిస్తున్నాడో మీకు తెల్సు. నా మీద ప్రేమ చంపుకోలేకనే, అతను బ్రహ్మచారిగానే ఉండిపోయాడు. మీకు భార్య మోహినుంది. నా అవసరం మీకెలాగూలేదు. నేను కోరుకున్న మీ ప్రేమ పొందలేనప్పుడు, నన్నుకోరుకునే రఘునాథ్ ప్రేమకు దగ్గరకావటం మంచిది కాదంటారా? ప్రేమ, ప్రేమనే కోరుతుంది. అందుకే ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చాను."

"ఏమని?"

"నేను రఘునాథ్‌వాళ్ళ ఇంట్లోనే ఉండిపోవాలని."

"స్వప్నా!" అరిచాడు పెద్దగా. గుండెల్లో మొండి కత్తి దించినట్టుంది అతనికి.

నేను చేసిన పనికి, స్వప్న మనస్సు కఠినంగా మారిపోయింది. గాయపడిన మనస్సుతో ఉన్న ఆమె, తనేం మాట్లాడుతుందో తనకే తెలియని స్థితిలో ఉంది. అనుకున్నాడు.

"ఖంగు తిన్నారా?"

"నువ్వేనా? ఇలా మాట్లాడుతుంది?"

"తప్పేముంది?"

"స్వప్నా! నేనేం సమాధానం చెప్పగలను? నిన్ను అర్థించటమే తప్ప శాసించే అధికారం నాకు లేదు".

"ఆవిషయ మయినా ఒప్పుకున్నారు."

"నీ ఇష్టానికి నేను ఎదురు చెప్పను." ఆ మాట అనటానికి, మనస్సులో అతనెంత బాధపడ్డాడో అతని గొంతు పలికిన తీరును బట్టే అర్థమవుతుంది.

గార్డినాల్ టాబ్లెట్లు మత్తులో, కనురెప్పలు బరువుగా మూతలు పడుతుంటే, పక్కకు జరిగిపడుకుంది. మరోపది నిముషాలకు, మత్తులాంటి నిద్రలోకి జారిపోయింది.

★ ★ ★ ★ ★ ★

"స్వప్నా! ఫోన్ కూడా చెయ్యకుండా వచ్చావేమిటి?" స్వప్నను చూసి, ఆశ్చర్యంలో నుంచి తేరుకుంటూ అడిగాడు రఘునాథ్.

"రాకూడదా?"

"ఈ స్వప్నాలయం నీది. నీ ఇంటికి నువ్వు రావటానికి అభ్యంతరం ఎందుకుంటుంది?" చాలా హృదయావేదనతో, బాధతో పలికింది అతని గొంతు.

బాధతో ఆమె మనస్సు రెప,రెపలాడింది.

"ఎంత మరిచి పోదామన్నా, మరిచిపోలేక పోతున్నాను. నిన్ను చూడగానే,

చిన్నతనం నుంచి మన మధ్య జరిగిపోయిన మధురక్షణాలు గుర్తొస్తాయి ఆ జ్ఞాపకాల వరవడిలో నా మనస్సునొప్పించేలా మాట్లాడుతుంటాను నువ్వు నన్ను ద్వేషించినా వాంఛించినా అది నాకెప్పుడూ గుర్తుకు రాదు మనమధ్య చిన్నతనం నుంచి పెనవేసుకున్న అనుబంధమే గుర్తొస్తుంది

వైవాహిక జీవితాన్ని గురించి ఎన్నో మధురమయిన కలలు కన్నాను ఆ కలలన్నీ కల్లలుగా మిగిలిపోయి నేను పంటరిదాన్నయిపోయాను ప్రేమ అనే పదం వింటేనే నాకు కంపరంగా అసహ్యంగా ఉంటుంది అనాలోచితంగా ప్రేమలో పడి పెళ్ళి చేసుకున్నందుకు నా జీవితం నాశనమయి పోయింది

జరిగిందాన్ని గురించి ఆలోచిస్తే మనస్సు బరువెక్కుతుందే తప్ప ప్రయోజనం ఉండదు

ఏం చెయ్యను? ఆ జీవితంతో రాజీ పడదామని ఎంత ప్రయత్నించినా సాధ్యం కావటం లేదు నా భర్త పెడుతున్న నరకయాతన కంటే ఎక్కువగా ఉంది ఆ వరలక్ష్మి పెడుతున్న బాధ ఆడ విలన్‌లా నా వెంటబడుతుంది ఇంటిని వాతావరణాన్ని నరక కూపంగా మారుస్తుంది

నువ్వు చెబుతుంటేనే ఆ రాక్షసిని షూట్ చేసి చంపెయ్యాలనిపిస్తుంది రోజంతా నువ్వు ఎలా భరిస్తున్నావో గాని స్వప్నా! నీ ఓరిమితనం చూస్తుంటే విసుగేస్తుంది నాకు మెడపట్టి బయటకు నెట్టించెయ్యక ఆవిడను ఇంట్లో ఎందుకు పెట్టుకున్నావు?

ఆవిడకు కూతురు తప్ప ఇంకెవ్వరూ లేరు కూతురెక్కడుంటే అక్కడే ఉంటుంది

అమ్మా కూతుళ్ళిద్దర్నీ వేరే ఇంటికెళ్ళి పొమ్మను

నా మనస్సు చాలా విచిత్రమయినది ఇలాంటి మనస్సుగలవాళ్ళకు సుఖం ఉండదు వాళ్ళు వేరుగా ఉంటే జయరాం ఎక్కువ సమయాన్ని అక్కడ గడుపుతాడు వాళ్ళక్కడే ఉంటే అతను ఆఫీసు నుంచి వచ్చినదగ్గర్నుంచి నా కళ్ళముందుంటాడు

మైగాడ్! ఇదా ప్రేమ? అనుకున్నాడు తనలో తను రఘునాథ్

నిన్ను ఒక మనిషిగా కూడా గుర్తించని వ్యక్తి కోసం నీ జీవితాన్నే అర్పణ చేసావు

పొందలేని ప్రేమలో కూడా ఆనందమే ఉంటుంది బావా! కొంతకాలం వరకూ నేనిక్కడే ఉండాలనుకుంటున్నాను

సోఫాలో నుంచి ఎగిరిపడినంత పని చేసాడు రఘునాథ్

నిజంగా అంటున్నావా? నాతో జోక్ చేస్తున్నావా?

లేదు నిజంగానే చెబుతున్నాను

ఇంతకుమించిన ఆనందం లేదు నాకు ఆరాధనగా అన్నాడు

ప్రేమ పిచ్చిది మాత్రమే కాదు గుడ్డిది కూడా తనను కాదని మరో ఆడదాన్ని భార్యగా స్వీకరించిన జయరాంను ద్వేషించలేక ఇంకా అతన్ని ప్రేమిస్తూనే అతనికోసం తన సర్వస్వాన్నీ ధారపోయటానికి సిద్ధంగా ఉన్న ప్రేమికురాలు స్వప్న

తన ప్రేమ నష్టం చేసుకోకుండా తను ప్రేమించినతన్ని పెళ్ళి చేసుకుని కొన్ని సంవత్సరాలు అతనితో కాపురం చేసి అతను మోసం చేస్తే దిక్కుతోచని స్థితిలో తనింటికొచ్చిన స్వప్నకోసం ఏం చెయ్యటానికయినా వెనుకాడని స్థితిలో ఉన్న రఘునాథ్

వీళ్ళిద్దర్నీ చూస్తుంటే ప్రేమా! నీకు జోహార్లు! అనాలనిపిస్తుంది ఎవరికయినా

స్వప్నా! నాయర్ ఉన్నాడు నీకేం కావాలన్నా నిముషాలమీద చేసిపెడతాడు పని కుర్రాడున్నాడు స్నానం చేసి రెస్టు తీసుకో నేను రెండు గంటల తర్వాత వస్తాను హైదరాబాదు నుంచి మా ఫ్రెండ్ వచ్చాడు హోటల్‌లో దిగాడు అతన్ని కల్సుకోవటానికి వెళుతున్నాను వీలయినంత త్వరలో వస్తాను

డ్రెస్సు చేంజ్ చేసుకుని రఘునాథ్ కారులో బయటకు వెళ్ళాడు

బరువుగా నిట్టూరుస్తూ అలాగే కూర్చుంది స్వప్న

ఆమె గుండెల్లో అగ్నిపర్వతాలు బ్రద్దలవుతున్నాయి మహారణ్యాలు కాలిపోతున్నాయి

ఒక గంట గడిచింది చేతికున్న వాచవైపు చూసుకుంది అయిదున్నరయింది

ఈపాటికి ఆయనింటికొచ్చి బాబుతో ఆడుకుంటూ ఉంటారు నేను ఆ ఇంటనికాదని ఇక్కడికొచ్చానంటే నాకే నమ్మ శక్యం కావటం లేదు మామధ్య అసలేం జరగలేదని ఏదో కలొచ్చిందని మళ్ళీ మేము పూర్వంలా ఉండగలిగితే ఎంత బాగుంటుంది? ఆయన్ని చూడకుండా ఇరవయినాలుగు గంటలకంటే ఎక్కువ వుండలేనిదాన్ని ఆయన్ని చూడకుండా ఉండగలననే ఇక్కడకు వచ్చానా? ఆయన పక్కన కనిపించకపోతే నా కనురెప్పలు మూతలు పడవే ఎలా? ఆ ఇంటికి దూరంగా వచ్చి అయిదు గంటలయినా కాలేదు అప్పుడే ఆయన్ని చూడాలని నా హృదయం తపించిపోతుంది ఆయన లేకుండా నేను మనుగడ సాగించలేను

భగవాన్! మనిషికి మనిషికి మధ్య ఇంతటి బలీయమయిన ప్రేమ నెందుకు సృష్టించావు? ప్రేమకోసం ఎన్ని జీవితాలు ఆహుతయిపోతున్నాయి?

ఆరున్నరయింది స్వప్న స్థిమితంగా కూర్చోలేక పోతుంది నాయర్‌ను పిలిచి రఘునాథ్ రాగానే నేను ఇంటికెళ్ళానని చెప్పమని ఇంటికొచ్చింది

స్వప్న వచ్చేసరికి జయరాం బాల్కనీలో కూర్చుని ఉన్నాడు అతను కూర్చున్న కుర్చీ చుట్టూ ఉన్న కాలిపోయిన సిగరెట్ ముక్కలను చూసి అతనక్కడ చాలా సేపటినుంచి కూర్చున్నాడనుకుంది అతని చేతివేళ్ళ మధ్య సిగరెట్ వెలుగుతూనే ఉంది కళ్ళు రక్తపు ముద్దల్లా ఉన్నాయి ఎంతో బాధను బలవంతంగా అణుచుకుంటున్నట్టుగా అతని ముఖం ఎర్రగా కందిపోయి ఉంది తపోనిష్ఠలో మునిగి ఉన్న తపస్విలా స్వప్న రాకను గూడా గమనించనంత పరధ్యానంగా సిగరెట్ పొగతో వలయాలు విడుస్తూ కూర్చున్నాడు అతన్నలా చూడగానే మనస్సు అవ్యక్తమయిన బాధకు లోనయింది స్వప్నకు



# ప్రేమసాగరం

ఆడవారి బలహీనతల్ని మగాడెప్పుడూ తన స్వార్థానికి ఉపయోగించుకుంటూనే ఉంటాడు

నిండు చూలాలన్న జాలికూడా లేకుండా శ్రీరామచంద్రుడు సీతను అడవులపాలు చేసినా సీత భర్తను ద్వేషించలేదు అతనికోసం తపించిపోయిందే తప్ప

అర్జునుడు ద్రౌపతిని పెళ్ళి చేసుకొని తీసుకొచ్చి మా అమ్మ చెప్పింది కాబట్టి నువ్వు మా అన్నదమ్ములు అయిదుగురితోనూ కాపురం చెయ్యాలంటె ఇదెక్కడి న్యాయమని ద్రౌపతి అడగలేదు అయిదుగుర్ని భర్తలుగా స్వీకరించిందే తప్ప

ధర్మరాజు జూదంలో పణంగా పెట్టినా వాళ్ళతో పాటు అరణ్యవాసాలు అజ్ఞాతవాసాలూ చేసిందే తప్ప ఇలాంటి మగాళ్ళతో నేను కాపురం చెయ్యటం ఏమిటి? అనుకొని వాళ్ళను వదిలిరాలేదు

తర తరాలనుంచి యుగ యుగాల నుంచి ఆడదాని బలహీనతని మగవాడు స్వార్థానికి ఉపయోగించుకుంటూనే ఉన్నాడు

ఒక ప్రతివ్రత కుష్ఠురోగి అయిన భర్తను తట్టలో పెట్టుకుని మోస్తూ అతను కావాలన్న వేశ్య దగ్గరకు తీసుకెళ్ళింది మరో ప్రతివ్రత భర్త ప్రాణాలను దక్కించుకోవటానికి యమునితో పోరాటాన్ని సల్పి విజయాన్ని సాధించింది

ఆడది ఎంత తెలివిగలదయినా ఎంతటి సాహసవంతురాలయినా మగాడి అండన తప్ప ఒంటరిగా బ్రతకలేదు అది ఆమె దౌర్బల్యం పురుషుడు రాజ్యమేలుతున్న భారతావనిలో పుట్టిన ఆడది మగాడికి దూరంగా బ్రతకాలనుకున్నా సమాజం బ్రతకనియ్యదు

అతను తన నెంత బాధపెడుతున్నా స్వప్న ఆ క్షణంలో అన్నీ మరిచిపోయింది అతనెందుకు బాధపడుతున్నాడో అనుకుని తను బాధపడింది అనురాగం ప్రేమా మిళితమయిన స్వరంతో మృదువుగా ఏమండీ! అని పిలిచింది జయరాం పలకలేదు మరోసారి పిలిచింది ఏమిటి? అన్నాడు కటువుగా ఆమె కళ్ళలో నీళ్ళు తిరిగాయి

ఎందుకలా ఉన్నారు

నేనెలా ఉంటె నీకేం?

అలా అనుకోగలిగితే మిమ్మల్ని ప్రశ్న అడగాల్సిన పనిలేదు

ఎక్కడికెళ్ళావు?

రఘునాథ్ వాళ్ళింటికి

ఎందుకు?

అర్థంలేని ప్రశ్న

తరుచుగా అతనింటికి వెళ్ళాల్సిన పనేముంది?

వెళ్ళినందువల్ల నష్టం మాత్రం ఏముంది?

అప్పుడే వచ్చేసావేం? అతని గొంతులో వ్యంగ్యం ధ్వనించింది

చక్రమంది స్వప్నకు అతని ప్రశ్నలకు ఆమెలో ఒక విధమయిన మొండితనం చోటు చేసుకుంది అతను బాధపడుతుంటె చూడాలన్న వింతకోరిక కలిగింది

రాకూడదనే అనుకున్నాను

నీ నిర్ణయాన్ని ఈ రోజునుంచె అమలు పర్చాలనుకున్నావా?

అవును

మరి వచ్చేసావేం?

మీకు చెప్పెళదామని వ్యంగ్యం కోపం రెండూ పోటిపడ్డాయి ఆమె మాటల్లో

స్వయం నిర్ణయాలు తీసుకునేదానివి నాకు చెప్పటందేనికి?

ఎంతయినా భర్త కదా మీరు

ఆ భావం నీలో ఉంటె ఇలా చెయ్యగలిగేదానివా?

ఉన్నది కాబట్టే మీరేం చేసినా ఇంతవరకూ సహించగలుగుతున్నాను

ఎన్నో సహించినదానివి ఇప్పుడెందుకు ఇలాంటి నిర్ణయానికొచ్చావు?

నా అవసరం మీకు లేదు కాబట్టి

అవసరం లేదని నీకు చెప్పానా? అస్సలు నీతో మాట్లాడే అవకాశం ఇస్తున్నావా నాకు?

ఇంతకీ ఏమిటి మీరనేది? నేను రఘునాథ్ వాళ్ళింటికి వెళ్ళటం తప్పంటారా? సూటిగా అతని కళ్ళలోకి చూస్తూ అడిగింది తేలుకుట్టిన దొంగలా ఉంది అతని స్థితి

మాట్లాడరేం?

వెళ్ళటం తప్పని అనటం లేదు

మరేమిటి మీరనేది?

వెళితే నా మనస్సు బాధపడుతుందని చెబుతున్నాను తప్ప వెళ్ళటం తప్పనటం లేదు అంతకు ముందు ధ్వనించిన వ్యంగ్యంగాని కోపంగానీ లేవు అతని గొంతులో బాధ తప్ప

విస్మయంగా చూసింది అతని వైపు ఆమె ముఖం దీప్తవంతమయింది ఒక్క ఉదుటున అతని గుండెలకు అంటుకుపోవాలన్న కోరికను అతి ప్రయత్నంమీద అణుచుకుంది

స్వప్నా! నిజంగా నువ్వు అక్కడే ఉండాలనుకుంటున్నావా?

అవును

నాకు దూరంగా ఉండగలవా?

ప్రయత్నిస్తాను

ఉండలేవు

చెప్పానుగా ప్రయత్నిస్తానని

నీ మనస్సు నాకు తెలుసు నువ్వు బ్రతికుండగా నాకు దూరంగా ఉండలేవు నువ్వు నా ప్రేమలో పడిన క్షణంలోనే నీ ఉనికిని మరిచిపోయి నాలో కల్సిపోయావు నేను కనిపించకపోతే ఊపిరి కూడా పీల్చలేనంతగా నామీద ఆధారపడి బ్రతుకుతున్నావు నువ్వు నువ్వుగాలేవు అలాంటిది నాకు దూరంగా నువ్వెలా బ్రతకగలవు? స్వప్నా! మన నీడ మనకు దూరంగా ఉండగలదా?

(ఇంకా ఉంది)

# నైరాశ్యం

ఆ కిటికీ తలుపుల వలపులకు
చిడతల్లేవు–
ఎప్పుడో వేసిన వెల్ల
పెళ్ళలై ఊడి, వెలిసి
వెలా వెలా బోతుంది గతంలా!
తెగినా రాలని బూజుల జ్ఞాపకాలు
అందం కోసం అలంకరిస్తే
చిరిగి పిగిలి పేలికలై
చిరుగాలికి కూడా కొట్టుకునే
కవితల కర్టెన్లు,
దుమ్మూ దూళీ
ముగ్గుల్లా పేరుకున్న పెళ్ళల గచ్చుమీద
వొదలిపోయిన చింకిచాప జీవితానుభవాలు,
ఏ ముఖమూ దొరక్క సుఖమూ మిగలక
అలాగ్గా చూసుకునే అవకాశము మిగలక
గుండె ముక్కలు చేసుకున్న హృదయపు అద్దమ్ముక్కా–
ఆలోచనల కోశాలను దువ్వి అలసి
పళ్ళూడిన దువ్వెన అవ్వ!
కాని–
అడిల్చినా వొచ్చి
అట్టారెట్ట వేసిపొయ్యే
ఆ ఎచ్చుకలల్ని
ఎట్టా క్షమించనూ ?????

–బి వి.ఆర్ రెడ్డి

# సీక్రెట్ ఏజంట్ విక్రమ్

9

మార్టిన్ ఒక నాణాన్ని ఇస్తాడు-

ఏం చేద్దా మనుకుంటున్నావు?

వేచి చూడు ఈలో గా నువ్వు దుస్తులు వేసుకో

29/9

ఆ టేబుల్ లైట్ కి ఉన్న బల్బుని తీసి నాణాన్ని దాని హోల్డర్ లో వేస్తాడు విక్రమ్

ఆ లైటు స్విచ్చి వెయ్యగానే-

ఏం జరిగింది విక్రమ్?

కరెంటు పోయేలా చేసాను తలుపు తెరుచుకుని ఉండాలి

ఆ గదినించి బయటికి వచ్చిన తర్వాత-

అదిగో! కాపలా వ్యక్తి వస్తున్నాడు వాడి పని పడదాము ఒక విషయం తెలుసుకోవాలి

అరిచావంటే అదే నీ ఆఖరు అరుపు అవుతుంది రేడియో గది ఎక్కడుంది?

ఇలా వెళ్ళి ఎడమ వైపు తిరగండి

త్వరగా రా! ఆ ఫ్యూజ్ ని తిరిగి వెయ్యటానికి వాళ్ళకి ఆట్టే సేపు పట్టదు స్పృహ తప్పిన అతన్ని అలాగే వదిలి వెయ్యి

ఒక్కసారిగా లైట్లు వెలిగాయి

కదలవద్దు!

ఇదేమిటి మిస్టర్ కాలిస్టో?

© RANG REKHA FEATURES PVT LTD 83

కాలిస్టో ని చూసేందుకు ఆ కాపలా వ్యక్తి తల తిప్పుతాడు అంతే-

(ఇంకా వుంది)

# నన్ను క్షమించండి

విశ్వనాథ గణపతిరావు



సింధియా జంక్షన్ బస్ స్టాప్ ఖాళీగా ఉంది కృష్ణ ఆశ్చర్యపోయాడు ఇంత ఖాళీగా ఉందేమిటా! అని అనుకుంటూనే వెళ్ళి స్టాప్‌లో నించున్నాడు

చుట్టూ ఓ రెండు మూడు పేక్టరీలున్న సెంటర్ గనుక సాదారణంగా ఆ బస్ స్టాప్ ఖాళీగా ఉండదు కాని ఇప్పుడు ఓ ఇద్దరు ముగ్గురు తప్పా ఇంకెవరూ లేకపోయేసరికి ప్రక్కనే చిన్న పెట్టె పట్టుకుని నిల్చున్న ఓ ముసలాయన్ని ఆశ్చర్యంతో అడిగాడు కృష్ణ

మరేం బాబూ! నాలుగు బస్సులు ఒక్కసారే వచ్చేసి దాన్ని తప్పించుకుని ఇది దీన్ని తప్పించుకుని అది ఎల్లిపోనాయి ఆ అడావుడిలో కొందరు ఎక్కినారు మరికొంత మంది నానాటోలు ఇక్కడే నిలుచుని ఎర్రి సూపులు సూత్తా ఉండిపోనారు నానుగాని ఆ మద్దికెళ్ళినానంటే ఏ బస్సు కిందన్నా పడిపోతానని బయిమేసి ఇక్కడే బొమ్మనాగ నిలుసుండి పోనాను ఇంతలో ఓ పెయివేటు బస్సు ఒచ్చినాది దానిలోకి మిగిలిన జనమంతా ఎక్కేసినారు నానూ మరో ఇద్దరూ ఎక్కడానికి ఖాళీ లేక ఇక్కడ మిగిలిపోనాము ఏం బస్సులు బాబూ! ఓ పద్ధతి పాడూ నేదు ఛీ!

ఇప్పుడర్థమయింది కృష్ణకి బస్‌స్టాప్ ఎందుకంత ఖాళీగా ఉందో! అర్థమయిన అరగంటకు గాని బస్సు రాలేదు వచ్చిన బస్సులో కొంచ కూడా ఖాళీ లేదు సీజనులో ఈత చెట్లకు గుత్తులుగా వ్రేలాడే ఈతకాయల్లా వ్రేలాడుతున్నారు రెండు గేట్ల దగ్గరా జనం

కృష్ణ కాలు వైపు చూసుకున్నాడు పేక్టరీలో పని చేస్తుండగా కాలుకి దెబ్బ తగిలింది ఇంజక్షన్స్ టేబ్‌లెట్స్ మరో రెండు రోజులు వాడితే తగ్గిపోతుందని డాక్టర్ చెప్పాడు అటువంటిది ఇంత లోడుగా ఉన్న బస్సులో ఎక్కితే దెబ్బ రగిడి మరికొన్నాళ్ళు మందులు వాడవలసి వస్తుందేమోనని అనుకుంటూ ఆ బస్సు ఎక్కడం మానేసాడు ఇలాగే మానేసాడు మరో నాలుగు బస్సుల వరకూ!

కృష్ణకు చిన్న దెబ్బ తగిలినా కాస్త తలనొప్పి వచ్చినా ప్రాణం పోతున్నంత హడావుడి చేస్తాడు ఫ్యాక్టరీలోనూ ఇంటి వగ్గర కూడా! అందుకే స్నేహితులందరూ కృష్ణను సుకుమార్ అని పిలుస్తూ ఉంటారు

ఇంతలో ఎక్స్‌ప్రెస్ సర్వీస్ అని బోర్డు పెట్టుకుని ఆమెమీద మీద వచ్చి ఆగింది ఒక బస్సు బస్సులో జనం ఉన్నారు గాని నిలుచుని ఎవరూ లేరు ఎక్స్‌ప్రెస్ సర్వీస్ గనుక పెద్ద జంక్షన్‌లలో మాత్రమే ఆగుతుంది అప్పటికి ఆ జంక్షన్‌లో ఉన్న ఇద్దరు ముగ్గురిని ఎక్కించుకుని తుర్రున వచ్చేసింది అందుకే ఆ మాత్రం ఖాళీగా ఉంది

కృష్ణ ఆ ఎక్స్‌ప్రెస్ సర్వీస్ బస్సు ఎక్కేసాడు ఎక్క చూస్తే సీట్లన్నీ నిండిపోయి ఉన్నాయి ముందు ఓ సీటు మాత్రం ఖాళీగా ఉంది దానిలో కూర్చున్నాడు కూర్చోవడం చూసి కండక్టర్ చెప్పాడు అది లేడీస్ సీటండి ఎవరైనా బస్సెక్కితే లేచిపోవాలి! అని

నా కాలుకి దెబ్బ తగిలింది నొప్పిగా ఉంది నేను లేవను అని లేని బాధను నటిస్తూ చెప్పాడు కృష్ణ

కండక్టర్ తనకేం పోయిందిలే అని అతని దగ్గర టికెట్ కట్ చేసి వెనుకకి వెళ్ళిపోయాడు

బస్సు కదలి మరలా నేవల్‌డాక్‌యార్డ్ జంక్షన్‌లో ఆగింది అక్కడ ఒకామె ఎక్కింది ఆమెకు కూర్చోటానికి సీటు లేక పోయేసరికి హేండిల్ పట్టుకుని నిలుచుంది

బస్సు కదిలింది

కృష్ణ ఆమె వైపు చూసాడు కృష్ణే కాదు బస్సులో ఉన్న వాళ్ళందరూ చూస్తున్నారు

ఆమె మట్టి పని చేసుకొనే మనిషని చూస్తుంటగానే తెలుస్తుంది తల మీద వెంట్రుకలు రాగితీగల్లా ఎర్రబడి ఉన్నాయి దగ్గరగా దువ్వుకుని గట్టిగా తాడు పేనినట్లు జడ అల్లుకుంది పెద్ద పెద్ద పువ్వులున్న ముతక చీర కట్టుకుంది చేతికి మట్టి గాజులు వేసుకుంది

ఆమె నిండు గర్భవతి కావడంవల్ల కడుపు మరీ ఎత్తుగా ఉంది

కృష్ణ లేచి తన సీటు ఆమెకు ఇచ్చేయాలనుకున్నాడు కాని ఇందాక కండక్టర్‌తో తన కాలుకి దెబ్బ ఉందని చాలా నొప్పిగా ఉందని

చెప్పాడు గనుక ఆ ప్రయత్నం నుండి విరమించుకుని ఆమె వైపు చూడకుండా విండో నుండి బైటకు చూస్తూ ఉండిపోయాడు

ఇంతలో బస్సు కాన్వెంట్ జంక్షన్‌కు వచ్చి ఆగింది అక్కడ మగవాళ్ళు చాలామంది వెనుక డోర్‌లో నుండి ఎక్కారు ముందు నుండి మాత్రం ఓ అమ్మాయి ఎక్కింది ఆమె సన్నగా ఉంది చేతిలో పోల్డింగ్ గొడుగు భుజానికి హేండ్ బాగ్ తగిలించుకుంది ఆమె చాలా అందంగా ఉంది రచయితలూ, రచయిత్రిలూ తమ కథలలో మెరుపు తీగ మల్లె తీగ అని వర్ణించి వ్రాసే అమ్మాయి ఈమెనేమో! అని అనుకునేలా ఉంది గుండ్రటి కళ్ళను గిర్రున తిప్పి సీట్లన్నీ వెతికేసింది ఖాళీ సీటుకోసం కానీ ఒక్క సీటు కూడా తను కూర్చోడానికి లేకపోయేసరికి గిరుక్కున ఇటు తిరిగబోయేసరికి ఆమె చూపు అంచులో కృష్ణ కనిపించాడు అతను కూర్చుని వున్న సీటు కనిపించింది ఆ సీటు మీద స్త్రీలు అన్న అక్షరాలు కనిపించాయి గబుక్కున తల ఎత్తి చూసింది అతని వైపు సీరియస్‌గా!

బస్సు కదిలింది

ఏవండి! పిలిచింది ఆమె

తల ఇటు తిప్పి ఆమె వైపు చూసాడు ఏవంటి' అన్నట్టు!

ఇద్దరం ఆడవాళ్లం నిలుచుని ఉండగా మీరు మా సీట్లో కూర్చోవడం బాగోలేదు లేవండి! అంది అధికారంగా!

ఆమె రిక్వెస్టుగా చెప్పకపోయేసరికి కృష్ణ అహం దెబ్బతిన్నట్టుగా ఫీలయ్యాడు అందుకే సీట్లో నుండి లేవకుండా కండక్టర్‌కి చెప్పిన సమాధానమే ఈమెకూ చెప్పాడు

ఆమె అతని కాలు వైపు చూసింది చిన్న కట్టు కట్టి ఉంది ఓస్! ఈ మాత్రం దెబ్బకేనా?! అన్నట్టు అతని వైపు చూసింది కాని కృష్ణ సీట్లో నుండి లేవలేదు

ఆమెకు కాస్త పట్టుదల పెరిగినట్లుంది అందుకో

మీ కాలుకి దెబ్బ ఉంటే మరో మగాళ్ళ సీటులో ఉన్నతడ్ని రిక్వెస్టు చేసి అతడ్ని లేవమని చెప్పి మీరు కూర్చోండి అంతేగాని మా సీట్లో కూర్చోడానికి వీలులేదు లేవండి అంది ఖచ్చితంగా!

బస్సులో ఉన్నవాళ్ళంతా వాళ్ళ ఇద్దరి వైపే చూస్తున్నారు అది గ్రహించిన కృష్ణకి ఆమె పైన కోపం ముంచుకొచ్చింది

ఇంతలో వెనుక నుండి ఎవరో అన్నారు

సీటు ఖాళీ చేసెయ్ గురూ! ఐదు నిముషాల జర్నీకి వాదనెందుకు?! అని!

ఐదు నిముషాలు కూర్చునే సీటు కోసమే మనం వాదించుకుంటున్నాం ఐదు సంవత్సరాలు కూర్చునే సీటు కోసం రాజకీయ నాయకులు గుద్దులాడుకుంటారంటే గుద్దులాడుకోరటండి! అన్నాడు ఆఖరి సీట్లో కూర్చున్న ఓ రడీమేడ్ రాజకీయ పక్షి

ఇప్పుడు స్క్వాడ్ గాని వచ్చిందంటే లేడీ సీట్లో కూర్చున్నందుకు ఫైను వేస్తారు మరొకడి బెదిరింపు!

ఒక వేళ ఫైను కట్టకపోతే ఏం చేస్తారు గురూ? ఒకతని ధర్మసందేహం

ఈ బస్సు దించేసి మరో బస్సు ఎక్కిస్తారు

ఆ బస్సు ఎక్కడికి వెళ్తుంది?

పోలీస్ స్టేషన్‌కి!

అబ్బా! అంత మర్యాద చేస్తారన్న మాట!

ఆ మాటలు వింటున్న కృష్ణకి తల కొట్టేసినట్లయింది పరిగెడుతున్న బస్సులో నుంచి బయటకు గెంతేయాలనిపించింది

ఇదిగో మిస్టర్! లేవమంటుంటే నిన్ను కాదూ? ఈసారి చిరాగ్గా అంది ఆ అమ్మాయి

కృష్ణ ఆమె వైపు కొరకొరా చూసాడు సీట్లోనుండి లేస్తూ ఆమెకు సీటు ఇవ్వడం ఇష్టంలేక ఇందాక ఈమెకన్నా ముందు బస్సు ఎక్కిన కడుపుతో ఉన్న ఆమెను పిలిచి సీట్లో కూర్చోబెట్టాడు

ఆ అమ్మాయి కృష్ణ ముఖంలోకి చూసింది

కృష్ణ ఆమె వైపు చూసావా నా ఘనకార్యం?! అన్నట్టు చూసాడు ఎవరు కూర్చున్నా నిన్ను సీటు ఖాళీ చేయించానుగా! అన్నట్టు చూసింది ఆ అమ్మాయి

బస్సు రైల్వేస్టేషన్ దగ్గర ఆగింది

కృష్ణ అక్కడ దిగాలి కాని దిగలేదు ఆ అమ్మాయి కూడా దిగలేదు కండక్టర్ వచ్చి ఆ అమ్మాయిని టికెట్ అడిగాడు

దొండపర్తి జంక్షన్‌కి ఒక టికెట్ ఇవ్వండి! అంటూ బాగ్‌లో నుండి రూపాయి తీసి ఇచ్చింది కండక్టర్ చిల్లరతో పాటూ టికెట్ ఇచ్చి ఎరలా వెనుకకి వెళ్ళిపోయాడు

ఈ అమ్మాయి దొండపర్తి జంక్షన్ దగ్గర దిగుతుందన్న మాట! అనుకున్నాడు కృష్ణ నాలుగు మాటలు అడిగి కడిగేయాలి నన్ను క్షమించండి అని అనేవరకూ ఊరుకోకూడదు అని మరోసారి అనుకున్నాడు

బస్సు దొండపర్తి జంక్షన్‌కి వచ్చి ఆగింది

ఆ అమ్మాయి దిగింది

కృష్ణ కూడా ఆమె వెనుకే దిగాడు

దిగి ఆమె ముందుకు నడిచింది చురుగ్గా!

ఆమె వెనుక తొందరగా నడచి ఆమె ప్రక్కకు చేరాడు కృష్ణ ప్రక్కగా ఆమెతో సమానంగా నడుస్తున్నాడు

ఆమె టక్కున ఆగింది

కృష్ణ ఆగాడు

ఏమిటి? అన్నట్లు కాస్త ఆశ్చర్యంగా చూసింది కృష్ణ వైపు ఆమె!

అప్పుడు అన్నాడు కృష్ణ ఆ అమ్మాయిని!,

నన్ను నలుగురిలో 'షేమ్' చేసావు నా కాలుకి దెబ్బ తగిలి నొప్పిగా ఉందని చెప్పినా విన్నావు కాదు ఇంత పొగరుతో ఉండటం మంచిదికాదు

ఈ మాటలు అనాలనేనా నన్ను ఫాలో అవుతున్నారు? అంది

అవును లేకపోతే నేను ముందు స్టాపులో నే దిగిపోదను

ఆ మాటలు విని ఆమె నవ్వింది కృష్ణ ఆశ్చర్యపోయాడు ఆమె నవ్వేసరికి ఎందుకు నవ్విందో అస్సలర్థం కాలేదు

చూడండి! మీ కాలుకి దెబ్బ తగిలి ఎన్నాళ్ళయింది ?

పదిహేను రోజులు

పదిహేను రోజులుగా సరిగ్గానడవలేకపోతున్నారు కదూ?

ఆమె ఎందుకలా అడుగుతుందో కృష్ణకి అర్థంకాలేదు

ఆమె కుడి చేతిలో గొడుగును ఎడం చేతిలోకి మార్చుకుని కుడి చేత్తో చర కుచ్చెళ్ళు పట్టుకుని కాస్త పైకెత్తి కుడి కాలు చూపించింది

అది కర్ర కాలు!

కృష్ణ ఆశ్చర్యంగా ఆ కాలు వైపు చూస్తూ ఉండిపోయాడు నోట మాట రాక

ఆమె అంది మరలా!

పుట్టిన దగ్గర నుండి నాకు కాలు లేదు పదిహేను సంవత్సరాలుగా ఈ కర్ర కాలుతో తిరుగుతున్నాను

పదిహేను రోజులకే మరి అంత బాధపడిపోతున్న మీతో పోల్చుకుంటే పదిహేనేళ్ళుగా ఈ కర్ర కాలుతో తిరుగుతున్నందుకు నేనెంత బాధపడాలి?

ఆమె ఇంకా ఏవో మాటలు చెపుతూనే ఉంది కృష్ణ మరక్కడ నిలువలేక నన్ను క్షమించండి! అనేసి వెనుతిరిగాడు □






# రు.1,00,

# బహుమతులతో

తమదైన ప్రత్యేక రీతిలో గత ఎనిమిదేళ్ళుగా పాఠకులను
100వ సంచికలు 1986 మే నెలలో వెలువడుతున్న
రచనల పోటీ — పెరుగుతున్న పాఠకాదరణతో
పాల్గొనదలచిన

## విపుల

| | | రు. |
|---|---|---|
| ఒక అత్యుత్తమ తెలుగు కథకు | ... | 3,000 |
| ఒక అత్యుత్తమ ఆంధ్రేతర భారతీయ భాషాకథకు— ఏ భాషదయినా | ... | 3,000 |
| మూడు ఉత్తమ కథలకు రు. 1,000 చొప్పున | ... | 3,000 |
| పది మంచి కథలకు రు. 500 చొప్పున | ... | 5,000 |
| 120 కథలకు కన్సొలేషన్ బహుమతులు రు. 300 చొప్పున. | | 36,000 |

నిబంధనలు:

★ ఇతివృత్తం తెలుగు వారి జీవితానికి సంబంధించినదే అయి ఉండాలి. ఆసక్తికరంగా చదివించి, ఆలోచింపజేయగల నూతన ప్రయోగాలకు ప్రత్యేక ప్రాధాన్యత. అనువాదాలు, అనుసరణలు పనికిరావు.

★ కథ నిడివి 10 నుండి 15 అరఠావుల వరకూ ఉండవచ్చును. కథ వ్రాతప్రతిలో ఎక్కడా రచయిత/త్రి పేరుగాని, చిరునామాగాని ఉండరాదు. మొదటి పేజీలోనే ప్రత్యేకించి రచన, రచయిత/త్రి వివరాలు, చిరునామా ఉండాలి. తగినన్ని స్టాంపులు అంటించిన స్వంత చిరునామాగల కవరు ప్రతి రచనతోనూ తప్పనిసరిగా జతపరచాలి.

★ కలంపేరు వాడినా, రచయిత/త్రులు తమ పూర్తిపేరు, చిరునామా మొదటిపేజీలోనే తెలపాలి. కథ తమస్వంత రచనేగాని అనుకరణ కాదనీ, మరేపత్రికకూ పంపలేదనే హామీపత్రం జతపరచాలి.

★ రచనల ఎన్నిక, బహుమతుల నిర్ణయం ఇత్యాది విషయాలన్నింటా సంపాదకునిదే తుదినిర్ణయం. ఈవిషయంలో ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలకు అవకాశం లేదు.

★ తెలుగేతర భాషా కథలకు ఇచ్చే బహుమతులు ఆయా భాషా రచయితలకి ఉద్దేశించిన ప్రత్యేక పోటీకి మాత్రమే. కనుక అనువాద కథలను ఈపోటీకి పంపవద్దని మనవి.

★ కవరు మీద తప్పనిసరిగా తెలుగు కథలపోటీకి అని పేర్కొనాలి.

రచనలు మాకు చేరవలసిన ఆఖరుతేదీ **30-4-1986**

## విపుల



ఎడిటర్,
విపుల, ఈనాడు కాంపౌండ్,
సోమాజిగూడా, హైదరాబాద్-500482.

# 000
# కథలు, నవలల పోటీ

ఆకట్టుకుంటున్న జంటపత్రికలు — విపుల,చతురల
దర్భంగా మొట్టమొదటగా భారీయెత్తున నిర్వహిస్తున్న
సాగుతున్న జంటపత్రికల జైత్రయాత్రలో
చయిత(త్రు)లకు స్వాగతం!




## చతుర

| | రు |
|---|---|
| ఒక అత్యుత్తమ నవలకు | 10,000 |
| ఒక ఉత్తమ నవలకు | 6,000 |
| ఒక మంచి నవలకు | 4,000 |
| పది నవలలకు కన్సొలేషన్ బహుమతులు | 30,000 |

(నవలకు రు 3000/- చొప్పున)

### నిబంధనలు

- ★ కథావస్తువు తెలుగువారి జీవితానికి సంబంధించినదై వుండాలి 'చతుర'లో నవల మాత్రమే అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా, అంటే 26 వేల పదాలకు తక్కువకాకుండా వుండాలి! 'చతుర' కొరకై ప్రత్యేకంగా ఈదృష్టిలో రాసిపంపిన నవలలు మాత్రమే పరిశీలనార్హమవుతాయి
- ★ బహుమతి పొందని నవలల్లో సాధారణ ప్రచురణార్హమైనవి స్వీకరించి మామూలుగా ప్రచురించే అవకాశం ఉంటుంది అలా ఎన్నికచేసిన నవలలకు మామూలుగా పారితోషికం రు 2,000 వుంటుంది
- ★ నవలల్ని ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించవలసి వచ్చే పక్షంలో అందుకు అభ్యంతరం లేనివారే పోటీలో పాల్గొనాలి
- ★ నవల స్వంత రచనేనని, అనుకరణకాదని, మరే ఇతర పత్రికల పరిశీలనలోలేదని ధృవపరిచే హామీపత్రాన్ని విధిగా జతపరచాలి
- ★ ప్రచురణకై ఎన్నికకాని నవలలను తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజీ జతపరచాలి అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతరత్రాగానీ పోయినా మాబాధ్యతవుండదు తర్వాత ఉత్తరాలు రాయడంవల్ల ప్రయోజనం వుండదు
- ★ బహుమతుల నిర్ణయం, ఇత్యాదివిషయాలన్నింటిలోనూ సంపాదకునిదే తుదినిర్ణయం ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలకు, వాదవివాదలకు అవకాశంలేదు గడువుతేదీ ముగిశాక వచ్చిన నవలలు పోటీకి పరిశీలించబడవు

నవలలు మాకు చేరవలసిన ఆఖరు తేదీ **30-4-1986**



**ఎడిటర్,**
**చతుర, ఈనాడు కాంపౌండ్,**
సోమాజిగూడా, హైదరాబాద్-500 482

# చతుర




(గత సంచిక తరువాయి)

"రవికి తను అలాగేనా తన మనసు తెలియ చెయ్యడం?" సుధ కండ్ల నుండ జలజల నీళ్ళు రాలుతున్నాయి.

"తనిప్పుడేం అనుకొని లాభమేమిటి? రవి అప్పు డెంత బాధపడు తుంటాడో.... అతడి ప్రేమకోసం తపిస్తూ తను మాట్లాడిన ప్రతిమాటా అతడ్ని బాధపెట్టి తనను అతడికి దూరం చేసింది.

"సుధా నువ్విలా అనడం ఆశ్చర్యంగా వుంది." అనడం తప్ప రవి ఆ రోజేం మాట్లాడలేదు.

అప్పటికే అతడి మనసు బాధతో నలిగిపోయి వుంటుంది. ఇక తన గురించేం చెప్పుకో గలదు?

తను అతడికేం జవాబివ్వలేదు.

ఏమని చెబుతుంది అతడికి? ఆలోచన లేకుండా మాట్లాడిన మాటల గురించి చర్చించాలనిపించలేదు. గుండె కోస్తున్నంత బాధగా వుంది సుధకు.

రవి భారంగా చెప్పుకొని చెబుతున్న వాడిలా చెప్పడం మొదలుపెట్టాడు.

సుధ గోడకు జారి కూలబడినట్లుగా కూర్చొని వింటోంది.

* * * *

దేవకికి చిన్నప్పుడే తల్లిదండ్రులు పోయారు. మేనత్త కాంతమ్మ తెచ్చి పెంచి పెద్దచేసి పద్దెనిమిదేళ్ళు రాగానే పెండ్లి చేసింది. కాని సంవత్సరం తిరక్కుండానే అదృష్టం ఆమెను వెక్కిరించింది. భర్త గుండెపోటుతో మరణించాడు. మళ్ళీ మేనత్త ఇంటికి చేరింది. ఆరు నెలల కాలం గడిచింది. ఆ తర్వాతే మార్పు....

జరిగిన కథ—10 : రవి సహకరిస్తే సుధకి మానసిక రుగ్మత పూర్తిగా నయమవుతుందని చెప్పాడు డాక్టర్. రవి అంగీకరిస్తాడు. సుధ, చంద్రం స్నేహంగా ఉంటున్నారు. ప్రతిమ గర్భవతయింది. ప్రతిమపై సుధకు అసూయా ద్వేషాలు పొంగి పొర్లుతున్నాయి. రవికి భార్యంటే పెద్దగా అభిమానం లేదని, అతని హృదయంలో ఇప్పటికీ తనకే స్థానం ఉందని ఊహించుకుని తృప్తి పడసాగింది సుధ. సుధను రవికి మరీ సన్నిహితంగా మెలగవద్దని హితబోధ చేస్తాడు చంద్రం. ప్రతిమలో అనుమానం మొదలయ్యింది. సుధకు పెళ్ళి చేయమని సుధ తండ్రితో చెప్తాడు రవి. ప్రతిమకు కొడుకు పుట్టాడు.

తనను పెంచినవారే తన జీవితాన్ని అపవిత్రం చేయాలనుకున్నారని తెలుసుకుంది దేవకి.

"మేము నిన్ను జీవితాంతం పోషించేందుకు మా దగ్గరేముంది గనుక? వృద్ధాప్యం మీదపడ్డ మాకు నువ్వు సహాయపడ్డట్లుంటుంది. అవసరానికి చేస్తున్నది కాబట్టి చెడుగా అనుకోనక్కర్లేదు. నువ్వు వెళ్ళేది బ్రోతల్ హవుస్‌కు కాదు. ఖరీదైన హోటళ్ళలో.... పెద్ద పెద్దవాళ్ళతో గడపడం.... నీకేదో పని దొరికి వెళ్ళావని చెబుతా మిక్కడ..." మామయ్య గోపాలం చెబుతోంటే నిలుగుడ్లు వేసుకొని విన్నది దేవకి.

"మామయ్యా నీ కూతురిలా పెంచావు. నన్ను రొంపిలోకి దింపాలని ఎలా అనుకో గలిగావు?" దీనంగా అడిగింది.

"ఇది రొంపికాదు...."

"తప్పాశకు పోతున్న మీకు అలా అనిపించక పోవచ్చు. కాని ఆడదానికి శీలంకంటే మిన్న అయినదేదీ లేదు."

"అబ్బ! కబుర్లు చెబుతున్నావు. నిను పెట్టి పోషించేందుకు నీ మొగుడు ముల్లె ఇచ్చిపోలేదు." ఎగిరి పడ్డాడు గోపాలం.

"ఆలోచించు దేవకి. ముందు జీవితం ఎంతో వున్నదానివి. ఏ ఆనందం లేకుండా వుండడం కన్నా ఇలా మాకు సహాయపడుతూ నిన్ను నువ్వు పోషించుకోవచ్చు." అంది కాంతమ్మ.

"అత్తయ్యా నువ్వూ అలా అంటే నేనెవరికి చెప్పుకోను?" ఏడుస్తూ అంది దేవకి.

"ఎవరికేం చెప్పుకోవాలి? నువ్వు సుఖపడుతూ మమ్మల్ని సంతోష పెట్ట మంటున్నాను. తప్పేముంది?" కోపంగా అంది కాంతమ్మ.

ఆమె తనను ప్రేమగా ఎత్తుకు ఎత్తుగా పెంచుతున్నా విసుక్కొని ఎరుగదు. ఈనాడిలా అంటోందంటే ఊర్లో వాళ్ళెవరో తనమీద డబ్బు సంపాదించ వచ్చని బోధ చేశారని తెలుసుకుంది.

"సంపాదన కిదేనా దారి?" ఆమె ఆలోచన మార్చగలనేమో ననుకుంటూ అంది.

"ఏ పని చేస్తే నువ్వు కావల్సినంత డబ్బు సంపాదించ గలవు?" వురిమి చూసింది కాంతమ్మ.

తనేం చెప్పినా వాళ్ళు వినరని ఆ మాటలే తెలియ చేశాయి.

తను కన్న కూతురు కాదు కాబట్టి తన గురించి ఆలోచించాల్సిన అవసరం లేదన్న అభిప్రాయం కలిగించారే మహానుభావులు

"నన్ను కొంచెం ఆలోచించుకో నివ్వండి మామయ్యా అంది గోపాలం వైపు చూసి. అతడితో అలా అన్నది తను ఆ వృత్తి గురించి ఆలోచించాలని కాదు తను అక్కడి నుండి వెళ్ళిపోవాలనుకుంది ఎక్కడికి వెళ్ళాలో వెంటనే నిశ్చయించుకోలేక ఆ వ్యవధి కావాలన్నది ఆ ఊర్లో వుంటే అత్తయ్య మామయ్య మనసు చెరిచినవాళ్ళు తనను పరువుగా బ్రతకనివ్వరని తెలుసు

మూడు రోజులు గడిచాయి.

"ఇంకా నీ ఆలోచన పూర్తి కాలేదా?" గోపాలం హూంకరింపుగా అడిగాడు నాలుగో రోజు ప్రొద్దునే.

"అయింది. రాత్రి పట్నం వెళ్దాం." నిర్వేదంగా సమాధానం చెప్పింది దేవకి.

"మా బంగారు తల్లి.... నాకు తెలుసే నీవు తెలివిగా ఆలోచిస్తావని.... ఇక నీకే కష్టాలు కన్నీళ్ళు వుండవు." కాంతమ్మ దగ్గరికి వచ్చి చెంపలు నిమిరింది.

దేవకి ఆమె వైపు గూడా చూడలేదు. బిందె తీసుకొని నీళ్ళకు బైలు దేరింది.

"తను అనుకున్నది తన శరీరాన్ని అమ్ముతూ డబ్బు సంపాదించాలని కాదు. సాయంత్రానికల్లా తను మట్టిలో కలిసి పోవాలని. ఇది తెలిస్తే వాళ్ళేమంటారో...." తనలో తనే నవ్వుకుంది.

"మూడు రోజులుగా ఆలోచిస్తోంది. తన కెక్కడికి వెళ్ళాలో తోచలేదు. ఎలా బ్రతకాలో తెలియ లేదు. ఆదరించే వారెవరూ లేనపుడు బ్రతుకు దుర్భరం.... ఆ దుర్భరత్వాన్ని ఎందు కనుభవించాలి? మృత్యువును కౌగలించుకుంటే బాధ వుండదు." మంచి నీళ్ళ బావి దాటి ద్రాక్షతోట వైపు వెళ్ళింది.

"అక్కడ లోతైన బావి. అది తనను తిరిగి రానివ్వదు." భయంభయంగా తోటలోకి వచ్చి బావి వైపొక్క క్షణం చూసి బిందె ప్రక్కన పెట్టి దూకబోతుండగా వెనక నుండి భుజంమీద చెయ్యి పడిందెవరిదో.

"ఎవరు?" భయంగా వెనక్కు చూసింది దేవకి.

దృఢంగా, ఆరోగ్యంగా వున్న యువకుడు. ఆమె భుజాన్నింకా పట్టుకొనే వున్నాడు.

"వదలండి." దేవకి అతడి చెయ్యి తీసెయ్యబోతే, "ఎందుకు? అందులో పడి దూకేందుకా?" అతడు ఇవతలికి లాగాడు.

"మీకు తెలియదు. నన్ను వదలండి. చావే నన్నినాడు రక్షించగలిగేది..."

"రక్షించడమా...." నవ్వాడతడు.

"చావు రక్షించడ మేమిటి? చచ్చాక చేసే దేముందింక?"

"బ్రతికి రోజూ చావకుండా ఒకే రోజు చావడం అదృష్టం."

"అంత కష్టం ఏ మొచ్చింది?"

"చెప్పి లాభంలేదు. నా బాధ నెవరూ తీర్చలేరు. దురదృష్టానికి ప్రతి రూపాన్ని నేను...." గంగా యమునలే అయ్యాయి ఆమె నేత్రాలు.

"ఆ చాందసత్వంతో మృత్యువును చేరాలనుకున్నావా?" భుజంమీద నుండి చెయ్యి తీసి చెయ్యి పట్టుకొని కూర్చొ పెట్టబోతుంటే....

"వద్దండి. మీరు వెళ్ళిపొండి. నాకు బ్రతుకు శాపం." ఆమె చెయ్యి విడిపించుకొనే ప్రయత్నం చేస్తుంటే అతడు మరింత గట్టిగా పట్టుకున్నాడు.



# మనసుకు సంకెళ్ళు

"బ్రతుకు శాపం కాదు. గొప్పవరం...."

అది అన్నీ వున్నవాళ్ళకు

నీకేం తక్కువ?

అన్నీ తక్కువే అన్నిటకన్నామిన్న అయినది అయిదొతనం అదుంటె నాకీనాడు ఈ అవసరం వచ్చేది కాదు

అదుంటే అన్నీ వున్నట్లేనా?

నాలాంటి దిక్కులేని వాళ్ళకు అంతే

అయితే అది నీకు నేనిస్తాను

మీరు మీరు ఏమిటి అంటున్నారు? బయంగా చూసింది

నిన్ను పెండ్లి చేసుకుంటానంటున్నాను అర్థం కాలేదా?

నాకు నాకు ఆ వుద్దేశ్యం లేదండి బెదిరిన లేడిపిల్లలా చూసింది

నీకుందని అనడం లేదు నాకుందని చెబుతున్నాను

కాని

దేవకి అతడలా అనగానే ఆశ్చర్యంగా చూసింది దేవకి

నా పేరు మీకెలా తెలుసు?

అతడు మెల్లగా నవ్వాడు

ఈ ద్రాక్షతోట మాదే దీన్ని చూసేందుకు వచ్చినప్పుడు రెండు మూడు సార్లు నిన్ను చూశాను ఈ తోటలో పని చేసే అప్పన్న నీ గురించి చెప్పాడు

మీరు ఆనందరావుగారా ఆ తోట యజమాని అనగానే ఆమెకు తెలిసి పోయింది

ఆనందరావు లాయరని హైద్రాబాదులో వుంటున్నాడని ఆ ఊర్లో వాళ్ళందరికీ తెలుసు

అప్పుడప్పుడు వచ్చి అతడు పొలాలు తోట చూసుకుంటుంటాడు

నేనెవరో తెలిసిందిగా చెప్పు నీ అబిప్రాయ మేమిటి' అన్నాడు ఆనందరావు

ఏం చెప్పమంటారు? పిలిచి దేవుడు వరమిస్తానన్నా అందుకోలేని దురదృష్టవంతురాలిని మళ్ళీ పెండ్లి చేసుకోడం మహాపాపం అనిపిస్తోంది నాకు

ఆహా పరిహాసింపుగా అన్నాడు

ఆత్మహత్య పాపంకాదు మళ్ళీ పెండ్లి చేసుకోడం పాపం

దేవకి తలొంచుకుంది

దేవకి అర్థంలేని ఆచారాలకు జీవితాన్ని బలి పెట్టకు

ఆచారాలు కాకున్నా నాకోసం మీరు నవ్వులపాలు కావడం నాకిష్టం లేదు




"దేవకీ...." ఆమెకు దగ్గరగా జరిగాడు.

"నేను నిన్ను వుద్ధరించాలన్న వుద్దేశ్యంతో చేసుకుంటాననడం లేదు. నా జీవితంలో వెలితి నన్ను పెళ్ళికి ప్రోత్సహిస్తోంది. నేను భార్యాపిల్లలున్నవాడ్ని. మళ్ళీ పెండ్లి చేసుకోవాలను కున్నప్పుడు జీవితం చితికిన నీలాంటి అమ్మాయిని చేసుకోడం న్యాయం

దిగ్గున తలెత్తింది దేవకి

బార్యాపిల్లలుండీ ఇలా

తప్పేకావచ్చు దేవకి కాని నేను బ్రతికే బ్రతుకు యాంత్రికమైనది నేను కోరుకున్న జీవితం కావాలంటే ఆప్యాయత కురిపించే బార్య కావాలి నా బార్య నాకన్నా దనవంతుడి కూతురు అహం జీర్ణించుకున్న మనిషి ఆమె నుండి ఆత్మీయత ఆశించడం అందని ఆకసాన్ని ఆశించడమే ఆమెతో గడిపే జీవితం ఏదో నాటకంలో పాత్ర దరిస్తున్నట్లుందే తప్ప ఆనందం తృప్తి శూన్యం అందుకే నిన్ను చేసుకోవాలను కున్నాను ఈ విషయం ఆమెకూ తెలుపుతాను

ఆమె ఒప్పుకోకపోతే

పేలవంగా నవ్వాడు ఆనందరావు

నీకా బయం అక్కర్లేదు ఆమె దీన్ని గురించి ఆలోచిస్తుందని నేననుకోను నిన్ను చేసుకోడం వల్ల మా జీవితాలలో పెద్ద మార్పేమి వుండదు

దేవకి ఏం మాట్లాడలేక పోతోంది

అతడి మాటలు ఆమెకు ఆశ రేపుతున్నాయి

తనకంటూ సంసారం ఏర్పడే అవకాశాన్ని పోగొట్టుకుంటే తను నరక జీవితంలోకి అడుగు పెట్టాల్సిందే మరణానిక అతడు తనను దూరం చేశాడు స్వర్గంలోకి రమ్మంటున్నాడు

ఆమెలో ఆశాలత అతడి బార్య గురించి ఆలోచించనివ్వడం లేదు

దేవకి నువ్వేం ఆలోచించకు పెండ్లి చేసుకొనే లక్ష్మిక చెబుతాను ఆమె వల్ల మనకేబాద వుండదు మళ్ళీ పెండ్లి చేసుకోడం పాపం అయితే ఆ పాపం ఇద్దరం చేస్తున్నాము చనిపోయాక ఇద్దరం నరకానిక వెళతాము మనకిక ఎడబాటే వుండదు అప్పుడే ఆమెను కారులో విజయవాడకు తీసుకొచ్చాడు

కనకదుర్గ ముందు నుదుట తిలకం దిద్దాడు తాళి కట్టాడు

వారం రోజులు హోటల్లో గడిపాక తను కొత్తగా పొలం కొన్న ఎరిపురంలో ఇల్లు గూడా కొని ఆమెను తీసుకెళ్ళాడు

* * *

తను దేవకిని పెండ్లి చేసుకున్న విషయం దాచి పెట్టి వుంచాలనుకోలేదు ఆనందరావు

తను తప్పు చెయ్యలేదు అసంతృప్తిని బరించలేకపోతున్నాడు అబిమానించే ఇల్లాలు కావాలనుకున్నాడు

అతడు అనుకున్నట్లుగానే అతడి పెండ్లి వార్త విని లక్ష్మి ఏడుపు పెడబొబ్బలు మొదలు పెట్టలేదు ఆమె స్వభావానికి అవి విరుద్ధం.

ఆమె చూసిన చూపులే ఆశ్చర్యాన్ని వ్యక్తం చేశాయి. ఆ తర్వాత... కండ్లలో చిందిన నీళ్ళు బాధకు సంకేతాలయ్యాయి.

"నీకు అన్యాయం చెయ్యాలన్న తలంపు లేదు. నేను కోరుకున్న జీవితం గడపాలనుకున్నాను. నా కిప్పటి జీవితంలో తృప్తి లేదని నీకు తెలుసు. దేవకి భర్తృహీన. ఆమె జీవితానికి వెలుగు నిచ్చినట్లుంటుందనుకున్నాను:.."

అతడి మాటలు వింటూ మౌనంగా వుంది లక్ష్మి.

తన ప్రవర్తన అతడ్ని తనకు దూరమయ్యేలా చేస్తుందనుకోలేదు. అతడు తనను వడ్డించమంటాడు. పిల్లల్ని ఆయాకు అప్పచెప్ప వద్దంటాడు. అతడి పనులు స్వయంగా తనను చెయ్యమని చాలా సార్లు కోరాడు. అవన్నీ గొప్పింటి అమ్మాయి చెయ్యవలసిన పనులు కావనుకుంది తను.

స్నేహితులతో తిరగడం క్లబ్బులకు వెళ్ళడంతో కాలక్షేపం చేస్తూ ఇదే జీవితం అనుకుంది. భర్తతో సినిమాలకు వెళ్ళడం పార్టీలకు వెళ్ళడం నాగరికత అనుకుందే గాని ఆత్మీయత పంచలేకపోయింది. తను ధనవంతుల అమ్మాయి నన్న భావం తనను గంభీరంగా వుంచిందేమో అతడికి ఆనందాన్నివ్వలేకపోయింది.

ఇప్పుడేడబ్బు తన భర్తను తనకే వుంచగలుగుతుంది?

కోరి పెండ్లి చేసుకున్న అతడు ఆమెను వదులుకుంటాడా?

అతడు మళ్లీ పెండ్లి చేసుకున్నది తనివ్వలేని ఆనందాన్ని అందుకోవాలని  మనసులో అలజడి ముఖం మీద కనిపిస్తోంది కండ్ల నుండి నీళ్ళు కారుతునే వున్నాయి

చేతిలో పండు జారిపోయినట్లుగా అనిపిస్తోంది ఆనందరావు ఆమె వైపు చూడలేక పోతున్నాడు

లక్ష్మి తనలో తను బాధ పడుతోందే గాని పరుషంగా తన నొక్క మాట గూడా అనడం లేదు ఆ సమయంలో గూడా ఆమె గంభీరత చెక్కుచెదరక పోవడం ఆశ్చర్యంగా వుంది

లక్ష్మి నా సౌఖ్యం నేను చూసుకొని బాధ్యతలను మరిచి పోతాననుకోకు మాటలు అతికష్టం మీద పెగిలాయి

నిర్జీవంగా నవ్వింది లక్ష్మి

మీరు బాధ్యతలను కాదంటారని నేననుకోడం లేదు మీకు కావల్సింది మీరు నిర్భయంగా అందుకున్నారు దాపరికం లేకుండా చెప్పారు కాని  అర్థింపుగా చూసింది అతడి వైపు

ఆమెను మీరి ఇంటికి తేకండి అలా జరిగితే నా గుండెలో జ్వాల రగిలి అది నన్ను దహించి వేస్తుంది

లక్ష్మి  బాదగా చూశాడు

అరుపులు హడావుడి చేస్తే గొంతు కలపొచ్చు కాని ఇలా సుతి మెత్తని మాటలతో మనసును పిండేస్తోంది లక్ష్మి

నేను చేసింది తప్పే

వద్దండి ఇంకా ఏదో చెప్పి నన్ను బాదించవద్దు నా వల్ల మీకు కావల్సిన సుఖసంతోషం లేవు మీరు మరో వ్యక్తిని చూసుకున్నారు మీరు తప్పు చేశారనడం లేదు నేను  నేనేం తప్పు చేశానో తెలుసుకుంటున్నాను  అని అక్కడ నిలవలేనిదానిలా వెళ్లిపోయింది

లక్ష్మిలో ఏ మార్పైతే రావాలని ఆనందరావు అనుకొనేవాడో అది ఆ రోజు నుండే వచ్చింది

ఆ రాత్రి వంటమనిషిని పదార్థాలన్ని టేబుల్ మీద పెట్టి వెళ్లిపొమ్మన్నది తనే వడ్డిస్తోంది

కూతురు రాణి వింతగా చూసింది

మమ్మి నువ్వు పెడుతున్నా వేమిటి?

చిన్నగా నవ్వింది లక్ష్మి

చేతులు కాలాయమ్మా బ్రతుకు కాలకుండా వుండాలని

లక్ష్మి  ఆవేదనగా అన్నాడు ఆనందరావు అయిదేళ్ల పసికందు రాణికి అర్థంకాలేదు కాని అతడు ఆమె మాటల్లో బాదను చూడలేనివాడు కాదు

ఏమిటా మాటలు? మందలింపుగా అన్నాడు

ఔనండి బ్రతుకు కాలగూడదనే ఈ తాపత్రయం నేను మీకిష్టమైన విదంగా నడుచుకో లేకపోయాను దాని పలితమే మీ జీవితంలో మరొకరి రాక  ఈ నిజం లోకానికి తెలిస్తే నన్ను ఈసడిస్తుంది మీరేదో కాని పని చేసినట్లు మాట్లాడి మిమ్మల్ని వేదిస్తుంది అందుకే  దేవకికి మీరు కొత్త జీవితాన్ని ఇచ్చేందుకే పెండ్లి చేసుకున్నారని ఈ లోకానికి చెబుతాను

లక్ష్మి  ఆమెలా తను ఆలోచించలేదు తనవరకే తను ఆలోచించాడు నిర్ణయం తీసుకున్నాడు

ఏమిటి బాదపడుతున్నారా? దగ్గరకు వచ్చింది లక్ష్మి

ఎందుకండీ బాదపడడం? నా అహంతో మీరు బాదపడుతూ కూర్చోక మళ్లీ పెళ్లి చేసుకున్నారు అది రహస్యంగా వుంచాలనుకోలేదు నాకు చెప్పారు ఇంత నిర్మల మూర్తికి భార్యనైనందుకు నేను గర్వపడుతున్నాను కష్టంలో గూడా సుఖం వెతుక్కోడమంటే ఇలాగే వుంటుందేమో

లక్ష్మి మాట్లాడిన ప్రతి మాటా దెబ్బకొట్టి చెబుతాడు ఆనందరావు

ఆమెలో మార్పు తనను బాదపెడుతోందని కూడా అన్నాడు

నేను పిల్లల్ని, తనను కాదంటాననుకున్నదేమో!

కాదు భర్త నీడ లేనిదే ఎవరూ గౌరవంగా చూడరన్న భయం భర్త మరో





నిర్మాత: డి.రామానాయుడు దర్శకత్వం: బి.గోపాల్




మన సంస్కృత వాఙ్మయంలో రామాయణ భారతాలు అతి ప్రాచీనాలు వాటి తరువాత వచ్చిన పురాణాదులలో పయి రామాయణ భారతాలలోని కథలు విభిన్న రీతులలో కానవస్తాయి రామాయణం సంగతి చూచుకొందాం వాల్మీకి మహర్షి రచనయే కాక ఆధ్యాత్మ రామాయణం, ఆనంద రామాయణం వంటివెన్నో వచ్చాయి ఒక దానిలో ఉన్న గాథ మరొక దానిలో వేరే విధంగా కానవస్తుంది అలాగే పురాణాలలో కూడా - ఒక పురాణంలో చెప్పిన గాథ మరొక పురాణంలోవేరే రీతిగా ఉంటుంది చదివే వారికి, వినేవారికీ వీటిలో ఏది సత్యమైనది! దేనిని ప్రమాణంగా తీసుకోవాలి! అనే సందేహం కలగక మానదు దీన్నిబట్టి పవిత్రాలయిన ఆ గ్రంధాలపయి అవిశ్వాసం కూడా కలగవచ్చు

ఇలా మార్పులు కలగడానికి కారణం లేకపోలేదు ఏదయినా సంఘటన 'జరిగినప్పుడు, దానిని చూచేవారు అక్కడ చాలామంది వుండవచ్చును వారు, ఇతరులకు దానిని గురించి చెప్పినప్పుడు ఒకరు చెప్పినదానికి, మరొకరు చెప్పినదానికి, కొంత తేడా ఉండడం పరిపాటి చెప్పేవారు కొందరు కొన్ని విషయాలను జోడించిగాని విడిచిపెట్టి గాని చెప్పడం పరిపాటి ఇట్టి పరిస్థితిలో - యుగయుగాల క్రితం జరిగిన వాటిని చెప్పినప్పుడు ఆ చెప్పిన గాథలో వ్యత్యాసం ఉండడంలో వింతలేదు విరుద్ధవిషయాలు కూడా ఉండవచ్చును

పౌరాణికులు పురాణాలు చెప్పేటప్పుడు జనాన్ని ఆకర్షించడం కోసం తమ బుద్ధిని ఉపయోగించి కొత్త అంశాలను చేర్చి చెప్తూ ఉండడం పరిపాటి వీటిలో సామాన్య కుటుంబాల్లో జరిగే కలహాలు అధిక్షేపణలు, స్వల్పవిషయాలు కూడా చోటు చేసుకుంటాయి

మనం ఇలాటి గ్రంధాలను చూచేటప్పుడు, వాటికి సంబంధించిన యితర గ్రంథాలతో పోలిక తేకూడదు ప్రతీ పుస్తకం యితర గ్రంథాలతో ప్రమేయం లేని ప్రత్యేక రచనగా పరిగణించాలి అందులోని సంఘటనలకు ప్రాదాన్యం యివ్వకూడదు వాటి వల్ల గ్రహింపదగిన మంచినే గ్రహించాలి అనుచితాలూ, ధర్మ విరుద్ధాలూ అయిన విషయాలను విడచిపెట్టాలి ఆ రచనలయెడల నిరసన భావం చూపకూడదు ఇట్టి దృష్టితో చూస్తే ఆ గ్రంధాల విభిన్నత్వంలో ఏకత్వమే గోచరిస్తుంది

**–బులుసు వేంకట రమణయ్యా**

## మనసుకు సంకెళ్ళు

పెండ్లి చేసుకున్నాడంటే తన స్థానం తప్పుందని అందరూ అనుమానించి అవమానిస్తారన్న అనుమానం ఆమెలో మార్పు తెచ్చాయి ఆమెలో ఆ మార్పే రాకపోతే మిరిలా శాంతంగా వుండేవారు కాదు ఆమె వ్యక్తిత్వం మహోన్నతమైనది దేవకి ఆమె గురించి విన్నప్పుడల్లా తను తప్పు చేశానని బాదపడుతోంది

లక్ష్మి భర్త పనులే కాదు పిల్లల పనులు కూడా స్వయంగా చేస్తోందిప్పుడు ఆయాను మానిపించింది

మొదట సంవత్సరంన్నర కొడుకు వినోద్‌ను ఎత్తుకోవాలన్నా వాడి పనులు చెయ్యాలన్నా కష్టమనిపించేది రెండు మూడు రోజులకు అలవాటుపడ్డది

భర్త మళ్ళీ పెండ్లి చేసుకున్నాడని తనే బంధుమిత్రులకు చెప్పింది

మనమే చెబితే వాళ్ళు మన గురించి చెడుగా అనుకునే అవకాశం వుండదు ఎప్పుడో ఎవరో తెలుసుకుని చెప్పడం ఎందుకు? అంది భర్తతో

నీవెలా ఒప్పుకున్నావు? భర్త పెండ్లి గురించి చెప్పే ఆమెను అందరూ ఆశ్చర్యంగా అడిగారు

చావబోతున్న ఆమెను రక్షించేందుకు అంతకన్నా మార్గంలేనప్పుడు ఏం చేస్తారు? ఆదర్శం మాటల్లోకాకుండా చేతల్లో చూపించారు నిర్భయంగా చెప్పారు ఆమెను ఆత్మహత్యా ప్రయత్నం నుండి రక్షించి తీసుకొచ్చి పెండ్లి చేసుకోమంటే చేసుకొనే వారెవరున్నారు? ఆమెను కాపాడాలన్న ఆత్రంతో తప్పు మరో వుద్దేశ్యంతో చేసుకోని అతడ్ని నేనేం అనగలను? ఆమెకు జీవితాన్నిచ్చారు దానివల్ల నాకన్యాయం జరగడంలేదు తనకు బాదే లేదన్నట్లుగా మాట్లాడుతుంది లక్ష్మి

ఇంత మంచితనం ఎక్కడుంది ఇన్నాళ్ళు? ఆమె మాటలు ఆనందరావును పశ్చాత్తాప్పడేటట్లు చేస్తున్నాయి

ఆమె సొమ్మును అన్యాయంగా అనుభవిస్తున్నాను దేవకి బాదగా అంది

కాదు దేవకి నువ్వు అనుభవించేందుకు వచ్చినప్పుడే ఆమె తన సొమ్ము విలువ తెలుసుకుంది ఓదార్పుగా అన్నాడు ఆనందరావు

కాని దేవకికి ఆ మాటలు పూరట కలిగించలేదు

తను అన్యాయమే చేశాననుకుంటోంది

తన జీవితంలో వసంతం ఆమె బ్రతుకులో బాదను కురిపిస్తోంది

ఆనందరావు ఆదివారాలు కొర్టుకు సెలవులున్నప్పుడు కొద్ది రోజులు దేవకి దగ్గర గడుపుతున్నాడు

(ఇంకాఉంది)

# పుప్పిపళ్లను ఎదుర్కోడానికి ఒక సూపర్ ఫైటర్ వుంటేనే సాధ్యం.

ఒకరోజు మా అబ్బాయి పరుగెట్టుకొంటూ ఇంటికొచ్చాడు...







పళ్లు ఎలా నిరంతరం దెబ్బలకుగురి అవుతూంటాయో...






...ఫోర్‌హాన్స్ ఫ్లోరైడ్ అతడి పళ్లను రక్షించడానికి ఎలా పని చేస్తుందోనని విడమర్చి చెప్పా.










ఫోర్‌హాన్స్ ఫ్లోరైడ్ ప్రసిద్ధ ఫోర్‌హాన్స్ రక్షణ అందిస్తుంది.




**ఫోర్‌హాన్స్ ఫ్లోరైడ్ చిగుళ్లను బిగిస్తుంది. పుప్పిపళ్లను ఎదుర్కొంటుంది.**

# శిల్పకళా పెన్నిధి సత్యవోలు రామలింగేశ్వరాలయం



కామరూపియైన
నందీశ్వరుడు పరమేశ్వరునకు
గంగాభిషేకము చేయుట

రాయలసీమలో గిద్దలూరుకు తూర్పున 5 కి. మి దూరంలో రంగారెడ్డిపల్లె అనే చిన్న గ్రామముంది దానికి ఉత్తరంగా 2 కి మి దూరంలో సత్యవోలు అనే గ్రామంలో నాగర ద్రావిడ సమన్వయ శిల్ప వైవిధ్యంతో అలరారే చాళుక్య కాలీన రామలింగేశ్వరాలయం ఉంది ఈ కోవెల వేసర వాస్తు శైలి ననుసరించి నిర్మింపబడింది సత్యవోలు గ్రామాన్ని సత్యవేలు సత్యవోలు అనికూడ అంటారు

## స్థలపురాణం

వనవాస సమయంలో పాండవులు నల్లమల అడవులలో సంచరిస్తుండగ ధర్మరాజు యిక్కడ శంకరుని ప్రతిష్టింప తలచి శివలింగం తెచ్చుటకు భీమసేనుని పంపాడు కాని భీముడు లింగం తీసుకురావటం కొంచెం ఆలస్యమయ్యేసరికి, నిర్ణయించిన ముహూర్తానికి ధర్మరాజు యిసుకతో లింగం చేసి ప్రతిష్ఠించాడని స్థానికులు చెప్తుంటారు. ఆ లింగంపై నిర్మింపబడిన ఆలయమే రామలింగేశ్వరాలయం తర్వాత భీముడు తెచ్చిన శివలింగం ఈ ఆలయానికి ఉత్తరంగ ప్రతిష్ఠించారు దానిపై నిర్మితమయిన ఆలయం భీమేశ్వరాలయంగ ఖ్యాతి గాంచింది 20 సంవత్సరాలనాడు ఇసుక లింగాన్ని దొంగలు నిధుల కోసం ధ్వంసం చేశారు

## ఐతిహాసిక ఆధారాలు

ఆలయ రూపురేఖలు వాస్తు - శిల్పకళా కౌశలాన్ని బట్టి ఇది క్రీ శ 7వ శతాబ్దిలో నిర్మింపబడినట్లు తెలుస్తుంది దీనిని బాదామి చాళుక్యులుగ ప్రసిద్ధి చెందిన పశ్చిమ చాళుక్యులు నిర్మించారు ఒకే ఆవరణలో పై రెండు ఆలయాలతో పాటు మరి నాలుగు శివాలయాలు నిర్మించబడ్డాయి వీనిలో కొన్ని, దేవాలయాల నమూనాలు

క్రీ శ ఆరవ శతాబ్దం నుండి, ఎనిమిదవ శతాబ్దం వరకు, దక్షిణాపథ చరిత్రలో పశ్చిమ చాళుక్యులు ప్రముఖ పాత్ర వహించారు వీరు బాదామిని రాజధానిగ చేసుకొని జైత్రయాత్రలు సాగించిన కారణాన 'బాదామి చాళుక్యులు గ పశ్చిమం నుండి వచ్చారు కనుక పశ్చిమ చాళుక్యులు గ ఎలువ బడ్డారు

పశ్చిమ చాళుక్యుల కాలంలో శిల్పకళ ఉదియమానంగ ప్రోత్సహింపబడింది ఆ సమయంలో నాగర ద్రావిడ శైలుల సమ్మేళనం జరిగి 'వేసర వాస్తు శైలి గా ప్రసిద్ధిచెందింది పెర్గూసన్ అనే విద్వాంసుడు వీరి శిల్పకళా వైవిధ్యానికి ముగ్ధుడై చాళుక్య శిల్ప శైలి అని నామకరణం చేశాడు

నృత్యభంగిమ (లాస్యం)



మాయా శిల్పం (విచిత్ర శిల్పం)



కర్ణాటక రాష్ట్రంలో బాదామి పట్టడకల్ ఐహోలి ఆలయాలు మన రాష్ట్రంలో సత్యవోలు అలంపూర్ మహానంది ఆలయాలు చాళుక్యుల శిల్పకళా వైభవాన్ని చాటి చెపుతున్నాయి



రామలింగేశ్వరాలయం (వెనుక వైపు భీమేశ్వరాలయం కూడా చూడవచ్చు.)

## వాస్తు - శిల్పకళా వైభవం

ప్రధానమైన రామలింగేశ్వరాలయం గర్భగృహం మీద నాగర శైలిలో నిర్మించబడిన ద్వితల విమానం ఉంది గోపురం మీద ఐదు నాసికలు మల్చబడ్డాయి శిఖరం ముందు భాగాన నటరాజ విగ్రహం దర్శనమిస్తుంది ఆలయం చుట్టూ శివలింగం కలిగిన రాతి చెక్కడాలు కన్పిస్తాయి ఇక్కడ ఆలయాల శిఖరాలన్నీ ఉసిరికాయ ఆకృతిలో నిర్మించబడ్డాయి కనుక వీటిని అమలక శిఖరాలు అంటారు

కళాకారుని మానసముద్ర చేతికరూపంలోకి రూపాంతరం చెందటం కళ ఇది స్థూలంగ రెండు విధాలు అందు మొదటిది రసాత్మకం లలితకళలు ఈ వర్గంలోకి వస్తాయి రెండవది ఉపయోగాత్మకం దాదాపు చేతివృత్తులను దీని క్రిందకు పరిగణించవచ్చు అయితే సామాజిక జీవనం రసాత్మకంగ ప్రతిబింబించినపుడే లలిత కళలకు సార్థకత ఉంటుంది సృష్టికి ప్రతి సృష్టి చేసి శిలలకు ప్రాణం పోసి దృశ్య స్పర్శ రూపములతో సజీవ మూర్తులా! అన్న భ్రమను కలిగించి శాశ్వతంగ నిలిచి ఉండేది రసాత్మక శిల్పకళ అట్టి అద్భుత శిల్పకళా విన్యాసం రామలింగేశ్వరాలయంలో దర్శనమౌతుంది

ఈ మందిరం ముఖ మండపం స్తంభాలపై మల్చబడిన చతుర్ముఖ బ్రహ్మ శివతాండవం కాళీ వరాహ వామన మయూరనాట్యం నాగబంధ నాట్యం పరశురాముడు నందిపై శివ పార్వతులు మొదలయిన దేవతామూర్తుల శిల్పాలు వివిధ పౌరాణిక గాథలను స్ఫురింపచేస్తాయి శివలింగాన్ని అవమానిస్తే శిరస్సు నరికినట్లు మల్చబడిన శిల్పం శివ మహత్యాన్ని, శివభక్తిని చాటి చెప్తుంది పరాశక్తి శిల్పం వివిధ అవతారములలో మల్చబడింది ఇదంతా ఆ కాలం నాటి భక్తి ప్రవృత్తులను వెల్లడిస్తుంది

కామరూపియైన నందీశ్వరుడు పరమేశ్వరునకు గంగాభిషేకం చేసే శిల్పం ఒక అపూర్వ సృష్టి మాతృదేవో భవ' పితృదేవో భవ' అనే ఉపనిషద్వచనం సూచిస్తూ తల్లిదండ్రుల పట్ల భక్తి ప్రవృత్తులను సేవానిరతిని వెల్లడించే శ్రావణ కుమారుడు దర్శనమిస్తాడు ఆనాటి ప్రజల కళాత్మక ఆనందమయ జీవనానికి నృత్యభంగిమ (లాస్యం) మాయాశిల్పం (విచిత్ర శిల్పం) ప్రతీకలుగ కానవస్తాయి ఒకప్పుడు ఇదంతా ఆటవిక ప్రదేశం ధనస్సు ఆధారంతో నిల్చున్న ఆటవిక వనిత కాలిలోని ముల్లుని బాణంతో తీసే దృశ్యం అప్పటి ఆటవిక జీవనానికి యదార్థ ప్రతిబింబం ఈ శిల్పాలన్నింటిలో తాళధ్వని వినిపిస్తుంది

కళ అనేది ఒక వరం అదొక తపస్సు కూడా! కళాకారుడు తన లలిత భావాల్ని కళల ద్వారా వ్యక్తపరుస్తాడు శిల్పి తన భావశిల్పాన్ని కళా కౌశలంతో శిలలలో ప్రతిబింబింప చేసి సజీవ రూప కల్పన చేస్తాడు

సజీవ కళాకృతులతో వెలుగొందే ఈ ఆలయాన్ని 1300 సంవత్సరముల నాడు నిర్మించిన చాళుక్యులు సర్వదా వంద్యులు కాని ఈ కోవెల ప్రస్తుతం అక్కడక్కడ బీటలువారి ఉంది గిద్దలూరు పెద్దలు అధినేతలు ఈ ఆలయ పునర్నిర్మాణానికి తగిన శ్రద్ధ తీసుకుంటే కలకాలం మన సంస్కృతిని, కళను విశ్వానికి చాటి చెప్పగల అపూర్వ దేవాలయాన్ని కాపాడినవారవుతారు

ఫోటోలు, వ్యాసం

— కొప్పెన్ షేక్ మౌలాలీ

బాణంతో కాలి ముల్లు తీయుట



మాతాపితలని సేవిస్తున్న శ్రావణ కుమారుడు



## భర్త స్నానం – భార్య విడాకులు!

అమెరికాకు చెందిన ఫ్లోరిడాలో జాన్సన్ లాడ్స్ అనే వొకమ్మాయి తన భర్త హెరాల్డ్ నుంచి విడాకులు కోరుతూ కోర్టుకు వెళ్ళి తన నాతడు పెరట్లోని స్విమ్మింగ్‌పూల్‌లో నగ్నంగా స్నానం చేయమని సన్‌బాత్ చేయమని గోల చేసేవాడని కారణం చెప్పిందట అదేగాక తన భర్త ఆర్థిక యిబ్బందులలో వున్నాడని పక్కింటి ధనికుడు తనని నగ్నంగా చూసి గుటకలు వేస్తే ఆనక ఆతని వద్ద డబ్బు అప్పుగానైనా లాగచ్చునని ఎత్తు వేశాడని ఆమె తన భర్త మీద నేరం ఆరోపించిందట

## భార్య వదిలేసిన భర్త ఆత్మహత్య!

ఢిల్లీ బాదన్‌పురకు చెందిన 30 ఏళ్ళ నిహాల్‌చంద్ అనే వో లారీ డ్రయివరు అలనాటి దేవదాసు హడలిపోయేలా త్రాగ నారంభించేసరికి ఆతని భార్య రక్కున అతణ్ని వొదిలి వెళ్ళిపోయిందట ఈ బాధ భరించలేక ఈ నిహాల్ చంద్ పురిపోసుకు చనిపోయాడట

## ముద్దుల వేడుకలో ఊడిన ఉద్యోగం!

వెస్ట్ జర్మనిలోని కోలన్‌లోని స్త్రీల ఫుట్‌బాల్ ఆటల పోటీలలో ఎంపయిర్ జోసప్ బాదర్ ఒక పెనాల్టిని ఓ టీముకు యిచ్చేసరికి ఆ టీము కెప్టెను 17 ఏళ్ళ సుందరవదన సుందరాంగి తెనిరిస్ ఆనందంతో ఎగిరి ఆ బాదర్ని ముప్పనో యిట్టుకుందట దాంతో ఆయన ఇస్సై మరో అయిదు పెనాల్టులు యిచ్చి విరసి ఆరు ముద్దులు పొందాడట ఆతని వుద్యోగం ఆనాటితో వూడపోయినా పోతే పోయింది ముండావుజోగం ఇంత చక్కని ఎల్లతో యింత తీయటి ముద్దుల అనుభవం ఎన్ని జన్మలెత్తితే వొస్తుంది అన్నాడట– అమ్మ వీడ ముఖం మండా!

## భార్య కోరికలు– భర్త విడాకులు!

ఎన్లండ్‌కు చెందిన నిల్సనులెవ్ అనే వో వ్యాపారి తనకన్నా 25 ఏళ్ళు చిన్నదైన చిన్నారిని ప్రేమించి ప్రేమింప చేసుకుని ఆనక పెళ్ళాడితే శోభనం నాటి రాత్రి ఆమె అతని షాపులోని వో ఖరీదయిన పర్‌కోటు కోరిందట ఆనకామె అతని కామోద్రేకాన్ని తర్చే సమయంలో ఆ షాపులోని వస్తువులు ఒక్కోటి కోరేదట నిషా దిగిన ఆ నిల్స్ భార్యంటే బేజారైపోయి కోర్టుకు విడాకులకు వెళ్తే జడ్జిగారు విడాకులు యిచ్చి ఆ వస్తువులు తిరిగి యిప్పించే శక్తి కోర్టుకు లేదని చెప్తూ ఏక శయ్యమీద కామాతురతతో చేసుకునే వొప్పందాలు యిచ్చి పుచ్చుకోడాలూ కేవలం వారి వారి సొంత విషయాలు అన్నారట– హర్ని!



## ప్రభుత్వ గిడ్డంగులపై అధికారుల తనిఖీ!

ఢిల్లీ మయొరాకు చెందిన ప్రభుత్వ ఫుడ్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా గిడ్డంగుల మీద తూనికలు కొలతల అధికారులు తనిఖీకి ఎరుచుకుపడి ప్రతి బస్తా గోదుమలోనూ 2 25 కిలోలు తూకం తక్కువ వస్తున్నట్లు నమోదు చేసుకున్నారట

## గ్లూకోజులో కాలుష్యం!

ఢిల్లీ డాక్టర్ కపూర్ ఆసుపత్రిలో మణి ఆనే వో చిన్నపిల్లని మెనింగిటస్ అనే వ్యాధి అని అనుమానంతో చేర్చి ఆ పిల్లకు గ్లూకోజు ఎక్కిస్తున్నారట గ్లూకోజు సగం ఎక్కాక ఆ పిల్ల పరిస్థితి మరింత అధ్వాన్నంగా వుండేసరికి అనుమానంతో డాక్టరు ఆ గ్లూకోజు సీసాను తయించారట తేరబారి చూస్తే అందులో ఫంగస్ (నాచు పంటిది) వున్నదట– ప్రాణం కాపాడాల్సిన మందులలోనే కాలుష్యం వుంటే యిహనేం జేయాలి! ఆసుపత్రిలోని నర్సులూ డాక్టర్లు ఆ మాత్రమైనా చూడకుండా అలాటి మందు లివ్వడం నో కామెంట్స్

## గుర్తుతెలియని యువతి శవం!

ఢిల్లీ విమానాశ్రయ ప్రాంతంలోని కపషెడ గ్రామ శివార్లలో ఓ యిరవైయ్యేళ్ళ అమ్మాయి శవం గురువారం (6వ తేది) రాత్రి పోలీసులకు దొరికిందట శవాన్ని గుర్తు పట్టడానిక్కూడా వల్లేకుండా ఆమె ముఖం రాళ్ళతో కొట్టి చితు చేసేశారట హంతకుడు– లేక – హంతకులు

## మోటారు సైకిల్‌పై నగ్న జంట!

కాలిఫోర్నియాలో మెకెల్ డి ఓరియన్ అనే పోలీసు గస్తు కాస్తుండగా తెలవారు ఝామున నాలుగ్గంటలకు వో మోటారు సైకలుమీద వో జంట నగ్నంగా కనుపించారట ఆపి ప్రశ్నిస్తే అది తమ ఆరో సంవత్సరపు వివాహదినమని సరదాకి అలా నగ్నంగా తిరగాలని కోర్కె కలిగిందని ఆ జంట అన్నారట ఆ విషయంలో కేసు పెట్టనని మాట యిచ్చిన ఆ పోలీసు పెద్ద మనిషి లైసెన్సు లేకుండా మోటారు సైకలు తోలాడన్న నేరం బనాయించాడట

## ఆరోగ్యానికి యాపిల్ పండు!

ఇటలీలోని వైద్య విజ్ఞానులు ఏపిల్ పండుమీద పరిశోధనలు సలిపి అమోఘమయిన విషయాలు కనిపెట్టారట ఈ పండులో ఇనుము, రాగి మాంగనీసు కాల్షియము పాస్ఫరస వంటి ఖనిజాలు వుండడమే గాక పెక్టిన్ అనే మరో ఖనిజం వుంటుందని ఇది శరీరాన్ని విష పదార్థాల నుంచి కాపాడగలదట! బ్లడ్‌ప్రెషర్ తగ్గిస్తుందట రక్త వృద్ధి చేస్తుందట అంతేగాక మరో అద్భుతం వుందట అది– కామోద్రేకాన్ని అభివృద్ధి చేస్తుందట ఏపిలు తిన్న ఏడు నిముషాలలో ఆడగాని మగగాని లైంగికోద్రేకం పొందుతారని డాక్టర్ కార్లో మార్గిరి అన్నారట ఏపిలు కొరకడంతోనే ఒక చక్కని అనుభూతి కలుగుతుందని అది కామాన్ని పెంపొందిస్తుందని కూడా అన్నారట – ఈటె నేపల్ ఎప్రిడే! □



సీరియల్

# చైతన్య స్వరూపం

కంచుమర్తి వెంకటేశ్వర రావు

(గతసంచిక తరువాయి)

కిరణ్ వెళ్ళిన పావు గంటకు ఓ యువకుడు లోపలకు వచ్చాడు

గుడ్ మోర్నింగ్ మేడమ్ ఐదు సంవత్సరాల క్రితం మీ కాలేజి స్టూడెంటును జర్నలిజం చేసి ప్రస్తుతం జర్నలిస్టుగా ఓ పేరు పొందిన పత్రికలో పని చేస్తున్నాను

తనకు తనే పరిచయం చేసుకున్నాడు

మేడమ్ మీతో కొన్ని ముఖ్యమైన విషయాల గురించి డిస్కస్ చేయడానికొచ్చాను పర్మిషను ఇస్తారా

కొంత సేపటి వరకు నేను మాట్లాడలేదు

జర్నలిస్టులంటే నేను ఎంత గౌరవిస్తానో అంతకు మించి భయపడతాను కూడా గోరంతలు కొండంతలుగా చేయడం మీ గొప్పతనం మీరడిగిన ప్రశ్నలకు జవాబులు చెబుతాను గానీ నా అనుమతి లేకుండా పబ్లిసిటీ చేస్తే మాత్రం సహించను

ముందే నా ఉద్దేశ్యం ఖచ్చితంగా చెప్పేసాను

మేడమ్ నేను ముందే చెప్పాను ప్రస్తుతం జర్నలిస్టును అయితే ఒకప్పుడు మీ స్టూడెంటును ఆ గౌరవంతో నే మాట ఇస్తున్నాను మిమ్మల్ని నా రాతల ద్వారా కించపరచనని ఆశయాలను ఆచరించే గొప్ప వ్యక్తుల నుండి వారి పట్టుదల కార్యదీక్ష సహనం నేర్పు ఓర్పులను తెలుసుకోవాలనే కుతూహలంతో అడగడానికొచ్చాను

అతని మాటలకు అడ్డుపడ్డాను

అంటే నన్నొక గొప్ప వ్యక్తిగా ఊహిస్తున్నారా

ఊహలు వేరు నిజాలు వేరు నిజంలోని మేలిమి వ్యక్తిత్వం గొప్పతనం ఊహలకు రాదు ఊహలో నిజం ఉండొచ్చు గొప్పతనం రావొచ్చు అయితే అవి కల్పితాలు నిజం జీవం కలది అది జీవితంలోంచి ఆవిర్భవిస్తుంది ఆ నిజం మనిషికి ఆయువు పట్టు అది తెలుసుకోవాలనే ఆరాటమే జర్నలిస్టుగా నేను నేర్చుకున్న మొదటి పాఠం నిజాలు గ్రహించడంలోనే జర్నలిస్టు సక్సెస్ అవుతాడు యామై కరెక్ట్

జర్నలిస్టుల కర్తవ్యం గురించి మీకు వేరే చెప్పగల వాడిని కాదు సంఘంలో ఎక్కడ అవకతవకలు జరిగినా అన్యాయాలు జరిగినా ఎక్కడ ఏ రకంగానైనా ఎవరైనా సరే హింసింపబడుతున్నా అక్కడకు వెళ్ళి జరుగుతున్న సంఘటనలను సమస్యలను లోకం దృష్టికి అందుకు సంబంధించిన అధికారుల ఫైళ్ళకు చేరవేస్తుంటాను

జర్నలిస్టుగా అది మీ కర్తవ్యం కానీ నేను ఓ సామాన్య ఆడదాన్ని నా బ్రతుకు నేను బ్రతుకుతున్నాను పదిమందికి తెలియజేయవలసిన ఎంత సంఘటనలు గానీ ఆ పదిమంది చేత సహాయం సానుభూతి మెప్పు పొందడానికి అర్హత గల బాధాకర విషయాలు గానీ నాలో లేవు

చూడండి మేడమ్ ; పువ్వు పరిమళిస్తుంది వెదురు ముక్క రాగాలు తీస్తుంది కోయిల పాడుతుంది నెమలి ఆడుతుంది సెలయేరు గలగలమంటుంది ఇవి ఆశ్చర్యంగా వింతగా అందంగా వాటి కుండవు స్వభావ రీత్యా అవి ఆయా పనులను చేస్తాయి కానీ ఆ పనుల్లోని గొప్పతనాన్ని మనం ఆస్వాదిస్తాం ఆరాధించే మనస త్వం అనుభూతి చెందే మనసు ఉన్నాయి కాబట్టి తదనుగుణంగా మన హృదయాలు స్పందిస్తాయి అలాగే మీరు కూడా బాధలను కష్టాలను కన్నీళ్ళను గుండెలో దాచుకుని నిండు కుండలా తొణకడం లేదు మీకు వింతగా ఉండకపోవచ్చు కాని మిమ్మల్ని చూసి చలించే మనసున్న ప్రతివాడు మీ నుండి జీవితాన్ని చదవడంలో ఎంతో తెలుసుకోవాలనే ఆరాటపడతాడు పువ్వులా వెదురులా కోయిలలా నెమలిలా సెలయేరులా ఎలాగయితే తమ గొప్పతనం తాము తెలుసుకోవో మీరు కూడా మీ గురించి వింతగా తీసుకోవడం లేదు జర్నలిస్టు కళ్ళకు అపూర్వంగా కనిపిస్తుంది

అతని మాటలకు నవ్వుకున్నాను

మేడమ్ ఎన్ని తరాలు మారుతున్నా స్త్రీలో ఇంకా సరియైన మార్పు రాలేదని నేనంటాను అందుకు మీరు ఒప్పుకుంటారా

మార్పు వచ్చింది వంటింటికి వంటింటికి అంకితమయిన ఆ ఆడది ఈ రోజు భర్తలతో సమానంగా చదువుల్లో ఉద్యోగాల్లో రాజకీయాల్లో పోటి పడుతుంది పంతులమ్మ నుండి ప్రధానమంత్రి వరకు స్త్రీ రాణిస్తుంది ఇది మార్పు కాదా

ఈ మార్పుతో నే సరిపోయిందా

మేడమ్ మీరు చెప్పిన మార్పు కొంత వరకూ చెప్పుకో తగ్గదే కాని ఆ మార్పుతో పాటు ఎందరు స్త్రీలు జీవితంలో తమ దగ్గరకు వచ్చేసరికి భర్తలను పరిస్థితులను ఎదిరిస్తున్నారు భర్త మంచి వాడైతే ఆమె జీవితం స్వర్గమే కానీ ఆడది ఎంత చదివినా ఉద్యోగం చేసి సంపాదించినా నా భార్య అనే అహంకారంతో మగవాడు ప్రవర్తించిన తీరుకు ఆ ఆడది అమాయకురాలైతే భర్తతో పాటు అత్తా మామయ్యలు ఆడపడుచులు కూడా వాంఛ పెడుతున్నా ఆడదిగానే ఉండి పోవడానికి ప్రయత్నిస్తుందే తప్ప ఎదురు తిరగలేని పిరికితనంగా మిగిలి పోతుంది ఈ మార్పు అవసరం లేదంటారా!

అప్పుడు నాకు అర్థమైంది

నా గురించి ఇతను చాలా తెలుసుకునే వచ్చాడు

మీరు అన్ని విషయాలూ సేకరించే నా దగ్గరకు వచ్చారు నాకు సంబంధించిన సమాచారం మీకెలా ఎందుకు తెలుసుకున్నారో నేనడగను భర్తను ఎదిరించిన భార్యగా చిత్రించడానికి వచ్చారు మీరు కోరుకునే మార్పుకు నన్నొక ఉదాహరణంగా తీసుకుంటారు అంతేనా అందులో లోకానికి చెప్పే గొప్ప విషయం ఏముంది?

అది మీకు తెలియదు భర్త చెడ్డవాడయితే అతనితో సంబంధం త్రెంచుకోవడంలో విడ్డూరం లేకపోవచ్చు కాని అతని దుర్మార్గాన్ని లోకానికి తెలియజేసి జైలుకు పంపించి ఒక స్త్రీకి పునర్జీవితం ప్రసాదించడంలో చాలా సహకరించారు ఇది గొప్ప కాదా! జీవితాన్ని మీ ఇష్టమైన పద్ధతిలో నడిపించుకోవాలనే ఆశయంతో మీకు నచ్చిన నిర్ణయాలు తీసుకున్నారు లోకం ఎలా అనుకుంటే నాకేం ఎయమన్నట్టుగా మీ ఆలోచనా పద్ధతిలో

---

జరిగిన కథ—9 జైలు నుండి విడుదలై బార్గవ తన తప్పు తెలుసుకొని మనిషిగా మారి భార్యను విడాకులు ఉపసంహరించుకోమంటాడు కాని స్వరూప ఒప్పుకోలేదు భార్గవ స్వరూప ఇంట్లో లేనప్పుడు పాపను తనతో తీసుకు వెళ్ళిపోతాడు స్వరూప కొడుకు కరణ్‌కి తల్లి అంటే ప్రాణం అతను డిగ్రీ పాసై యూనివర్సిటీలో చేరాడు భార్గవ తండ్రి పరాంకుశం కోడలు స్వరూప దగ్గరికి వచ్చి ఆమెను బాబుని తమ ఇంటికి రమ్మని అడుగుతాడు ఆమె మామగారి ఆహ్వానాన్ని తిరస్కరిస్తుంది పరాంకుశం కరణ్‌కి త్రాగుడు అలవాటు చేస్తాడు త్రాగుడే గాక అమ్మాయిలతో షికార్లు కూడా ప్రారంభించాడు కరణ్ కొడుకు చేత ఒక ఫ్యాన్సీ షాపు తెరిపిస్తుంది స్వరూప ఆ ఫ్యాన్సీ షాపులో సేల్స్ గర్ల్‌గా చేరుతుంది గాయత్రి అనే అమ్మాయి ఆ అమ్మాయంటే స్వరూపకి అభిమానం కొడుకు ఒక దారిన పడి నాశనం కాబోతున్నాడని స్వరూప

---

# చైతన్య స్వరూపం

ఎదురు చూస్తున్నారు

జర్నలిస్టుగా నే చెప్పేది మీరు ఆచరించే పద్ధతి మీ ధైర్యం పది మంది స్త్రీలకు మార్గదర్శకంగా ఉందని ఏ కొందరైనా మీ పంథాలో ఆచరించగలరనే నమ్మకం ఆశ నాకుంది అలా జరిగితే మీ విషయంలో కొంత చొరవ తీసుకున్నందుకు నాకు తృప్తి ఉంటుంది అందుకే మీ జీవితంలో ఎదురయిన సంఘటనలను మీ నిర్ణయాలను ఆశయాలను కొన్ని వ్యాసాలుగా రాయాలనుకుంటున్నాను

క్షమించండి మీరు ముందే చెప్పారు నా పర్మిషను లేకుండా పబ్లిష్ చేయరని ప్రస్తుతం ఈ విషయంలో నా అంగీకారం చెప్పలేను నా మీద ఏ మాత్రం గౌరవం ఉన్నా కొన్ని రోజులు ఓపిక పట్టండి

ఓకే మీరు పర్మిషను ఇచ్చినప్పుడే నా పని ప్రారంభిస్తాను జర్నలిస్టుగా కాకుండా ఓ సామాన్య వ్యక్తిగా ఓ ప్రశ్న అడుగుతాను పిల్లలను తల్లి సమాన దృష్టితో చూస్తుంది ఏ ఒక్కరికి బాధ కలిగినా తల్లడిల్లిపోతుంది తల్లి మనసు అటువంటిది మీరు మీ అమ్మాయి మీకు కాకుండా దూరమైనప్పటి నుండి ఇంతవరకు ఎక్కడ ఎలా ఉంది అనే విషయం గురించి మీ రెందుకు ఇంపార్టెన్స్ ఇవ్వలేదు'

నా మనసు గిలగిల కొట్టుకుంది అతని ప్రశ్నకు

అమ్మాయి ఎక్కడుందో ఎలా పెరుగుతుందో నాకు తెలుసు అందుకే నా చిన్నారి పాప గురించి నాకు చింత లేదు

చింత గురించి కాదు నేనడిగింది ఎప్పుడూ మీ పాపను చూడాలనిపించ లేదా

సారీ ఇక్కడితో మీ డిస్కషన్స్ ఆపేస్తే నాకు మనశ్శాంతినిచ్చిన వారవుతారు

ఎప్పుడైతే నేనలా అన్నానో ఆ జర్నలిస్టు మరేం మాట్లాడకుండా వెళ్ళిపోయాడు కృతజ్ఞతలు చెప్పి

* * * * *

బాబు కిరణ్ బుద్ధిగా షాపులోనే ఉండడం తిరుగుళ్ళు దురలవాట్లు తగ్గించడం నాకు రిలీఫ్ నిచ్చాయి బాబు ఓ దారి కొచ్చాడు షాపును బాగా డెవలెప్ చేస్తున్నాడు అద్దెకు తీసుకున్న షాపు పైభాగం క్రింద భాగం కొనేసాడు

మరో రెండు నెలలు మాత్రమే నా జీవితం సాఫీగా నడచింది అక్కడ నుండి మరో మలుపు తిరిగింది

ఒక రోజు

అదే రోజు

నా కొడుకును చంపిన రోజు

నా ఆశయాలు కాటేసిన రోజు

అంతకు ముందు రోజున గాయత్రి నా దగ్గరకు వచ్చింది గాయత్రి చాలా డల్‌గా ఉంది అదే అడిగాను

చాలా సేపటి వరకు గాయత్రి మాట్లాడలేదు

మళ్ళీ అడిగాను

ఆంటీ మీ షాపులో పనిచేయడం మానేస్తాను

ఆశ్చర్యంతో చూసాను

మంచి ఉద్యోగం దొరికిందా

లేదంది

జీతం సరిపోవడం లేదా అదే అయితే కిరణ్‌కు చెబుతాను పెంచమని

అదికాదు ఆంటీ నన్ను నేను రక్షించుకోడానికి మీకు ముందే చెప్పాను నేను మధ్య తరగతికి చెందిన అమ్మాయినని రిటైరయిన నాన్న డబ్బు ఇంటి ఖర్చులకు తమ్ముడు చదువుకు అప్పులకు సరిపోకనే షాపులో పనికి ఒప్పుకున్నాను వేణ్ణీళ్ళకు చన్నీళ్ళు తోడుగా సరిపోతుందని తృప్తి పడ్డాను కానీ నేను అమ్మాయిని అందరి ఆడపిల్లల్లాగే నేనూ జీవితం గురించి ఎన్నో కలలు కన్నాను ఈరోజు కాక పోయినా రేపయినా నా కలలు ఫలిస్తాయనే ఆశతో నే బ్రతుకుతున్నాను కాని నా బ్రతుకులో బురద చిమ్మడానికి నా అందంపై ఉన్న మోహంతో నా జీవితానికే మచ్చ చేయాలని కొందరు ప్రయత్నిస్తున్నారు అలా జరగకుండా నన్ను నేను రక్షించుకోవాలనుకుంటున్నాను

గాయత్రి మాటలు నాకర్థం కాలేదు

ఎందుకంతగా బాధ పడుతుంది?

ఒక వేళ కిరణ్ దురుసుగా ప్రవర్తించాడా?

చూడమ్మా గాయత్రి కిరణ్ చదువుకున్న రోజుల్లో అల్లరిగా తిరిగేవాడు అయితే షాపు పెట్టడం తర్వాత ఓ దారికొచ్చాడు వాడు ఎప్పుడైనా పొరపాటు మాటన్నా దురుసుగా ప్రవర్తించినా సంకోచం లేకుండా నాతో చెప్పు

ఎన్ని సార్లడిగినా గాయత్రి చెప్పలేదు

ఎందుకు వచ్చిందో ఏం చెప్పాలని వచ్చిందో కూడా చెప్పకుండా వెళ్ళిపోయింది

బాబు వచ్చేవరకు వరండాలోనే కూర్చుండిపోయాను రాత్రి తొమ్మిది తర్వాత బాబు స్కూటరును వరండాలోనే ఉంచి లోపలకు వచ్చేడు మమ్మీ ఆకలేస్తుందంటూ

భోజనం వడ్డించాను

గాయత్రి షాపులో పని చేయనని చెప్పింది నిజమేనా? అడిగాను

ఆ ఈడియట్ ఇక్కడ కూడా వచ్చిందా?

ఒళ్ళు మండిపోయింది నాకు

బి కంట్రోల్ ఆఫ్ యువర్ మౌత్ పరాయి ఆడపిల్లను అలా తిట్టడం మర్యాద కాదు అయినా నువ్వెవరి గురించి మాట్లాడుతున్నావో తెలుసా నీలా ఆ అమ్మాయి జులాయిగా తిరగడం లేదు కుటుంబం కోసం ఉద్యోగం చేస్తుంది

మమ్మీ నీ కెపుడూ ఆడపిల్లలంతా ఆణిముత్యాల్లా కనిపిస్తారు అయిందానికి కానిదానికి పొరపాటంతా నాదేనని చెప్పడం నీకు మొదటి నుండి అలవాటయింది

పొరపాటు ఎవరిదో తెలుస్తూనే ఉంది తన కుటుంబం కోసం ఏదో పని చేస్తుంది అటువంటిది అర్ధాంతరంగా మానేస్తుందంటే నువ్వేదో అల్లరిగా ప్రవర్తించి ఉంటావ్

మమ్మీ నేనేం తప్పు చేయలేదు గాయత్రి కష్టమర్స్‌తో పిచ్చి పిచ్చిగా వాగుతుంది మర్యాదగా మాట్లాడడం నేర్చుకోమని వార్నింగిచ్చాను అంతే

గాయత్రి అలాంటిదంటే నేను నమ్మను

చూడు మమ్మీ నువ్వెప్పుడూ నన్ను చులకనగానే చూస్తావు అయినా ఇంత స్త్రీ పక్షపాతం పనికిరాదు

కంచంలో నే చేతులు కడుక్కుని విసురుగా గదిలోకి వెళ్ళిపోయాడు కిరణ్

ఆ మర్నాడు

కాలేజీనుండి ఇంటికి వచ్చాను

వంటయిం తర్వాత పని మనిషి వెళ్ళి పోయింది

రాత్రి తొమ్మిది పైనే అయింది

బాబు రాగానే ఆకలి ఆకలి అంటాడు

ఆకలి అంటాడే గాని వెంటనే భోంచేయడు స్వీట్ హాట్ కావాలంటాడు వాడి కోసం ఆ రోజు ప్రత్యేకంగా గులాబ్‌జాం నేనే చేసాను

ఇంతలో ఫోన్

మాట్లాడుతున్నది ఎవరో తెలియదు

షాపులో ఏదో గొడవ జరుగుతుంది వెంటనే రండని మాత్రం చెప్పాడు

అంతే గబగబ బయలుదేరాను

అప్పటికే చాలా షాపులు మూసేసారు

రోడ్డు మీద రద్దీ కూడా అంతగా లేదు

షాపు బయట మాత్రం తాళం వేసి లేదు లోపల గడియపెట్టాడేమోనని

కాలింగ్ బెల్ కొట్టాను చాలా సేపటివరకు రెస్పాన్స్ రాలేదు

నా మనసు కీడును శంకిస్తోంది

ఒక ప్రక్క బయం

ఇద్దరు వ్యక్తులొచ్చారు

అందులో ఒకతను చెప్పాడు తనే ఫోన్ చేసినట్లు

వాళ్ళు కూడ తలుపులు దబదబమని కొట్టారు

ఇక లాబం లేదని బలవంతంగా తలుపులు పగుల కొట్టారు వాళ్ళను తనతో లో పలకు రావొద్దని చెప్పి నేనే లో పలకు వెళ్ళాను

షాపులో ఎవరూ లేరు

షాపులోంచే డాబా మీదకు మెట్లున్నాయి

డాబామీదున్న గదిలో సామాన్లు స్టాకుంటాయి

అంతే



అక్కడ నాకు కనబడిన దృశ్యం

* * * *

అని ఆగిపోయింది స్వరూప

ఏం జరిగింది చెప్పండి ప్లీజ్!

ఆతృతగా అడిగింది హరిత

చూడమ్మా ఆ సమయంలో నా బాబు కిరణ్ గాయత్రిని మానబంగం చేయడానికి ప్రయత్నిస్తున్నాడు అప్పుడు వాడు నా కొడుకుగా గాక ఓ రాక్షసుడిగా కనిపించాడు ఏ స్త్రీ కూడా హింసింపబడుతుంటే నేను చూస్తూ సహించలేను అంతే ఒళ్ళు తెలియని ఆవేశంతో అక్కడే ఉన్న కత్తితో నా కొడుకును చంపేసాను నా బర్తే దుర్మార్గుడనుకుంటే ఆ రక్తాన్ని పంచుకుని పుట్టిన నా కొడుకు కూడా అదే గుణాన్ని అలవరచుకున్నాడు బర్త కొడుకు మగవాళ్ళు వాళ్ళ బుద్ధే అంత అందమైన ఆడది ఆడుకోడానికి పనికి వచ్చే అందమైన బొమ్మ ఆ రోజుల్లో నా బర్త వలన ఎందరో ఆడపిల్లలు తమ శీలాల్ని పోగొట్టుకున్నారు ఏ ఒక్క సీత జీవితమైన బాగుపెట్టడానికి జైలుకు పంపించాను ఆ తండ్రికి కొడుకుగా కిరణ్ పెరగ కూడదని బర్తను దూరం చేసుకున్నాను కాని తండ్రిని మించిన తనయుడు కిరణ్ ఇటువంటి చీడపురుగులు బ్రతక్కూడదనే నేనే చంపేసాను వీడింకా బ్రతికితే ఇంకా ఎందరి జీవితాలతో ఆడుకుంటాడోననే అనుమానంతో చంపేసాను ఆ రోజు బార్యాబర్తల అనుబంధం దూరం చేసుకుని మొండిగా ఆశయాల పేరుతో జైలుకు పంపాను ఈ రోజు ఆశయాలు కాటేసి నేను నమ్ముకున్న ఆశలే ఎక్కిరిస్తుంటే బండరాయిగా మారిపోయి నా కొడుకును చంపేసాను

వెక్కి వెక్కి ఏడ్చింది స్వరూప

హరిత గుండె బరువయింది

స్వరూపగారూ హత్య చేసానని చెబుతున్నారు అసలు అక్కడ ఏం జరిగింది మీరు వెళ్ళేసరికి ఆ సమయంలో గాయత్రి ఎందుకు ఉంది? అంతకు ముందు రోజే షాపులో పని చేయడం మానేసిందని మీరే చెప్పారు అయితే మర్నాడు రాత్రివేళ గాయత్రి షాపుకు ఎందుకు వచ్చింది ?

# చైతన్య స్వరూపం

హరిత ప్రశ్నలకు జవాబులు చెప్పలేదు స్వరూప

చెప్పండి!

రెట్టించి అడిగింది హరిత

చెప్పాను కదమ్మా  నేనే హత్య చేసానని నీ బలవంతం మీద నా హృదయాన్ని నీ ముందుంచాను  ఈ కదంతా కోర్టుకు తెలియజేసి నాకు ఉరిశిక్ష పడేలా చేయితల్లీ  అంటూ స్వరూప హరిత చేతులను పట్టుకుంది

స్వరూప కన్నీళ్ళు హరిత చేతులను తడిపాయి

హరిత టైము చూసింది

చూదండమ్మా  మళ్ళీ నేను మిమ్మల్ని చూసేది కోర్టులోనే  మీకు శిక్ష పడకుండా చేసే వాదన మీరే వింటారు

అన్చెప్పి జైలు నుండి బయటకు వచ్చింది

హరిత ఆలోచనల్లో ఓ మెరుపు మెరిసింది

★ ★ ★ ★

జైలునుండి ఇంటికెళ్ళకుండా సరాసరి గోపాలరావు అంకుల్ దగ్గరకు వెళ్ళింది  హరితను చూడగానే గోపాలరావు దంపతులు ముచ్చట పడ్డారు సాధారణంగా నెలకో రెండు నెలలకో తప్ప అదీ పిలిస్తేనే వచ్చే హరిత చెప్పా చెయ్యకుండా వచ్చినందుకు మరీ ఆశ్చర్యపోయాడు

హరిత వచ్చిందంటే విశేషమే ఉంటుంది.

టిఫిను పెడుతూ అంది గోపాలరావు భార్య

జైలునుండి సరాసరి వచ్చిందేమో, ఆకలిగా ఉండడంచే వద్దనకుండా టిఫిను తీసుకుని కాఫీ త్రాగింది

అంకుల్  మీతో మాట్లాడాలి అంది

గోపాలరావుకు అర్ధమైంది

ఆఫీసు రూంలోకి రమ్మన్నాడు

నీ పని ఎంతవరకు వచ్చింది

ఆమె గురించి అంతా తెలుసుకున్నాను  అయితే హత్య జరిగిన సంఘటనను ఆ వివరాలను పూర్తిగా చెప్పలేదు  నేను హత్య చేసానని మాత్రం చెప్పింది  ఇది పాత మాటే  నా కెందుకో అనుమానంగా ఉంది  ఎవరో చేసిన హత్యను తనమీద వేసుకుందని

గోపాలరావు ఆలోచనల్లో పడ్డాడు

చూడు హరితా  ఏ వ్యక్తి కూడా హత్య చేసినా చేయలేదనే చెబుతాడు ఎందుకంటే భయం  చిన్న దొంగతనం చేసి పట్టుపడితే శిక్షనుండి తప్పించుకోడానికి మాచే తన్నులు తినేవరకు నిజం చెప్పడు  అటువంటిది స్వరూపగారు తనే హత్య చేసానని చెబుతున్నారు  సొసైటీలో కాలేజీ లెక్చరరుగా ఆమెంటే చాలా మందికి గౌరవం  నిజాన్ని ఖచ్చితంగా చెప్పడంలో  తప్పును ఒప్పుకోవడంలో ఆమెకు ఆమే సాటి

హరిత అడ్డుపడింది

అంకుల్  ఆమె ఈ హత్య చేసిందనే మీరు అంటున్నారా? లేక అనుమానిస్తున్నారా?

అనుకోవడం  అనుమానించడం మా వృత్తిలో అలవాటే  చూసింది చెప్పడం, చెప్పింది అమలు చేయడం మా వృత్తి  హత్య జరిగిన సమయంలో కత్తి స్వరూపగారి చేతిలో ఉంది రక్తపు మడుగులో ఆమె కొడుకున్నాడు ఆమె ఈ హత్య చేసిందనే సాక్ష్యం ఉంది  మా పోలీస్ డిపార్టుమెంటు చూసింది విన్నది ఇది  దీన్ని బట్టి ఆమే ఈ హత్య చేసిందనే నిర్ధారణకు వచ్చాం

హరిత చిన్నగా నవ్వింది

అంకుల్  ఆ సమయంలో అక్కడకు వెళ్ళిన మీ ఇన్స్పెక్టరు పోలీసులను అడిగాను  అక్కడే మీ డిపార్టుమెంటు పప్పులో కాలేసింది

గోపాలరావు ఆశ్చర్యపోయాడు

స్వరూపగారి చేతిలో కత్తి ఉంది కానీ ఒక్క రక్తపు మరక కూడా ఆమె బట్టలమీద లేదు  అక్కడున్న గాయత్రికి లేదు  అంటే ఒక మనిషి మరో మనిషిని దారుణంగా రక్తం ఫౌంటెన్‌లా చిమ్మేవరకు పొడిస్తే  ఆ రక్తం చంపినవాడికి అంటకుండా ఉంటుందా!

(ఇంకా ఉంది)



# ఈసారి మీ కుటుంబానికి సన్‌ఫ్లవర్ రక్షణ కవచంతో భద్రత నివ్వండి.




## సన్‌ఫ్లవర్ ఎకానమీ ప్యాక్. విడి వనస్పతి కంటే కొద్ది పైసల ఎక్కువ ధరకే శుద్ధమైనది.

WPL-2204

మీ కుటుంబానికి అత్యంత సురక్షితమైనదీ, భద్రమైనదీ ఇవ్వండి: సన్‌ఫ్లవర్ బ్రాండ్ వనస్పతి. సన్‌ఫ్లవర్ రక్షణ కవచంతో ప్యాక్ చేయబడి, సీలు చేయబడినది. విటమిన్ ఎ,డి చేరిన పరిశుద్ధమైన పుష్టికరమైన వనస్పతిని మీ కందించే నిమిత్తం ఇలా చేయబడింది.

IS:10633
ISI
VANASPATI




# సన్‌ఫ్లవర్ బ్రాండ్ వనస్పతి

మంచి నెయ్యి మాత్రమే దీన్ని మించగలది.

1 కిలో, ½ కిలో ప్యాక్‌లలో లభ్యం.

**WIPRO LTD** – *Closer to the consumer*

# వ్యక్తిగతం



కర్నాటక ముఖ్యమంత్రి శ్రీ రామకృష్ణహెగ్డే ఫిబ్రవరి 11 న తమ పదవికి రాజినామా చేసారు సారాయిని సీసాలలో నింపే కాంట్రాక్టు కేసులో కర్నాటక హైకోర్టు ఇచ్చిన తర్పు ఆయన ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఉన్నందు వల్ల ఆయన నైతిక బాద్యతని స్వీకరించి తమ రాజినామాని సమర్పించారు కేసు విచారణలో ఆ కాంట్రాక్టర్లు శ్రీ హెగ్డేపై చేసిన ఆరోపణలని ఉపసంహరించుకున్నారు హైకోర్టు కూడా ఎక్కడా ఆయనని తప్పు పట్టలేదు అయినా ఆయన తమ నిర్ణయాన్ని మార్చుకోలేదు కర్నాటక జనతా పార్టీలో ఏర్పడిన ఈ ప్రతిష్టంబన చివరికి ఫిబ్రవరి 16న జరిగిన లెజిస్లేచర్ పార్టీ సమావేశంలో తిరిగి శ్రీ హెగ్డేని నాయకుడిగా ఎన్నుకోవటంతో తొలగిపోయింది. కోర్టు తీర్పు దృష్ట్యా నైతిక బాధ్యతని స్వీకరించి రాజినామా చేసిన శ్రీ హెగ్డే వారం రోజులలోపే తిరిగి ముఖ్యమంత్రి పదవిని స్వీకరించడం ఎందరికో ఆశ్చర్యాన్ని, సందేహాలని కలిగించింది.... □



హరిష్ నారంగ్ హర్యానా లోని రోహటక్ జిల్లాలోని అన్వాల్ గ్రామంలో ఉన్న స్టేట్ బాంక్ఆఫ్ పాటియాలాలో కాషియర్. గత డిసెంబరులో సాయుధులైన దొంగలు ఆ బాంకుని దోచుకోవాలని చేసిన ప్రయత్నాన్ని ఈ యువకుడు తన ధైర్య సాహసాలతో విఫలం చేసాడు ఒంటరిగా దొంగలని ఎదుర్కొని డబ్బునే కాకుండా బాంక్ కాపలాదారు ప్రాణాన్ని కూడా కాపాడాడు ఇదంతా తాను బహుమతిని ఆశించి చెయ్యలేదని, ఆ పరిస్థితిలో అసంకల్పితంగానే వారితో తలపడ్డానని ఆయన అన్నారు ఈ సాహస కృత్యంలో ఆయన ఎడమచెయ్యి విరిగింది కానీ అదృష్టవశాత్తు దుండగులలో ఒకడు పిస్టల్ పేల్చినా అది పేలకపోవటంవల్ల ఆయన ప్రాణాలు దక్కాయి □

# వారఫలం

## 14-3-1986 శుక్రవారం నుండి 20-3-1986 గురువారం వరకు

★ **మేషం** :అధికారమందు వృద్ధికి, వృత్తియందు అబివృద్ధికి అనుకూల గ్రహానుకూలత గలవారం శుభకార్య నిశ్చయానికి అవకాశముంటుంది చివరి రెండు దినాలందు ధనలబ్ధి స్త్రీలకు నూతన వ్యవహారాలందు జోక్యం, చేసే ఉద్యోగమందు పెంపు, ఆరోగ్యమందు పెంపు

★ **వృషభం** :ప్రసిద్ధులను కలిసికొనుట కొందరకు చెప్పవచ్చు గ్రహానుకూల్యత వలన 'రాశిపలం' యోగ్యంగా నుండగలదు అబీష్టసిద్ధి, ఉద్యోగమందు పెంపునకు అవకాశం కొందరకు ఎంతో కాలంగా నిలచిన 'ప్రమోషన్ లబ్యం కాగల వారం స్త్రీలకు సబాగౌరవం పత్రికా గౌరవానికి అవకాశం

★ **మిధునం** :ప్రతిబ రాణించే అవకాశం, కళారంగాన సదవకాశాలు లబ్యం కావటం, వృత్తియందు పెంపు కనిపించటం వ్యాపార రిత్యా ప్రయాణించటం చాలా మంది విషయంలో చెప్పవచ్చు స్త్రీలకు స్థిరాస్తిని గూర్చిన వ్యవహారం చెలరేగవచ్చు

★ **కర్కాటకం** :ఎంత ఆదాయమున్నదో, అంతకుఅంత వ్యయం ఎంతటి సబా గౌరమున్నది, అంతటి థిరస్కార బావం కూడా కనిపిస్తుంది రాజకియంగా యత్నిస్తారు సఫలురు కాలేదని ఆవేదన పడతారు స్త్రీలకు : ప్రభుత్వ పరంగా గాని, బంధువర్గియుల పరంగా గాని మేలు జరుగవచ్చు

★ **సింహం** :ఇంట కొందరకు రవరవలు ఎర్పడవచ్చు కొందరకు బొత్తిగా శాంతి లోపింపవచ్చు స్థిరాస్తిని గూర్చిన వివాదాలు చెలరేగవచ్చు స్త్రీలకు బంధుమిత్రుల వలన ఉపకారం సంబవం దనాదాయముంటుంది

★ **కన్య** .మి నుండి ఉపకృతి పొందినవారు ప్రత్యుపకృతి చేయకపోవటమే గాక అపకారానికి కూడా దిగుతారు అయితేనేం? 'శని' గ్రహానుకూలత వలన మికెట్టి అపకారం అంటదు ఆరోగ్య బాగ్యం, కార్యానుకూలత, ప్రసిద్ధులతో చెలిమి సంబవం స్త్రీలకు అనుకోకుండా ద్రవ్యాదాయం, కళారంగాన సదవకాశాలు

★ **తుల** : తలవని తలంపుగా బంధువులో, మిత్రులో, అపరిచితులో యింటికి రానున్నారు మి కాలం వృదా కానున్నదని కూడా గ్రహించాలి సాహితిరంగాన కొందరకు సదవకాశాలుంటాయి స్త్రీలకు ఉద్యోగమందు శ్రద్ధాసక్తులు అవసరమని గ్రహించాలి

★ **వృశ్చికం** :'రాశియందే శని' ఆరోగ్య రిత్యా జాగ్రత్తపడాలి కొందరకు 'ఆపరేషన్' అగత్యమేమో, గమనించండి అనుకోకుండా ఏదైనా యిబ్బంది రావచ్చు బాగా వయసు చెల్లిన వార్ను మరీ జాగ్రత్తపడాలి స్త్రీలకు సుఖశాంతులు స్వల్పధనాదాయానికి అవకాశం

★ **ధనుస్సు** నూతనాంశాలు గ్రహిస్తారు, కొందరు చేసే వ్యాపారం వదలి వేరొక వ్యాపారంపై దృష్టి మరల్పనున్నారు స్థితి ప్రజ్ఞతో సాగిస్తే మంచిదే సాటివారితో పోటీ ఏర్పడవచ్చు స్త్రీలకు అదికార మందు వృద్ధి, కళారంగాన ప్రసిద్ధికి అవకాశం స్వల్పంగా దనలబ్ధి

★ **మకరం** :చాలమందికి ప్రయాణ మూలకంగా ఆదాయమున్నది కొందరకు విదేశయానం చెప్పుటకు అవసరమైన గ్రహస్థితి యున్నది నూతనోద్యోగ నిమిత్తం మిరు గావించే యత్నాలు సానుకూలం ఎంతో కాలంగా అనుగుణ్యంగా మితో కలసిమెలసి ఉన్నవారు ఈ వారం విడిపోగలరు స్త్రీలకు : ధనలబ్ధికి అవకాశం

★ **కుంభం** :క్రమక్రమంగా మికు వృత్తియందు అభివృద్ధి కనిపించుట గమనిస్తూనే ఉంటారు ఎంత కృషి చేస్తే అంతటి మేలని గ్రహించాలి కోర్టు వ్యవహారాలుంటే, ధైర్యంగా ఉండండి మికు అనుకూలం స్త్రీలకు : ఉద్యోగాబివృద్ధి, రాజకియంగా కొందరకు అనుకూలం

★ **మీనం** :ఇంట వారాంతాన జరుగవలసిన శుబకార్యం వాయిదా పడవచ్చు ప్రతిబకు తగిన అవకాశాలు చిక్కినట్లే చిక్కి జారిపోతాయి ఏనాడో చేతికి అందవలసిన ద్రవ్యం అందక యిబ్బంది పడతారు వ్యాపారరిత్యా ఎలాంటి అడ్డంకు లుండబోవని గ్రహిస్తారు స్త్రీలకు చేసే పనియందు వికాసం దనలబ్ధి బంధువర్గియుల నుండి శుబవార్తాశ్రవణం

–విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

వచ్చేసిందిక! భారతదేశపు మొట్టమొదటి
'మాయిశ్చర్ బ్యాలన్స్‌డ్' సబ్బు

# క్లియర్-టోన్

## చర్మ సంరక్షణ సబ్బు

అరచెట్టకుండా శుభ్రపరుస్తుంది. జిడ్డులేకుండా మృదువుగా చేస్తుంది







క్లియర్-టోన్ సబ్బులో ప్రత్యేకమైన పదార్థాలున్నాయి—అవి శాస్త్రీయంగా [illegible]మైన రీతిలో వున్నాయి. అవి మీ చర్మంలోకి చొచ్చుకుపోయి శుభ్ర[illegible]. దాంతోపాటే మీ చర్మాన్ని మృదువు పరచటం కోసం క్లియర్-టోన్‌లో [illegible] "మాయిశ్చరైజర్" ముఖ్యమైన ద్రవ పదార్థాలతో మీ చర్మానికి [illegible]. మరి దీనిలో గల సౌందర్యం పంచే నురుగ మీ చర్మాన్ని [illegible], నున్నబరుస్తుంది. క్లియర్-టోన్‌తో కడుక్కోవడంతో మీ చర్మానికి [illegible] లాంటి రాజాదనపు స్వచ్ఛత, సేవళంగా వుండే ఆ [illegible] వస్తుంది—పొడిపొడిగా, జిడ్డుగా వేలా కాదు. మరి దాంతోటే క్లియర్-టోన్ సబ్బుకే ప్రత్యేకంగా గల, అంటిపెట్టుకుని వీరావే ఫ్రెంచి [illegible] కూడాను. క్లియర్-టోన్ సబ్బు. దీంతోయిక మీ చర్మం మరింత [illegible], మృదువుగా, ఆరోగ్యవంతంగా రూపొందుతుంది.

**క్లియర్-టోన్**
చర్మ సంరక్షణ సబ్బు
లండన్ • పారిస్ • న్యూయార్క్

# మొదలెట్టండి యివాళే—
# 6 వారాల్లో చూడండిక—

వంటిఛాయను మెరుగుపరిచే క్రీమ్

# క్లియర్-టోన్

మీ రంగురూపాల్ని కొత్తదనంతో రూపొందిస్తుందిక

**1వ వారం**



కోమలమైన చర్మం కేవలం
మూడు రోజుల్లో!

**2వ వారం**



మొటిమల గుర్తులు పోతున్నాయి...
అబ్బ ఎంత హాయి!

**3వ వారం**



చూసావా, మోచేతులు
నిగనిగలాడుతున్నాయి అప్పుడే.

**4వ వారం**



"నీ ముఖానికి ఛాయవచ్చి మెరుస్తోంది."
అంది ఓ మిత్రురాలు.

**5వ వారం**



ఎండలోకెళ్ళినా, వాడదిక చర్మం.

**6వ వారం**



ఇప్పుడు నేనున్నా క్లియర్-టోన్
బృందంలో!

క్లియర్-టోన్‌లోని అద్వితీయ సూత్రీకరణ. మీ చర్మానికి మరింత మెరుపునిస్తూ మరింత మెరుగైన ఛాయతో రూపొందిస్తుంది. సున్నితంగా. అంతేకాదు. క్లియర్-టోన్‌లో గల ఒక ప్రత్యేకమైన పదార్థం. అసహ్యమైన ఆ మచ్చల్ని పోగొడుతుంది. దీనిలోగల ప్రభావమైన 'మాయిశ్చరైజర్' మీ ఛాయను యితరులు మెచ్చుకునేటంతగా మెరుపునూ, మృదుత్వాన్నీ యిస్తుంది.

ఇదంతా కేవలం 6 వారాల్లో!

చక్కని ఆ ఫలితాలు అలాగే వుండటానికోసం క్లియర్-టోన్‌ని రోజుకు రెండుసార్లు రాసుకుంటూ వుండండి. యింట్లోనూ. ఎండలో బయిటికి వెళ్ళినప్పుడూను.




**క్లియర్-టోన్**
లండన్ • పారిస్ • న్యూయార్క్

daCunha/CLS/14/85/TEL

"తిరుపతి" దేవస్థానం వారికి శ్రీ టి. సుబ్బరామిరెడ్డి విరాళంగా కట్టించి యిచ్చిన అతిథి గృహానికి ప్రారంబోత్సవం చేస్తున్న ముఖ్య మంత్రి శ్రీ ఎన్. టి. రామారావు.

చిత్రంలో చిరంజీవి, సుహాసిని, పి.ఎల్. నారాయణ, రాజశేఖర్, మిశ్రో, జానకి, పల్లిపడుచుగా రాధిక నటిస్తున్నారు. ఇళయరాజా స్వరకల్పనలో ఆత్రేయ గీతాలు రాశారు. కణ్ణన్ ఛాయాగ్రాహకుడు, బాబూరావు, గుమ్మడి శ్రీనివాసరావు సహకార దర్శకులు.

## కె. రాఘవేంద్రరావు దర్శకత్వంలో బాలకృష్ణ ద్విపాత్రాభినయం

"మార్చి నుంచి జూలైవరకు ప్రతి నెలా 1–10 తేదిల మధ్య షూటింగ్," అన్నారు కె. రాఘవేంద్రరావు. ఈయన దర్శకత్వంలో కె. కృష్ణమోహనరావు నిర్మించే ఆర్. కె. అసోసియేట్స్ వారి తొలి చిత్రంలో ద్విపాత్రధారి బాలకృష్ణ, విజయశాంతి, భానుప్రియ, రావు గోపాలరావు, నూతన్ ప్రసాద్ ప్రభృత తారాగణం. సత్యానంద్ సంభాషణలు, వేటూరి గీతాలు, చక్రవర్తి సంగీతం, కె. ఎస్. ప్రకాష్ ఛాయ, సలీం నృత్యాలు, వి. ఎస్. రెడ్డి సహదర్శకత్వం, సునీల్ వర్మ– హరి సహకార దర్శకత్వం తెర వెనుక హంగులు. □

# సినిమా

(28 వపేజీ తరువాయి)

## జంధ్యాల దర్శకత్వంలో అరణ్యకాండ కంప్యూటరైజ్డ్ కార్టూన్ చిత్రం

అనేక కార్టూన్ బొమ్మలతో ఒక బొమ్మ కదలికను కలిగించే భ్రమను ఒకే ఒక బొమ్మతో కలిగించే కంప్యూటర్ ప్రక్రియను మన దేశానికి పరిచయం చేయాలనే ఉద్దేశ్యంతో న్యూయార్క్‌లోని సాన్స్ అనే కంప్యూటర్ సంస్థ జంధ్యాల ధర్శకత్వంలో రామాయణంలోని అరణ్యకాండ ను కార్టూన్ చిత్రంగా రూపొందించడానికి నిశ్చయించింది జూన్ జూలై నెలల్లో ఈ చిత్ర నిర్మాణం జరుగుతుంది అన్నారు జంధ్యాల

## చిరంజీవి, భారతీరాజా తొలి కాంబినేషన్‌లో ఆరాధన

నిరక్షరాస్యుడైన ఒక మొరటు యువకునికి ఓ టిచరమ్మకి మధ్య పెరిగే అవ్యక్తమైన ప్రేమ–ఎంతటి కఠిన హృదయంలోనైనా ఏ మూలో ఓ సున్నితమైన లక్షణం ఉంటుంది దాన్ని స్పందించ గలిగిన మనసుకు ఆ కఠిన హృదయం కూడా చలించి ప్రేమ ఉప్పొంగుతుంది అనే ప్రాతిపదిక ఆధారంగా అల్లబడిన కథ మార్చి 11 నుంచి 14 వరకు మైసూరు దగ్గరున్న సామ్రాజ్యపురిలో జరిగే చివరి షెడ్యూల్లో పతాకసన్నివేశంతో పాటు ఒక పాటను ఎక్సరైజ్ చేస్తాం అన్నారు భారతిరాజా ఈయన బ్రిన్స్లే దర్శకత్వంలో యార్లగడ్డ భార్గవరామ్ నిర్మించే కస్తూరి ఆర్ట్స్‌వారి పై

"ఘర్‌వాలి–బాహర్ వాలి" హిందీ చిత్రంలో ఫరూక్ షేక్, అనూరాధ పాటిల్ (ఫొటో : పి. రవిచందర్)













అమృతాంజన్‌కే
తెలుసు
తలనొప్పి
బాధ

మృదువైన మూలపదార్థము వల్ల
ఉపయోగించుట సులభము

క్రొత్త కార్కు అమరిక వల్ల
మందు శక్తికి రక్షణ



OBM 8708 TG



1984 ఒలింపిక్స్ క్రీడలలో
పాల్గొన్న భారత క్రీడాకారులకు
అధికారపూర్వకంగా పెయిన్ బామ్
సరఫరా చేసినవారు

అమృతాంజన్
ఏ ఇతర బాధలు కల్గించని
శీఘ్ర నివారిణిని నమ్మండి

# ఈ జబ్బుకి ఏమందు?

గోటేటి జగన్మోహనరావు

మంచం మీద పడుకున్న దల్లా ఒక్క సారిగా లేచి ఖళ్ళు ఖళ్ళు మంటూ దగ్గడం మొదలెట్టింది గంగమ్మ

శ్లేష్మం గొంతుక్కి అడ్డుపడి బయటకు రాక ఊపిరి సలపనీయకుండా దగ్గు తెప్పిస్తోంది దానికి తోడు ఆయాసం'

చ' చావనీవదు బతకనీయదు ఎదవ జీవితం' ఆజబ్బు బాద పడలేక అలా అనుకుంది గంగమ్మ

రాత్రి తెల్లవార్లూ కంటి మీద కునుకు లేదు దగ్గు ఆయాసం ఎక్కువవడంతో ఓ సారి పడుకోవడం ఓ సారి లేవడం ఇలాగే గడిచి పోయింది రాత్రి

ఈ జబ్బు ఈ వేళటిది కాదు ఆరు మాసాల్నుంచి పట్టి పీడిస్తోంది కొడుకు అక్కడికి మందులు అప్పుడప్పుడు ఇప్పిస్తూనే వున్నాడు అయినా జబ్బు తగ్గలేదు

ఈ బాద పడ్డేను సచ్చిపోతే బాగుణ్ణు లోపల అనుకో బోయి పైకి అనేసిందా మాట గంగమ్మ

అప్పుడే అక్కడికి వచ్చిన గంగమ్మ కోడలు ఆ మాటలు విని మనం చచ్చిపోవాలనుకున్నప్పుడు చచ్చిపోతే ఇంకనేం? ఈ బాదలుంటాయేటి? అంటూ అదోలా అంది

నీకేం తెల్సే ఈ బాద ? సచ్చిపోతే అయిగా వుంటాది అని మళ్ళీ తెరలు , తెరలుగా దగ్గింది ఈ సారి కాస్త శ్లేష్మం పడింది క్రింద దాంతో కొంచెం హాయిగా అనిపించినా వెంటనే ఆయాసం వేగం పుంజుకుంది

కోళ్ళా కాసిని మంచి నీళ్ళు ఇయ్యే' ఆయాసపడుతూనే అడిగింది కోడలుని నోరు ఎండిపోతుంటే'

అత్తగారి మాటలు వినిపించినా వినిపించనట్టు కాసేపు అటూ ఇటూ తిరుగుతూ మళ్ళీ అడిగితేనే కాని మంచి నీళ్ళు ఇవ్వలేదు కోడలు కాంతం'

రెండుగుక్కలు నీళ్ళు గొంతుకులో పోసుకుంది నోరు కొంచెం తడి అయి పిడస కట్టడం తగ్గింది

ఏమయినా ఇంకి దగ్గు ఆయాసం బాద తను పడ్డేదు ఏనుయ్యో గొయ్యో సూసుకోడం మేలు అనుకుందాక్షణంలో ఆ బాద పెట్టే బాద పడలేక

కాని అంతలోనే అనుకుంది. 'తను సచ్చిపోతే తన ఒక్కొగా నొక్క కొడుకు బాగోగులు సూచేదెవరు? ఆడికి పెల్లమున్నా దాని సోకులుకే సరిపోదు ఎంత కాలమైనా ఇంక ఆడెన్లా సూత్తాది? తన పేనమైన తన కొడుకు బాగోగులు సూచుకోవడానికి తనుండాలి అందుకే తను చావకూడదు'

ఇలా ఆలోచిస్తుంటే ఆయాసం మరి ఎక్కువై పోతోంది మందులైపోయి ఇరవై రోజులైనా మందు తెచ్చిపెట్టరా అని కొడుకుని అడగలేక పోతోంది అవును తను మాత్రం ఎలా అడుగుతుంది? కొడుకు పనిచేస్తున్న ఆపీసు వాళ్ళు జీతాలు పెంచమని రెండు నెలల్నుంచి సమ్మె చేస్తున్నారు ఈ రెండు నెలల్నుంచి జీతాల్లేవు అక్కడ ఇక్కడ అప్పుచేసి ఇంట్లోకి కావలసన సరుకులు తెస్తున్నాడు ఇప్పుడు మందులు కూడా ఎక్కడ తేగలడు?

ఆయాసం అంతకంతకు ఎక్కువవుతూనే వుంది' మందులు తెప్పించుకోవాలి లేకపోతే ఈ బాద పడలేదు తను

ఒక్షణం ఆలోచించి తన కుడి చెవిని వున్న దుద్దు మెల్లిగా చేతిలోకి తీసుకుంది

తన కొడుకు ఉద్యోగం వచ్చిన కొత్తలో ప్రేమతో చేయించి పెట్టిన ఆబరణం ఇది' అయినా తప్పదు ఇది అమ్మించి మందులు తెప్పించు కోవాలి '

అబ్బాయి ఒరే అబ్బాయి ' అంత ఆయాసం లోనూ ఎంతో ముద్దుగా పిలుచుకుంది కొడుకుని

ఒరే ఏడు కొండలు కొంచెం గట్టిగా పిలవడంతో తన గదిలోంచి బయటకు వచ్చాడు అతనితో బాటు బార్య కూడా వచ్చింది

దగ్గి దగ్గి, అప్పుడే ఇంత శ్లేష్మం కక్కింది గంగమ్మ అది చూసి చిరాగ్గా విసుక్కున్నాడు ఏడు కొండలు

ఎక్కడ పడితే అక్కడ అలా ఉమ్మేస్తే ఎత్తే వాళ్ళకి అసహ్యంగా వుండదా? రుసరుసలాడుతూ కోపంగా అంది కోడలు కాంతం

నేనే ఎత్తి పారేత్తాన్లే నువ్వేం ఎత్తక్కర్లేదు జవాబిచ్చింది గంగమ్మ

గంగమ్మకి ఈ దగ్గు .. ఆయాసం జబ్బు పట్టుకున్నప్పటి నుంచి దగ్గి దగ్గి కూర్చున్న చోటే, ఉమ్మి వేయడం– అది చూసి కోడలు విసుక్కోవడం, కసుక్కోవడం రోజూ జరుగుతున్నదే!

ఎందుకమ్మా, పిలిచావ్? తల్లి పడుతున్న ఆయాసం బాద చూడలేక ముఖం అప్రక్కకు త్రిప్పుకుని అడిగాడు ఏడుకొండలు

ఏమి లేదురా మందులైపోయి చాలారోజు లైంది బాదెక్కువగా ఉంటోందిరా.. చెప్పలేక, చెప్పలేక అంటోంది

చూస్తున్నావుకదా' రెండు నెలల్నుంచి జీతాల్లేవు దొరికిన చోటల్లా అప్పుచేసి, బియ్యాం , గియ్యం తేవడానికే చస్తున్నాను మందులు కూడా ఎక్కడ చావను?

తన మాటలు కొడుకుని బాదపెట్టి, కోపం తెప్పించినందుకు గంగమ్మ మనస్సు చివుక్కుమంది'

అది కాదురా అబ్బాయ్, నిన్నెప్పుడు ఎక్కడా అప్పుసేయ మంటల్లేదు ఇదిగో..... ఇదట్టికెల్ళి అమ్మి నాకు నాలుగు మందు బిళ్ళలు తెచ్చి కతమాది ఇంట్లోకి వాడు చేతిలో వున్న దుద్దు కొడుకు చేతిలో పెట్టింది.

ఇప్పుడెందుకమ్మా ఇది అమ్మడం" అది అమ్మడం తన కిష్టం లేదన్నట్టు అన్నాడు ఏడుకొండలు

గంగమ్మ చిన్నగా నవ్వి "నాకు తెల్సురా. నువ్వెందు కొద్దంటున్నావో' అది నువ్వు పేమతో సేయించింది అందుకే అదమ్మడం నీకిట్టం లేదు. కాని ఈ బాద పడ్లేన్రా అదమ్మితే ఓ నూటేభై రూపాయలొత్తాయిరా నాకో పది రోజాలకి మందులు తెచ్చి కతమాది ఇంట్లోకి కచ్చు పెట్టు బతుకుబాగుంటే మళ్ళీ సేయిద్దిగాన్లే! అంది

ఏడుకొండలు మరేం మాట్లాడలేదు తల్లి నడిగి మందులు చీటీ తీసుకుని బజారెళ్ళాడు

కొడుకు వెళ్ళిన వైపే చూస్తూ వాడి గురించే ఆలోచించడం మొదలెట్టింది గంగమ్మ

ఏడుకొండలు తనకి ఒక్కగా నొక్క కొడుకు! ఈ లోకంలో తనకున్నది ఆ డొక్కడే' ఆడి బాబు పోయిన కాణ్ణుంచి అన్నీ తను ఎంతో గారంగా, ముద్దుగా పెంచుకుని బి ఏ చెప్పించింది ఆడికి సదువు చెప్పించడానికి తనెంత కట్టపడ్డాదో! ఆడికి పరిచ్చపీజు తెచ్చియ్యడానికి తనెంత పాట్లు పడ్డాది! ఎన్ని అవమానాలు బరించింది ఎంత తల్లడిల్లి పోయింది ' ఆయాల ఆడు "అమ్మా పీజు కట్టాలి అని అడిగిన యాల '

గంగమ్మ మనస్సు నాలుగేళ్ళు వెనక్కి పోయింది!

* * *

కొడుక్కి అన్నం పెట్టి ప్రక్కనే కూర్చుంది

గంగమ్మ

ఇంక మూడు నెలల్లో నాచదువు అయిపోతోందమ్మ ముద్ద నోట్లో పెట్టుకుంటూ అన్నాడు ఏడుకొండలు

ఏడుకొండల్లు చదువు అయిపోతోందంటే గంగమ్మకు మహసంతోషంగా వుంది కొడుకు చెప్పిన చల్లటి కబురుకి ఆనందంతో ఉక్కిరి బిక్కిరి అయిపోయింది

ఆడి సదువుకోసం తను ఇన్నాళ్ళు ఎంతో కట్టపడింది! తమ కులపోళ్ళందరూ మొగపిల్లల్ని సిన్నప్పుడే పనుల్లోకి పంపుతున్నా తను మాత్రం తన కొడుక్కి సదువు సెప్పింతో్ంది తమ ఇంటా ఒంటా ఎవరికీలేని సదువు సెప్పించి, ఆడిసేత ఉజ్జోగం సేయించాలన్నది, తన ఆశ అందుకే తను నాలుగిళ్ళు సూసుకుని అంట్లు గింట్లు తోముతూ ఆడికి సదువు సెప్పించింది

అమ్మా!

ఏంటమ్మా, ఆలోచిస్తున్నావ్?

ఏంలేదు ఏంలేద్రా కొడుకు పిలుపుకి ఉలిక్కిపడి, తడబడుతూ అంది

ఏం, లేక పోవడమేటి? ఏదో ఆలోచిస్తున్నావ్ !

ఏం లేద్రా నీ సదువయిపోతోందంటే సంతోసంగా ఉందిరా

'ఆదిసరేకాని నేను పరీక్ష ఫీజు కట్టాలమ్మా నా చదువుపేరు చెప్పి, ఇదే ఆఖరు ఫీజు

'పరీక్ష ఫీజు' అనడంతోనే గంగమ్మ గుండె ఝల్లుమంది

"ఎంత కట్టాల్రా?"

"అరవై రూపాయలు"

గుండె మీద పెద్దరాయి పడ్డట్టయింది గంగమ్మకు. అయ్యబాబో! అరవై రూపాయలే! తన దగ్గరంత లేవే! ఎలా?!

"ఎప్పుడు కట్టాల్రా?"" అంత డబ్బు ఎక్కణ్ణుంచి తేవాలా?' అని ఆలోచిస్తూనే ఓ పక్క అడిగింది.

"రేపుకాక ఎల్లుండి ఆఖరురోజు!"

'అమ్మో ఎల్లుండే! ఎవర్నడగాలి? ఎవరిత్తారు తనకి?' గబగబా లేచివెళ్ళి, లోపల తను పెట్టెలో దాచిన డబ్బులు తీసి లెక్క పెట్టింది మొత్తం ఓ ఇరవై రూపాయలున్నాయి ఇంక నలభై కావాలి! 'ఆ నలభై ఎలా సంపాదించాలా!' అంటూ ఆలోచిస్తూ, ఆ రాత్రి నిద్రపోలేదు, గంగమ్మ

ఆ మర్నాడు పొద్దున్నే వెళ్ళి ఇద్దరు, ముగ్గురిని అడిగింది

నెలాఖరు సమయం, పైసాలేదు అని ఒకళ్ళు,

"ఓ యాభై ఉంటే ఇంతక్రితమే, ఒకళ్ళకిచ్చేసాను ఉంటే నీకుతప్పకుండా ఇద్దునే, గంగమ్మా! అని ఒకళ్ళు, చెప్పి తప్పుకున్నారంతా

చివరికి కిరాణా కొట్టు కనకయ్యని కూడా అడిగిచూసింది

ఏంచూసి ఇమ్మంటావ్? ఏదైనా వస్తువు చూపించు, వెండిదో, బంగారందో, ఇస్తాను!

ఎండి బంగారాలుంటే మీరడక్కుండానే, ఇద్దును అదిలేకే కదా, మిమ్మల్నిలా దేవిరించేది! మీకు పున్నెముంటాదయ్యా కుర్రోడి సదువాగిపోద్ది మళ్ళీ మీకు నాల్గు రోజుల్లో పదిపైసల లొడ్డితో ఇచ్చేస్తాను ప్రాదేయపడింది గంగమ్మ

చాల్లే చాలు చాలు! వెళ్ళి, ఎవర్నైనా దర్మాత్ముడ్ని అడుగు' అంటూ కసిరికొట్టాడు కనకయ్య

ఉసురుమంటూ ఇంటికొచ్చింది కొడుకు కాలేజికి వెళ్ళిపోయాడు

అన్నంతినాలనిపించలేదు!

ఇంకెక్కడా తనకి డబ్బులు పుట్టేలాలేవు ఫీజు కట్టకపోతే కొడకు సదువు ఇన్నాళ్ళది, గంగలో పోసినట్టు అయిపోద్ది! తను ఇన్నాళ్ళు పడ్డకట్టమంతా ఎటూ కాకుండా పోద్ది!

ఆలోచిస్తుంటే గుండె బరువెక్కి పోతోంది



# ఈ జబ్బుకి ఏమందు?

గంగమ్మకు

లేచి ఓ గ్లాసుడు మంచినీళ్ళు తాగి, మళ్ళీ వీదిని పడింది, తెలుసున్నా వాళ్ళని ప్రతివాళ్ళని అడిగేద్దామని

రోడ్డుమీద రాజయ్య ఎదురయ్యాడు. రిక్షా తొక్కుకుంటూవస్తూ, రాజయ్య, గంగమ్మకు దగ్గర చుట్టంకూడా

ఎక్కడికే గంగమ్మా మాంచెండలొ పోతనావ్? పలకరించాడు రాజయ్య, రిక్షా ఆపి

కుర్రోడికి పరిక్ష పీజు కట్టాలి అటికోసమే తిరుగుతున్న ఓ నలబై రూపాయలుంటే ఇత్తావేటి?

గంగమ్మ మాటలకి విరగబడి నవ్వాడు రాజయ్య

నలబై రూపాయలే ఏలాకోలం అడతనావేంటే?

'కాదు, నిజమే సెబుతున్నా ఓ నలబై ఉంటే ఇయ్యి

ఊరుకోవే! ఎవడేనా సూత్తే నవ్వుతాడు నాదగ్గర అంతడబ్బే ' ఒకేలున్నా ఆ చనంలో నే అయిపోద్ది

'పోనీ ఎవర్నడిగితే దొరుకుద్దో, సెప్పు?

అద్గది, అలా అడుగు సెప్తాను

రాజయ్య మాటలకు, పోతున్న ప్రాణం లేచొచ్చింది గంగమ్మకు ఏం చెబుతాడా? అని వాడి కళ్ళల్లోకే చూస్తోంది

రాజయ్య రిక్షాసీటు మీదే కూర్చుని, చేతులు కట్టుకుని, ఆడదానికి ఆపదలో సొమ్మవసరమయితే, రెండేరెండు దోవలున్నాయి 'మానమేనా అమ్ముకోవాలి, రత్తమేనా అమ్ముకోవాలి అంటూ ఆపాడు

'ఏదో ఉపాయం సెబుతాడనుకుంటే ఈడు సెప్పేది ఇదా?' ఏంటా వాగుడు? అనేసింది

నేను సెప్పేది ఇనుపించుకోయె గంగమ్మ తల్లా! నువ్వు 'నిప్పు ఆ ఇసయం నాకు తెల్సు అందుకని 'మానం' ఉతొమిదం అన్న కొసినే'లేదు ఇకపోతే రత్తం అమ్ముకోడమే!

రత్తమమ్మితే, సచ్చిపోమా? అమాయకంగా అడిగింది

రాజయ్య ఓ సారినవ్వి, నీ బొంద రత్తమమ్మితే ఏం సచ్చిపోం మేం ఓరంకోపాలి ఒక్కో బాటిలు అమ్మేతాం! నువ్వు కూడా ఓ బాటిలు అమ్మేవనుకో, నీక్కావలసిన నలబైరూపాయలూ వత్తాది అసలు ఒంట్లోంచి రక్తంచుక్క తీసినట్టే అనిపించదు వివరంగా చెప్పాడు

నిజమే! ఈడు సెప్పింది, మంచి ఉపాయమే! ఈ పని చేత్తే, ఇంకెవర్ని బతిమాలక్కర్లేదు

తన కొడుక్కోసం రత్తమే కాదు పేనమైనా సరే అమ్ముతాది తను!

ఇంతకి ఎవరు కొంటారు? అడిగింది

రాజయ్య వేలెట్టి చూపిస్తూ, అదిగో ఈ రోడ్డు మలుపు కాడ, ఓ డాక్టరున్నాడు సూసేవా! ఆయనే కొంటాడు అప్పడికప్పుడిచ్చేత్తాడు డబ్బులు చెప్పాడు వివరాలు

సర్లే, ఎల్తాను అని చెప్పి ఓ అడుగు ముందుకు వేసి ఆగి, ఇదిగో రాజయ్య! రత్తమమ్మేనని మా ఏడుకొండలకి సెప్పకేం! అంది

అలాగే సెప్పన్లేవే! ఆడంటే నీకెంత పేమే! మేమేమొ సారా తాగడానికి రత్తమమ్ముకుంటుంటే నువ్వేమో కొడుకు సదువు కోసం అమ్ముతున్నావ్ ఏడుకొండలు గాడు ఎన్నిజనమ లెత్తినా నీరునం తీచ్చుకోలేడే! కొడుక్కోసం గంగమ్మ పడే బాదలు చూస్తుంటే, రాజయ్యకు ఆశ్చర్యం, ఆనందం కలిగి, అలా అని వెళ్ళి పోయాడు గబగబా, రాజయ్య చెప్పిన డాక్టరు దగ్గరికి వెళ్ళింది గంగమ్మ

రక్తమమ్మి నలభై రూపాయలు పుచ్చుకుంది ఇప్పుడు గంగమ్మ మనసెంతో ఆనందంగా, హాయిగా వుంది, 'తన రక్తంతో ఆడి సదువు పూత్తవుతోంది అని

'తన కొడుకు సదువు ఇక ఆగదు తను పరీచ్చ పీజు సంపాయించింది' తలచుకుంటే ప్రాణం హాయిగా అనిపిస్తోంది

ఆసాయం కాలమే, తన దగ్గరున్న ఇరవై, రక్తమమ్మగా వచ్చిన నలభై, మొత్తం అరవై రూపాయలూ కొడుకు చేతిలో పెట్టి, ఊపిరిపీల్చుకుంది

★ ★ ★

అలా అయాల తనంత బాధపడింది, ఆడి పరిచ్చ పీజు తెచ్చియ్యడానికి!

ఆడుకూడా బాగా సదివి పరిచ్చయ్యేడు అందుకే గమ్మునే ఉజ్జోగం వచ్చింది !'

ఒక్కసారి, గుక్క తిప్పుకోకుండా దగ్గింది గంగమ్మ ఆ దగ్గుతో ఆలోచనలు లొంచి బయట పడింది

ఎదురుగా కొడుకు ఏదు కొండలు వచ్చి నిలబడ్డాడు మనిషి కంగారుగా వున్నాడు తల్లివున్న మంచం మీద ఊరికే వెతికాడు

గంగమ్మ కదేమీ అర్థం కావటం లేదు

ఏంట్రా అలా తడుంకుంటావ్ ? కొడుకు ప్రవర్తన అంతు బట్టక అడిగింది

ఏడుకొండలు ఏం జవాబివ్వలేదు ఇంకా వెతుకుతూనే వున్నాడు

గంగమ్మ మళ్ళీ అదేప్రశ్న అడిగింది

నువ్విచ్చిన . దుద్దు ఎక్కడో పడిపోయిందమ్మ ఇక్కడే మర్చిపోయానేమో అని వెతుకు తున్నాను

అదిరిపడింది గంగమ్మ

'అయ్యో! నూటిబై రూపాయల్ని పడిపోయిందా?' గంగమ్మ మనసు బాధతో మూలిగింది

దగ్గు ఇంకా ఎక్కువైంది దానికి ఆయాసం తోడైంది !

'తనిన్నాళ్ళుంచి ఓపికపట్టి మందులు కోసం ఎదురు చూతోంది !

ఓ మందు బిళ్ళ మింగితే అయాసం .. తగ్గుతాదని ఆశగా చూతోంది.. !

తన రాత ఇలా ఉంది కొడుకేం చేత్తాడు ఆడు మాత్రం పడేయాలని పడేత్తాడా సరిపెట్టుకుంది

ఏడుకొండలు ఇంకా మంచం మీద, మంచం క్రిందా వెతుకుతూనే వున్నాడు

పోనీలేరా ఎలాపోయీది అలాపోవాలి ! కొడుకు 'దుద్దు' కోసం పడుతున్న ఆదుర్దా, కంగారు చూడలేక అంది

లేదమ్మా, ఎక్కడ పడిపోయిందో తెలవట్టం లేదు'

బజార్లో ఎక్కడో పడి పోయుంటాది ఈ పాటి కెవరికో అది దొరికేసే ఉంటుంది '

అదే జరిగుండాలమ్మా రోడ్డుమీ దెక్కడో పడి పోయుంటుంది ఆనక ఎవరోకర్ని అడిగి మందులు తెస్తాన్లే

ఆయాసం ముంచుకొస్తున్నా, కొడుకు మాటలు






హల్లో ! ఏవండోయ్ !! మేడంగారూ !!!

# భర్తని కొంగున ముడివేసుకోడం ఎలా ?.

అని ఆలోచిస్తున్నారా ?

మీ మనసులోని మాట ఎలా కనిపెట్టాం అంటారా ?.

అమ్మమ్మా ? కోపం వద్దండి ?



## మేం కూడా మీ శ్రేయోభిలాషులమే. మీతో పూర్తిగా ఏకీభవిస్తాం.

అయన చేసే అంతులేని దుబారా ఖర్చులకు.
కాల్చే సిగరెట్లకు, తిరిగే తిరుగుళ్ళకి
హద్దు వేయాల్సిందే.




## మేడం, ఆలోచన ఆడవాళ్ళ సహజగుణం ఆలోచించండి.

ఒకేమార్గం కనిపిస్తూంది కదూ
ఆయన చేసే ఖర్చుకి కళ్ళెం వేయడమే
ఇంట్లో దాస్తే ఆయన పోపుల డబ్బా కూడా వెతుకుతారు
ఎలా ? అంటారా ? ఎల్లా ఏమిటండీ
మీకు దగ్గర్లో వున్న పోస్టాఫీసులో సేవింగ్సు అకౌంట్ తెరవడం
ఆయన నలవారి ఖర్చులో సగం దాన్లో వేయడమే

దీన్లో ఇంకో కిటుకుందండోయ్ ।
ఆరునెలల్లో లాటరీ తగిలిందనుకోండి
ఆయన్ని ఆశ్చర్యంలో ముంచడమే
ఈరోజు జీతాలు వస్తాయండోయ్ । గుర్తుంచుకోండి
జా పాసం ఇక వెళ్లా మండీ ఆయన వచ్చేలోగా
ఇంకో చిన్న మాటుంది

## జాతీయ పొదుపు సంస్థలో మీరు నవ్వితే రాలే నవరత్నాల్లాంటి పథకాలు వున్నాయి. మీరు సబల అని నిరూపించండి.





పూర్తి వివరాలకు :
మీ దగ్గర్లో వున్న పోస్టాఫీసులో గానీ కలెక్టరు కార్యాలయంలోని తాశీల్దారుని గానీ, జాతీయ పొదుపు సంస్థ అధికారులను గానీ/ ఏజెంట్లను గానీ సంప్రదించండి

కమీషనర్ స్మాల్ సేవింగ్సు
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము
హిమాయత్‌నగర్ హైదరాబాద్ - 500 029

విని పొంగిపోయింది గంగమ్మ

* * *

ఏడుకొండలు మంచం మీద పడుకున్నాడు భార్య కాంతం క్రింద చాప పరుచుకుని పడుకుంది

ఏం కాంతం ఇలారా! పిలిచాడు భార్యను

రానని తల అడ్డంగా ఊపి కోపంగా చూసింది మొగుణ్ణి

నిన్న నీ పుట్టిన రోజుకి చీర కొనలేదనే కదా ఇంకా ఆ కోపం? అడిగాడు ఏడుకొండలు లేచి కూర్చుని

కాంతం ఏం జవాబివ్వలేదు

కొత్త చీరిస్తే కోపం పోతుందా? భార్య కళ్ళల్లోకి చిలిపిగా చూస్తూ అన్నాడు

కొత్త చీర కొనగల వస్తాదు కూడానా మీరు? మూతి అదోలా త్రిప్పి దెప్పి పొడిచింది కాంతం

ఏడుకొండలు చిన్నగానవ్వి మంచం మీద పక్కవేసిన దుప్పటి ఓపక్క పైకెత్తి ఓ పేకెట్ తీశాడు

కాంతం ఆశ్చర్యంగా చూసింది భర్త వైపు

పేకెట్ చింపి అందులోంచి ఎర్రని నైలెక్స్ చీర బయటకు తీసి భార్య మీద విసిరాడు ఏడుకొండలు

మీద పడ్డ చీరను అటు ఇటు తిప్పి చూసి ఎక్కడిదండి? ఎప్పుడు కొన్నారు? డబ్బు లెక్కడివి? ప్రశ్నల వర్షం కురిపించింది

## సగటు మనిషి

బ్రతుకంతా అద్దె ఇల్లు
పెళ్ళాం పిల్లల కనీసవు
కోర్కెలు తీర్చలేని జీతపు రాళ్ళు
పెరిగిపోతున్న సమస్యలతో
అలసిపోతున్న ఒళ్ళు
అప్పులవాడి చివాట్లతో
నెలాఖరు పస్తులతో
నీరు నిండిన కళ్ళు
పెరిగి పోతున్న అప్పుల్లా
ఎదగిపోతున్న పిల్లలు
ఇవన్నీ వెరసి సామాన్యుడు!

— యస్ పి లక్ష్మీ నారాయణ

## ఈ జబ్బుకి ఏమందు

చెప్తానుగా! ముందు కట్టుకో!

ఆ పక్కకు తిరిగి కళ్ళు మూసుకోండి కట్టుకుంటాను అంది కాంతం ప్రక్కకు తిర్గి కళ్ళుమూసుకున్నాడు ఏడుకొండలు

ఓక్షణంలో క్రొత్త చీర కట్టుకుని వచ్చి భర్త ప్రక్కన కూర్చుంది మంచం మీద కట్టుకున్న చీరను పదేపదే చూసుకుంటూ!

క్రొత్త చీర అందంలో మిల మిలా మెరిసి పోతున్న భార్య అందాన్ని చూస్తే అదోలా అయిపోయాడు ఏడుకొండలు

చెప్పండిప్పుడు? చీర ఎలా కొన్నారు? డబ్బు లెక్కడివి?

చెప్పాలా?

ఊ

తప్పదా?

తప్పదు

అయితే విను! మద్యాహ్నం మా అమ్మ మందులు తెమ్మని చెప్పి చెవి దుద్దు ఇచ్చింది కదా

అవును అది, పడి పోయింది కదా?

ఏడుకొండలు నవ్వాడు ఆ నవ్వులో వున్న అర్థం భార్యకు అర్థం కాలేదు

పడిపోలేదు అలా చెప్పాను! అది అమ్మే నీకు చీర కొన్నాను లేకపోతే నిన్నటి నుంచి నువ్వు నాతో మాట్లాడటం లేదు కదా ?

అది కాకపోయినా ఆదుద్దు మా అమ్మకునేను చేయించిందే ! పెళ్ళికి ముందు తల్లి పెళ్ళయ్యాక భార్య అందరి కంటే ముందు ! అది సరే చీర బాగుందా? ' భార్యను మీదకు లాక్కున్నాడు

బయట గంగమ్మ తెరలు, తెరలుగా దగ్గుతూనే వుంది!

ఆమెకు ఇదేమీ తెలియదు తెలిస్తే దగ్గు ఓ క్షణంలో తగ్గిపోదూ?!




# NC నాగార్జున సిమెంట్స్ లిమిటెడ్

(An APIDC assisted unit)

# సాక్షి

(గత సంచిక తరువాయి)

పోలీస్ సబ్ఇన్స్పెక్టర్ విజయ్ని చూడగానే గుర్తుపట్టి శాల్యూట్ చేసాడు ఇంట్లో వాళ్ళందర్నీ బయట వరండాలో కూర్చోమని చెప్పి పోలీసులతో బాటు శవం పడి వున్న చోటుకి వెళ్ళాడు విజయ్

ఒక అరగంటలో చకచకా పనులన్నీ పూర్తయిపోయాయి పోలీసు జీపుని చూడగానే కొంతమంది గ్రామస్తులు గేటు వద్ద గుమిగూడారు వారిలో కొందరు పెద్దమనుషుల్ని పిలిచి పంచనామా పూర్తి చేయించాడు విజయ్ తర్వాత ఆనంద్ శవాన్ని అంబులెన్స్లోకి ఎక్కించి పట్నం తీసుకెళ్ళిపోయారు పోలీసులు అక్కడ పోస్టుమార్టం తర్వాత ఆనంద్ పని చేస్తున్న ప్రైవేటు హాస్పటల్లో మర్నాడు సాయంత్రం వరకూ వుంచి చూడవలసిన వాళ్ళంతా వచ్చి చూసేక ఖననం చేస్తామని చెప్పారు శవాన్ని అంబులెన్స్లోకి ఎక్కిస్తుంటే మైత్రేయి కళ్ళ వెంట కన్నీళ్ళు జలజలా రాలడం గమనించాడు విజయ్

★ ★ ★ ★ ★

పోలీసులు వెళ్ళిన వెంటనే తన గదిలోకి వెళ్ళిన ప్రకాష్ తుళ్ళి పడ్డాడు అక్కడ తను వేసిన మైత్రేయి చిత్రం లేదు అతని బుర్రలో రైళ్ళు పరిగెత్తసాగాయి కోపంగా బయటికి వచ్చాడు హాల్లో కల్యాణ్, విజయ్లు మాట్లాడుకుంటున్నారు

మిస్టర్ విజయ్ వాటీజ్ దిస్? కోపంగా అరిచాడు ప్రకాష్

ఏమిటి? తాపీగా అడిగాడు విజయ్

నేను వేసిన పెయింటింగ్ని ఏమి చేసారు

పోలీసులు తీసుకెళ్ళారు

నాన్సెన్స్ పళ్ళు పటపటలాడించాడు ప్రకాష్

పోలీసులకి ఆ చిత్రంతో పనేమిటి?

నాకేం తెలుసు వాళ్ళు కావాలన్నారు తీసుకెళ్ళమన్నాను మరింత తాపీగా సమాదాన మిచ్చాడు విజయ్

జరిగినకథ–3 : అర్జంటుగా ఏదో మాట్లాడాలని రాసిన కళ్యాణ్ ఆ విషయం ఏం చర్చించక పోవడం విచిత్రంగా ఉంటుంది విజయ్కి మర్నాడు ప్రొద్దున నిద్ర లేచేటప్పటికి డాక్టర్ ఆనంద్ దుర్మరణం పాలయి ఉంటాడు ఆనంద్ పని చేసే హాస్పిటల్కి, లోకల్ పోలీస్స్టేషన్కి ఈ విషయం ఫోన్ చేసి చెప్పమని కళ్యాణ్తో చెప్తాడు విజయ్ పోలీసు లొచ్చేలోపల తన ఇన్వెస్టిగేషన్ మొదలు పెడతాడు మైత్రేయి తనకి, కల్యాణ్కి మేరేజ్ ఏ పరిస్థితులలో జరిగిందో చెప్పింది డా ఆనంద్ మైత్రేయి ప్రేమించుకున్నారని, తెలుసుకున్న కళ్యాణ్ వారిద్దరికి పెళ్ళి జరిపిస్తానని చెప్పినట్లు విజయ్కు చెపుతుంది మైత్రేయి. తరువాత విజయ్ ప్రకాష్ని, శామ్యూల్ని కూడా ప్రశ్నలు వేయసాగాడు ఇంతలో పోలీసులు హాస్పిటల్ స్టాఫూ వచ్చారు

తీసుకెళ్ళమనడానికి మీరెవరు? ఆ చిత్రం వేసింది నేను దాని హక్కుదారుడు కల్యాణ్. మా యిద్దరితో చెప్పకుండా దాన్ని పోలీసులకిచ్చే హక్కు మీకెక్కడిది?

విజయ్ ఏం మాట్లాడలేదు కల్యాణ్ వంక చూసి చిన్నగా నవ్వేడు అతని బావం అర్ధం చేసుకున్న కల్యాణ్ కలుగజేసుకున్నాడు

'మిస్టర్ ప్రకాష్ ఆవేశపడకండి నా అనుమతితో నే ఆ చిత్రాన్ని పోలీసుల కిచ్చాడు విజయ్ అన్నాడు మృదువుగా

ప్రకాష్కి నోటమాట రాలేదు కోపం పట్టలేక వారిద్దరి వంకా తీక్షణంగా చూసి తర్వాత తన గదిలోకి నిష్క్రమించాడు

మేడ పైకి వెళ్ళిన శామ్యూల్ దృష్టి డస్ట్బిన్ మీద పడింది దాన్ని చూస్తూనే అతను ఉలిక్కి పడ్డాడు అది ఖాళీగా వుంది!

★ ★ ★ ★ ★

గంట తర్వాత అందర్నీ బ్రేక్ఫాస్ట్కి పిలిచాడు కల్యాణ్ డైనింగ్ టేబిల్ దగ్గర సమావేశమయ్యారందరూ అందరి వదనాలూ కళావిహీనంగా వున్నాయ్ మైత్రేయి సంగతి సరేసరి మాటిమాటికీ పొర్లి వస్తున్న దుఃఖంతో ఆమె కళ్ళు కన్నీటి తటాకాల్లా వున్నాయ్

డైనింగ్ టేబిల్ దగ్గర భరించలేని నిశ్శబ్దం ఏర్పడింది ఎవరికీ తిండి మీద ధ్యాస లేకపోవడం వల్ల టిఫిన్ కెలుకుతూ కూర్చున్నారు పరిస్థితిని గమనించిన కల్యాణ్ వాతావరణంలో ఏర్పడ్డ 'టెన్షన్' పోగొట్టడానికని ప్రయత్నించాడు

సారి ఫ్రెండ్స్ ఎంతో హుషారుగా ముగుస్తుందనుకున్న ఈ గెట్టుగెదర్' యిలా విషాదంగా మారుతుందనుకోలేదు మీ అందరికి డాక్టర్ ఆనంద్ స్నేహితుడు మాత్రమే నాకైతే అతను ప్రాణదాత కూడ! అంతే కాదు నాకోసం తన సర్వస్వాన్ని త్యాగం చేసిన ఆదర్శ మూర్తి! కల్యాణ్ మాటలకి మైత్రేయికి దుఃఖం ఆగలేదు కొంగు నోట కడ్డం పెట్టుకుని దుఃఖం ఆపు కుందికి ప్రయత్నించ సాగిందామె ఆమె పరిస్థితి చూసి కల్యాణ్ కంఠం కూడ దుఃఖంతో జీరబోయింది, అయిపోయింది నిన్నటి వరకూ మన మధ్య ఆనందంగా గడిపిన ఆనంద్ యివాల్టి నుంచి మనకి శాశ్వతంగా దూరమై పోయాడు దుఃఖాన్ని మింగేస్తూ ముగించేడు కల్యాణ్

మిగిలిన ముగ్గురూ ఏం మాట్లాడలేదు ఏం మాట్లాడాలో ఎవరికీ తోచలేదు కూడ ఎవరి ఆలోచనల్లో వారున్నారు.

నిశ్శబ్దాన్ని బంగపరుస్తూ టెలిఫోన్ మోగింది కల్యాణ్ బెడిరూంలో కల్యాణ్ లేచి వెళ్ళి మళ్ళీ వెంటనే తిరిగొచ్చాడు

ఇటీజ్ ఫర్యు మిస్టర్ విజయ్ పోలీస్ స్టేషను నుంచి ఎస్ ఐ ఫోన్ చేసాడు అన్నాడు

విజయ్ లేచి కల్యాణ్ బెడ్రూంలకి వెళ్ళాడు లోపలికెళ్ళగానే బెడ్రూం తలుపు వేశాడు తాను మాట్లాడేది ఎవరికీ వినబడకుండా దాదాపు పదినిమిషాల తర్వాత తిరిగి వచ్చి టేబిల్ దగ్గర కూర్చున్నాడు

అందరి మనసులూ ఆందోళనగా వున్నాయ్ విజయ్ ఏం చెప్పబోతున్నాడో అని కాని అడగడానికి మాత్రం ఎవరూ సాహసించ లేక పోయారు ఒక్క కల్యాణ్ తప్ప

ఏమంటున్నాడు యిన్స్పెక్టర్ ఏక్సిడెంటల్ డెత్ అంటాడా? సూయిసైడ్ అంటాడా? అడిగాడతను

రెండూ కాదు మర్డర్ అంటున్నాడు అన్నాడు విజయ్ యదాలాపంగా

బాంబు పేలినట్లు ఉలిక్కి పడ్డారందరూ

మర్డరా? కల్యాణ్ ముఖంలో చెప్పలేని ఆశ్చర్యం చోటు చేసుకుంది

ఆ మర్డరే మళ్ళీ యధాలాపంగానే అన్నాడు విజయ్ మళ్ళీ రెండు నిమిషాలు ఎవరూ మాట్లాడడానికి సాహసించ లేక పోయారు

ఛఛ మీ పోలీసువాళ్ళెప్పుడూ యింతే గోరంత అవకాశం దొరికితే కొండంత అనుమానిస్తారు అన్నాడు శామ్యూల్ ఎలాగో గొంతు పెగుల్చుకుని

అనుమానం కాదు ఇటీజ్ ఎ ఫాక్ట్ అన్నాడు విజయ్ నిశ్చలంగా శామ్యూల్ కళ్ళలోకే చూస్తూ

మర్డరని ఎలా చెప్ప గలరు? ఈసారి ప్రకాష్ ధైర్యం చేసాడు

"మిష్టర్ ప్రకాష్... మీరే ఈ హత్య చేసి వుంటే ఎలా చేసి వుండేవారో చెప్పండి చూద్దాం" అన్నాడు విజయ్ సన్నగా నవ్వుతూ.

ప్రకాష్ మొహం కోపంతో జేవురించింది.

"డోంట్ బి సిల్లీ" అన్నాడు తీవ్రంగా.

విజయ్ ప్రశాంతంగా అతని వంక చూసాడు.

"అయామ్ నాట్ బీయింగ్ సిల్లీ మిష్టర్ ప్రకాష్... ఈ హత్య మీరే చేసారని చెప్తున్నాను...." అందరి గుండెలూ లిప్తకాలం కొట్టుకోడం మరచిపోయాయి విజయ్ మాటలకి. విజయ్ చూపులు మాత్రం ప్రకాష్ మీదే ఫిక్సయిపోయాయి. "ఎలా చేసారో కూడ చెప్తున్నాను మిష్టర్ ప్రకాష్.... జాగ్రత్తగా వినండి. రాత్రి డిన్నరయిన తర్వాత మీరు మైత్రేయి చిత్రానికి ఫినిషింగ్ టచెస్ యివ్వసాగారు. అదే సమయంలో డాక్టర్ ఆనంద్‌తో ఏదో మాట్లాడాలనే ఉద్దేశంతో బయటికి వచ్చిన మైత్రేయి మీగదిలో లైటు వెలుగుతూండడం చూసి మీరేం చేస్తున్నారో నని తలుపు సందులోంచి చూసింది. ఆమె చూసినప్పుడు పెయింట్ వేయడంలో మునిగి వున్న మీరు ఆమె వెనక్కి తిరగ్గానే అనుకోకుండా తలుపు వైపు చూడడం తటస్థించింది. వెనుదిరిగి వెళ్తున్న మైత్రేయిని చూడగానే మీలో ఏదో అనుమానం కలిగింది. తలుపు సందులోంచీ ఆమె మేడ మీద కెళ్ళడం గమనించారు మీరు. మీలో ఆసక్తి పెరిగింది. 'అంత అర్ధరాత్రి పూట ఆమెకి మేడ మీద పనేమిటా?' అని. ఆమె పూర్తిగా మేడెక్కిన తర్వాత గదిలో లైటార్పేసి మీరు కూడ బయటికి వచ్చారు. ఆమె ననుసరించాలని మెట్లెక్కసాగారు. నాలుగు మెట్లెక్కగానే డాక్టర్ రూంలోంచీ మీకు మాటలు వినిపించ సాగాయ్. మైత్రేయి డాక్టరు రూంలోకి వెళ్ళిందని అర్ధమయింది మీకు. అయితే తలుపు దగ్గరగా వేసి వుండడం వల్ల, వాళ్ళిద్దరూ నెమ్మదిగా మాట్లాడుకోడం వల్లా మీకేదీ స్పష్టంగా వినబడలేదు. డాక్టర్ ఆనంద్‌తో ఆమె కేదో సంబంధం వుందని అనుమానించారు మీరు. మీ హృదయం అసూయతో భగ్గుమంది. చిత్రకారుడిగా మైత్రేయి దృష్టి నాకర్షిద్దామని మీరు ప్రయత్నిస్తున్న తరుణంలో ఈ సంఘటన జరగడం మీ మనస్సుని బాగా కలచివేసింది. వెంటనే ఏం చెయ్యాలో తోచక రూంకి తిరిగి వచ్చి



## సాక్షి

మైత్రేయి రాకకి నిరీక్షించ సాగారు అరగంట తర్వాత ఆమె రావడం గదిలో కెళ్ళి తలుపేసుకోవడం జరిగింది వికలమైన మనసుతో 'పక్కమీద వాలారు మీరు ఉద్రేకం పట్టలేక పెయింట్ మరకలున్న చేతులతో నే కసిదీరా మంచంమీద వేసిన బెడ్‌షీట్‌ని నలిపేశారు

అయినా మీ ఉద్రేకం చల్లారలేదు మీకు నిద్రపట్టలేదు రూం తలుపు తెరుచుకుని బయటికి వచ్చారు అదే సమయంలో డాక్టర్ ఆనంద్ తన బెడ్‌రూం తలుపుపైన గొళ్ళెం పెట్టి వరండాలో వున్న డోర్ తెరుచుకుని డాబా మీదకి వెళ్తున్నాడు ఆనంద్ డాబామీదకి వెళ్ళడం గమనించిన తర్వాత మీ లాయరు బుర్ర చురుగ్గా పనిచేయ నారంబించింది వెనక్కి తిరిగి వచ్చి బాత్రూంలో వాష్‌బేసిన్ దగ్గర శుభ్రంగా చేతులు కడుక్కున్నారు మీరు వేసుకున్న స్లిప్పర్స్ విప్పేసి, డ్రాయింగ్ రూంలో నున్న షెల్ఫులో కల్యాణ్ చెప్పులు కొత్తవి వేసుకున్నారు ఆ తర్వాత డైనింగ్ టేబిల్ మీదున్న పళ్ళు కోసుకునే కత్తిని జాగ్రత్తగా అక్కడే వున్న నాప్‌కిన్‌తో పట్టుకున్నారు ఆ కత్తితో నే రాత్రి కల్యాణ్ ఆపిల్ పళ్ళు కోసాడనీ దాని పిడిమీద అతని వేలి ముద్రలు ఖచ్చితంగా వుంటాయనీ మీకు తెలుసు డాక్టరుతో మాట్లాడుతున్నట్టే మాట్లాడి ఆకత్తితో అతన్ని పొడిచి చంపేసి తర్వాత నాప్‌కిన్ తెచ్చేసి దానిమీద రక్తం మరకలేమైనా అయితే కనబడకుండా వాష్ చేసేద్దామనుకున్నారు ఆకాశం కొద్దిగా ఉరుముతూండడం వల్ల డాక్టర్ అరచినా ఎవరికీ వినబడదనే ధైర్యం మీది ఆ ఉద్దేశం తో నే మీరు డాబామీద పిట్టగోడ దగ్గర దీర్ఘంగా ఆలోచిస్తూ నిలబడ్డ డాక్టర్‌ని సమీపించారు మత్తులో వుండడం వల్ల, రాత్రి శామ్యూల్‌తో జరిగిన ఘర్షణవల్ల, ఆ తర్వాత మైత్రేయి చెప్పిన విషయాల వల్ల అతని మనసు మనసులో లేదు వెనుకనించి సమీపించిన మిమ్మల్ని అతను గమనించలేదు ఆ స్థితిలో అతన్ని చూసిన మీకు మరో ఆలోచన వచ్చింది కత్తితో చంపి చిక్కుల్లో పడడం కంటే చటుక్కున అతని రెండు కాళ్ళూ పైకెత్తేస్తే అతను నేరుగా కింద గచ్చుమీద పడి తల పగిలి చస్తాడు అప్పుడది ఏక్సిడెంటనో లేక ఆత్మహత్యనో భావిస్తారందరూ ఈ ఆలోచన వచ్చిన వెంటనే మీరు కత్తిని పిట్టగోడ మీద పెట్టేసి ఒక్క ఉదుటున వెనకనించి అతని రెండు కాళ్ళూ పైకెత్తేశారు చేతులు కట్టుకుని ఆలోచిస్తున్న ఆనంద్ యిలాంటి ప్రమాదం ముంచుకు వస్తుందని ఊహించలేక పోయాడు అతనికి తనని తాను రక్షించుకునే వ్యవధి కూడ లేకపోయింది మీ ప్లాన్ పూర్తిగా విజయవంత మయింది. .." అంటూ ముగించాడు విజయ్. అతను చెప్తున్నంత సేపూ ఊపిరి తీసుకోడం కూడ మరచిపోయి అతని వంకే చూస్తూ కూర్చున్నారందరూ

విజయ్ చెప్పిందంతా విని తేలిగ్గా నవ్వేశాడు ప్రకాష్




చాల బాగా కథల్లేపి! ఇన్నాళ్ళూ పోలీసాఫీసరనే అనుకున్నాను గాని కథలల్లడంలో యింత నేర్పరివనీ, బ్లాక్ మెయిల్ చెయ్యడంలో కూడ చాల సిద్ధహస్తుడవనీ ఈ రోజే తెలిసింది! కంగ్రాట్యులేషన్స్ అన్నాడు వెక్కిరింపుగా అతని సంబోధన లో ని ఏకవచన ప్రయోగాన్ని గమనించక పోలేదు విజయ్

కొన్ని వాస్తవాలు కూడ కదల్లాగే కనిపిస్తాయ్ మిస్టర్ ప్రకాష్ కాని నీ అంతరాత్మకి తెలుసు నువ్వే హత్య చేసావో లేదో అదే నీకు సాక్షి అన్నాడు విజయ్ నిబ్బరంగా

ప్రకాష్ పకపకా నవ్వేడు

అంతరాత్మ సాక్షి వ్యంగ్యంగా అన్నాడు అంతరాత్మే కనుక సాక్షిగా వుండే మాటుంటే కోర్టుల్లో మా లాయర్ల అవుసరమే వుండదు

కరెక్ట్ మిస్టర్ ప్రకాష్ నిజం చెప్పేవు కాని కోర్టులో నీ నేరం రుజువు చేసేందుకు ఒక ప్రత్యక్ష సాక్షి కూడ వున్నాడిక్కడ నువ్వు హత్య చేస్తుండగా తన కళ్ళతో స్వయంగా చూసాడతను అన్నాడు విజయ్ సన్నగా నవ్వుతూ అందరూ ఒక్కసారి ఉలిక్కిపడ్డారి మాటలకి

అప్పటి వరకూ నవ్వుతున్న ప్రకాష్ మొహం సీరియస్‌గా మారిపోయింది

వాట్ డుయు మీన్ అన్నాడు విజయ్ వంక కళ్ళు చిట్లించి

ఐ మీన్ వాట్ ఐసే అంటూ శామ్యూల్ వైపు తిరిగాడు విజయ్ మిష్టర్ శామ్యూల్ ఇప్పుడు మీ వంతొచ్చింది రాత్రి మీరు చూసిందేమిటో దాచకుండా చెప్పండి అన్నాడు అందరి చూపులూ శామ్యూల్ వైపు తిరిగాయి

శామ్యూల్ నుదిటిన చెమటలు పట్టాయి నేనా అబ్బే నేనేమి చూడలేదు రాత్రి రూంకి వెళ్ళిన వెంటనే నిద్రపట్టేసింది అన్నాడు తడబడుతూ

'అరగంట వరకూ మేలుకునే వున్నామన్నారు యిందాక" అడిగాడు విజయ్

"ఆ అంతే అంతే అరగంట తర్వాత పడుకున్నాను అన్నాడు శామ్యూల్

"ఓహో అయితే అరగంటలో అరవై సిగరెట్లు కాల్చి రికార్డు బ్రేక్ చేసారన్నమాట! వ్యగ్యంగా అడిగాడు విజయ్

శామ్యూల్ గుటకలు మింగసాగాడు

"రూంలోకి వెళ్ళగానే వెంటనే పడుకోలేదు కొంతసేపు మంచంమీద కూర్చునే సిగరెట్లు కాల్చాను అన్నాడు నెమ్మదిగా

"ఆ సిగరెట్ పీకలు పారెయ్యడానికి వరండాలోకి వచ్చేవారు అవునా? అడిగారు విజయ్

"అవును" . ముక్తసరిగా ఒప్పుకున్నాడు శామ్యూల్

"అలా వచ్చినప్పుడు మీకు కొన్ని ఆసక్తికరమైన విషయాలు కనబడ్డాయి . అవునా" ఆలశ్యం చెయ్యలేదు విజయ్

"అవును"

"అవేమిటో చెప్పండి"

"నేను రూంలోకి వెళ్ళిన అరగంట తర్వాత డాక్టర్ గదిలోంచి మాటలు వినిపించాయి. అందులో ఒకటి స్త్రీ కంఠం. అది మిసెస్ మైత్రేయిదని గుర్తుపట్టాన్నేను డాక్టరుతో మైత్రేయి ఏం మాట్లాడుతూందో వినాలనే ఆసక్తి పెరిగింది నాలో.. రూం బయటికి వచ్చి విన్దామనుకున్నాను కాని యింతలో మెట్లదగ్గర అలికిడైంది ప్రకాష్ మెట్లెక్కి వస్తున్నాడు నాకు మరింత సస్పెన్స్ మొదలయింది ప్రకాష్ ఎందుకొస్తున్నాడో తెలుసుకోవాలనిపించింది నా రూంలోంచే అతన్ని గమనించ సాగాను ప్రకాష్ అలానే కొంత సేపు నించుని కిందకెళ్ళిపోయాడు మరికొంత సేపటికి మైత్రేయి కూడ వెళ్ళిపోయింది ఆ తర్వాత నేను పడుక్కుండి పోయాను

అబద్ధం ఆ తర్వాత కూడ మీరు పడుకోలేదు ఆ మాటకొస్తే రాత్రంతా కూడ మీరు మేలుకునే వున్నారు మీరు మేలుకునే వున్నారనడానికి మాదగ్గర కావలసినన్ని ఆధారాలున్నాయి

ఏమిటవి? వ్యంగ్యంగా అడిగాడు ప్రకాష్

ఆ ప్రశ్న నువ్వెయ్య వలసింది కాదు శామ్యూల్ అడిగితే చెప్తాను కటువుగా అన్నాడు విజయ్

ప్రకాష్ ముఖం కందగడ్డయింది

ఆంధ్రపత్రిక పాఠకులకి చక్కటి అవకాశం!



## కళ్యాణవేదిక

ఉచిత సమాచారం



వధూవరుల సమాచారము ఉచితంగా ప్రతి బుధవారం ప్రకటిస్తాము.
సమాచారం పంపేవారు
ఈ దిగువ నిబంధనలు పాటించాలి.

★ వధువు / వరునికి సంబంధించిన వివరాలు సమగ్రంగా, అచ్చులో 150 అక్షరాలకు మించనట్లుగా తెలుగులోనే స్పష్టంగా వ్రాసి పంపాలి.

★ వధువు / వరుని తల్లిదండ్రులు, సంరక్షకులు తాము ఇచ్చే సమాచారము వాస్తవమని, ఎవరినీ కించపరిచే విషయము అందులో లేదని హామీ ఇవ్వాలి.

★ సమాచారం పంపేవారి పేర్లు వగైరా రహస్యంగానే వుంచబడతాయి. ప్రతి ప్రకటనకు ఒక బాక్సు నెంబరు కేటాయించి, వచ్చిన జవాబులు **వుచితంగానే** వాటికి సంబంధించినవారికి నెల రోజులలోపు పంపడం జరుగుతుంది.

★ ఈ శీర్షికను కుల మత వర్గ భేదాలు లేకుండా అందరూ వుపయోగించుకోవచ్చును.

★ అందిన సమాచారము ప్రతి బుధవారం అవి అందిన వరుస క్రమంలో ప్రకటించబడుతుంది. వీటిని తిప్పి పంపే ప్రసక్తి లేదు. కావున స్వంత అడ్రసు గల కవర్లు లేదా స్టాంపులు జతపర్చకూడదు.

★ ప్రకటనలు ఏవైనా అనర్హమైనదిగా తోచినపుడు వాటిని వెయ్యకుండా ఆపుచేసే హక్కు పత్రికకు వుంటుంది.

★ ఇతర విధములైన వుత్తరప్రత్యుత్తరములకు అవకాశం లేదు, ఫోటోలు పంపకూడదు.

★ సమాచారము పంపేవారు ఈ దిగువ కూపను పూర్తిచేసి, స్థానిక ఏజెంటుచే సంతకం చేయించి పంపాలి. కూపను జతపర్చనియెడల పరిశీలించబడవు.

★ కళ్యాణవేదిక శీర్షిక ద్వారా సంబంధం కుదిరి వివాహం జరిగిన వధూవరుల ఫోటోలు ఉచితంగా ఆంధ్రపత్రికలో ప్రకటించగలము. ఏ తేదీన ప్రకటన వచ్చినది తెలియచేస్తూ ఫోటోలు జతపర్చి "కళ్యాణ వేదిక ఫోటో ప్రచురణార్థం" అని వ్రాసి పంపవలెను.

### కళ్యాణవేదిక ఉచిత సమాచార కూపను

పేరు... ... ... ... ... ... ... ... ...

చిరునామా ... ... ... ... ... ... ... ...

... ... ... ... ... ...పిన్‌కోడ్... ... ...

స్థానిక ఆంధ్రపత్రిక ఏజెంటు సంతకం..................

## సాక్షి

అతని తరపున నేనడుగుతున్నాను చెప్పండి కోపంగా అన్నాడు

మిస్టర్ ప్రకాష్ నువ్విప్పుడు లాయర్ స్థానంలో లేవు ఒక ముద్దాయిస్థానంలో వున్నావ్ ఒక సాక్షి తరపున వకాల్తా పుచ్చుకునే అధికారం కూడ నీకు లేదు అని ప్రకాష్‌కి విసురుగా సమాధాన మిచ్చి తిరిగి శామ్యూల్ వంక చూసాడు విజయ్ చెప్పండి శామ్యూల్ రాత్రి మీరు చూసిందంతా చెప్పండి లేకపోతే ఈ హత్య మీరూ ప్రకాష్ కలిసి చేసారని మేమనుకోవలసి వస్తుంది అన్నాడు

నో నో ఈ హత్యతో నాకు సంబంధం లేదు అతను హత్య చేస్తుండగా నేను వెనకున్నానన్న సంగతి కూడ అతనికి తెలీదు గాబరాగా అనేశాడు శామ్యూల్ అనేసి నాలిక్కరచుకున్నాడు అందరూ మరోమారు ఉలిక్కిపడ్డారు

విజయ్ రిలాక్సింగ్‌గా కుర్చీలో వెనక్కి జారపడ్డాడు

ఇప్పుడు చెప్పండి శామ్యూల్ మీరేమిటి చూసారో అన్నాడు ప్రశాంతంగా

శామ్యూల్ తీవ్రంగా వణకసాగాడు ఓ మారు బయంగా ప్రకాష్ వంక చూసాడు ప్రకాష్ చూపులు తీవ్రంగా డీకొన్నాయతన్ని వాటిని చూడలేక తల పక్కకి తిప్పేసుకున్నాడు శామ్యూల్

విస్కీ అన్నాడు నీరసంగా విజయ్ వంక చూస్తూ

విజయ్ ఓ గ్లాసులో సగం వరకు విస్కీపోసి, ఐస్ క్యూబ్స్ వేసి అతని కందించాడు అంతా ఒక్క గుక్కలో తాగేశాడు శామ్యూల్ అయిదు నిమిషాల తర్వాత అతనిలో వణుకు తగ్గింది ప్రకాష్ వంక ఓ మారు అసహ్యంగా చూసి విజయ్ వైపు తిరిగాడతను

మీరు చెప్పింది అక్షరాల నిజం! ప్రకాషే ఈ హత్య చేసాడు అంతా మీరు చెప్పిన విధంగానే అతను హత్య చేయడం నేను కళ్ళారా చూసాను అన్నాడు ఒకొక్కమాటే ఒత్తి పలుకుతూ

ఒక్క ఉదుటున కుర్చీలోంచి లేచాడు ప్రకాష్, బల్ల మీద గట్టిగా చేత్తో గుద్దాడు

నాన్సెన్స్ అంతా కట్టుకథ మీరంతా కలిసి నన్నీ కేసులో యిరికించ లని ఆడుతున్న గూడుపుఠాని అంటూ గట్టిగా అరిచాడు

అయితే మీరసలు రాత్రి డాబా మీదకి వెళ్ళనే లేదా? అడిగాడు విజయ్

రాత్రే కాదు నేనీ యింటికి వచ్చిన తర్వాత ఒక్కసారి కూడ డాబా మీదకి వెళ్ళలేదు అన్నాడు ప్రకాష్ ఆవేశంగా

ఓ ఐసీ చిన్నగా నవ్వేడు విజయ్ కాని మీరు డాబామీదకి వెళ్ళినట్టు ఋజువు చేస్తే?

విజయ్‌ని మింగేసేటంత కోపంగా చూసాడు ప్రకాష్

యు ఆర్ ఎ డెవిల్ గో ఎహెడ్ అన్నాడు కుర్చీలో కూర్చుంటూ

విజయ్ గొంతు సవరించుకున్నాడు

మిస్టర్ ప్రకాష్ ఉదయం మీ గదిలో జరిగిన సంభాషణలో మీరు లియొనార్డో ని ఎక్కువగా స్టడీ చేసా నన్నారు గుర్తుందా? కాబట్టి లియొనార్డో చిత్రానికి ఫినిషింగ్ టచెస్ ఎలా యిస్తాడో కూడ మీరు బాగా స్టడీ చేసి వుంటారని నేనూహించాను నేనుకూడ లియొనార్డో గురించి కొద్దిగా విన్నాను అతను చిత్రానికి ఫినిషింగ్ టచెస్ యిచ్చేటప్పుడు ఎడంచేత్తో బ్రష్ పట్టుకుని కుడిచేతి బొటన వేలితో చిత్రానికి టచెస్ యిస్తాడు నిన్న రాత్రి మైత్రేయి చిత్రానికి ఫినిషింగ్ టచెస్ యిస్తున్నప్పుడు మీరు కూడ యిదే పద్ధతిని అనుసరించేరు ఉదయం చిత్రం చూస్తున్నప్పుడు నేనీ విషయాన్ని గమనించాను మీ అలవాటే మిమ్మల్ని పట్టిచ్చింది మీరు వేసింది ఆయిల్ పెయింటింగ్ వాష్ బేసిన్ దగ్గర మీరెంత శుభ్రంగా కడుక్కున్నా మీ వేళ్ళ కంటుకున్న రంగు పూర్తిగా తొలగిపోలేదు డాక్టర్‌ని హత్య చేయడానికి వెళ్ళినప్పుడు డాబామీద తలుపు తెరిచే వుంది కాబట్టి మీ వేలిముద్రలు పడే అవకాశం లేదు కాని మీ వెనకే డాబామీదకి రాబోయిన శామ్యూల్ మీరు డాక్టర్‌ని హత్య చేయడం చూసి బయంతో బిగుసుకు పోయాడు ఆ కంగారులో అతను తలుపు దగ్గరగా వేసేసి వచ్చేశాడు ఆ సమయంలో ఆకాశం ఉరుముతూండడం చేత డాక్టర్ కిందపడిన చప్పుడు కాని, శామ్యూల్ తలుపు దగ్గరగా వేసిన చప్పుడుకాని ఎవరికీ వినబడలేదు వెనక్కి తిరిగి వచ్చిన మీరు తలుపు గాలికి పడిపోయిందనే ఉద్దేశంతో కుడిచేత్తో డోర్‌ని తెరుచుకుని వచ్చేశారు తిన్నగా డ్రాయింగ్‌హాల్‌ని క్రాస్ చేసి కల్యాణ్ చెప్పుల్ని షెల్ఫులో పెట్టేసి నిబ్బరంగా మీరూంలోకి వచ్చి పడుకున్నారు కాని మిస్టర్ ప్రకాష్ డాబామీద డోర్ తెల్లటి సన్మైకాతో చేయబడింది దానిమీద మీ వేలి ముద్రలు స్పష్టంగా తిరుగులేకుండా పడ్డాయి మీరు రాత్రి ఏఏ రంగులతో చిత్రానికి టచెస్ యిచ్చేరో ఆ రంగులే డోర్‌మీద పడ్డ వేలి ముద్రల్లో వున్నాయి కాబట్టి రాత్రి మీరు డాబామీదకి వెళ్ళేరన్న సంగతి స్పష్టమవుతూంది

(ఇంకావుంది)

బొమ్మన్









# మనసు కిచ్చిన మాట





విశ్వనాథ రమ

రింగ్ డోర్ తెరుచుకొని అప్పుడే లోపలికి వస్తున్న కోమలని చూసి ఒక్క క్షణం ఆశ్చర్యపోయి వెంటనే లేచి హాయ్ అంటూ ఆప్యాయంగా కౌగలించుకొంది డాక్టర్ లత

మెరిసే కళ్ళతో తృప్తిగా ఆమె వైపు చూసి అక్కడున్న కుర్చీలో కూర్చుంది కోమల

ఏవిటి విశేషం? ఇంత సడన్‌గా వచ్చావ్? కుతూహలంగా అడిగింది లత

ఏంలేదు నిన్ను చూద్దామని అనిపించింది మా హాస్పిటల్లో ఈ మధ్యనే ఇంకొక డాక్టర్ని కూడా వేసారు ఇప్పుడు కొంచెం పని తక్కువగా ఉంది అందుకే ఇవాళ లీవ్ పెట్టి వచ్చేసాను ముంగురులు సవరించుకొంటూ అంది

అదేవిటి! నేను ఇంకొక కారణం చెపతావను కొన్నాను అసలు కారణం దాస్తున్నా వేంటి? కళ్ళల్లోకి సూటిగా చూస్తూ అంది

ఆ మాటలకి కోమల మొహం ఎఱ్ఱ కలువలా మారింది సిగ్గుగా తలదించుకొని టేబిల్‌మీద చేత్తో గీస్తూ అంది

అమ్మ దొంగా! నాచేత చెప్పించాలనా! నీకు తెలీదేంటి? బుంగమూతి పెడుతూ అంది

కోమల మొహంలో కనిపించే తళుకులు గమనిస్తూ అంది లత నిన్ననే డాక్టర్ అశోక్ ఢిల్లీ నుండి వచ్చాడట ఇవాళ మెడికల్ కాలేజీలో అతనికి సన్మానం సాయంకాలం కాలేజీలో కాన్ఫరెన్స్ కూడా ఏర్పాటు చేస్తున్నారు అశోక్ ఉదయం నాకు ఫోన్ చేసాడు నీకు ఈ విషయాలు చెప్పమని పైగా సాయంకాలం తప్పకుండా కాలేజీకి నిన్ను తీసుకొని రమ్మన్నాడు అన్నట్లు ఈ విషయాలు అన్నీ ఉత్తరం ద్వారా నీకు ముందే తెలుసుకాబోలు చిరునవ్వుతో కొంటిగా అంది

తెలుసన్నట్లుగా తలూపి కోమల అశోక్‌ని చూడాలని నా మనసెంతో తహతహలాడుతోందో తెలుసా లతా! ప్రతిక్షణం అతని రూపం కళ్ళముందు తారసలాడు తూంటే ఆయన చెప్పిన మాటలు తలుచుకొంటూ నా కర్తవ్యాన్ని అమలుపరచేదాన్ని ఒక్కొక్కప్పుడు ఎందుక ఒంటరిబతుకు ఈ అడవిలో అనుకొనే దాన్ని కాని నెలకొకసారి అశోక్ వ్రాసే లెటర్స్ నన్ను ఎంతో ఉత్తేజపరిచేవి

ఒక రోజు ఏమైందో తెలుసా! ఆ రోజు బాగా వర్షం పడింది ఎక్కడా లైట్లు లేవు నా క్వార్టర్‌లో కొవ్వొత్తులు మాత్రం మిణుకు మిణుకు మంటూ వెలుగుతున్నాయి రాత్రి పది గంటలు దాటింది ఒక కొండ జాతి పిల్ల దివిటి పట్టుకొని తలుపులు దబదబమంటూ బాదడం మొదలెట్టింది

నేను భయంగా తలుపు తీసాను రొప్పుతూ చెప్పింది దాని భర్తకి వాంతు లవుతున్నాయట వెంటనే పెట్టె పట్టుకు రమ్మని జబర్దస్తీగా అన్న దాని మాటలు చూసి ఇంత రాత్రి వేళ రానని చెప్పాను అప్పుడు కోపంగా నన్ను ఎన్ని మాటలంది తెలుసా! ఆఖరికి దాని వెంట వెళ్ళక తప్పలేదు ఒక్కొక్కప్పుడు ఇలాంటి విషయాలు జరుగుతూంటే ఇక్కడికి వచ్చేయాలని పిస్తుంది కాని క్రమంగా వాళ్ళని అర్థం చేసుకొంటున్నాను భారంగా నిట్టూర్చి అంది

స్నేహితురాలి వైపు జాలిగా చూసింది లత

ఎందుకో ఆ కొండలూరు వెళ్ళడం చెప్పి ఒక్కర్తివి ఆ అనాగరిక జనం మధ్య మసలడం బాధగా అంది

చూడు లతా! ఆ కుగ్రామంలో ప్రజలు నేను వెళ్ళే వరకు పసర్లు, గింజలతోనే తమ వైద్యం తాము చేసుకొనే వాళ్ళు తర్వాత ప్రతి నొప్పికి ఇన్ని మందు లుంటాయని తెలిసి బాగా ఆశ్చర్య పోయేవాళ్ళు

తర్వాత తర్వాత వాళ్ళల్లో మార్పు తేగలిగాను

మనలో ప్రతి ఒక్కరం ఎందుకి ఊళ్ళు వెళ్ళడం అనుకొంటే ఈ దేశంలో సిరంజి అంటే కూడా తెలియని మనుషులు ఎంత మందో! ఆవేశంగా అంటున్న ఆమె మాటలు వింటూ సాలోచనగా ఉండిపోయింది లత

కిటికీలోంచి కనిపిస్తున్న సముద్రపు కెరటాలు ఉవ్వెత్తున పైకెగిసి ప్రవాహంలో కలిసి పోతున్నాయి ఆ ఒడ్డున చంటిపిల్లలు కేరింతలు కొడుతున్నారు దూరంగా సముద్రం నింగితో కలిసినట్లుగా కనిపిస్తూ గంభీరంగా ముందుకి ఉరుకుతోంది

ఆ దృశ్యాన్ని అలా రెప్ప లార్పకుండా చూస్తుండి పోయింది కోమల ఈ సముద్రానికి అశోక్‌కు తనకి ఎంత అనుబంధం ఉండేది అశోక్‌తో పరిచయం అయిన దగ్గర నుండి ఇద్దరూ కలిసి రోజూ బీచ్‌కి వచ్చేవాళ్ళు

తన ఒడిలో పడుకొని సముద్రపుగాలి శరీరాన్ని తాకుతూంటే మైమరచి భవిష్యత్ గురించి ఎన్ని కబుర్లు చెప్పేవాడు అతని తలలోకి చేతులు పోనిస్తూ ఆయన మాటలు పాఠాలు నేర్చుకొన్న శిష్యురాలిలా వినేది

కోమలా! నా ధ్యేయం ఒక్కటే డబ్బు కోసం బతుకు తెరువు కోసం ఈ చదువు నాకు చదవాలని లేదు మన దేశంలో మన వైద్య సదుపాయాలు ఇంత

ఇంకా అనాగరికంగా తమ వైద్యాన్ని తామే చేసుకొంటూ వచ్చే జబ్బులు తమకు శాపంగా భావించి బతుకు వెళ్ళదీస్తున్న కొండజాతి ప్రజలు, అటవీకులు ఎంత మందో ఎన్ని ప్రయాసల కోర్చినా సరే ఆ కుగ్రామాలకి వెళ్ళి వైద్యం చేయాలని నా సంకల్పం ఉద్వేగంతో అంటూ ఆమె చెయ్యి అందుకొన్నాడు

కోమలా! ఇది నా మనసులో మాట మన పెళ్ళయ్యాక నా ధ్యేయానికి అడ్డురాకుండా ఆ ఊర్లులో ఉండడానికి ఇష్టపడతావా?

ఆ మాటకి పూరెమ్మలా చిన్నగా వణికింది తను

అదేంటి అశోక్! నీ మనసులో మాట నా మాట కాదా! నీవు పక్కనుంటే ఎలాంటి అడవులోకి రమ్మన్నా వస్తాను నీవు ఒక్క క్షణం కనిపించకపోతే ఎంత తల్లడిల్లి పోతానో తెలుసా? ఆవేదనగా అంది తను

గతం తాలుకు జ్ఞాపకాల పొరలు కళ్ళముందు కదలాడు తూంటే లత పిలుపుకి ఒక్కసారిగా వాస్తవంలోకి వచ్చింది కోమల టైమ్ పన్నెండవుతోంది ఇంటికి వెళదాం పద! అంటూ కుర్చిలోంచి లేచింది లత చిరునవ్వుతో ఆమెను అనుసరించింది కోమల

* * * *

ఆ మధ్యాహ్నం భోజనం చేసి పడుకుంటే కాని ఎంత ప్రయత్నించినా నిద్ర రాలేదు కోమలకి ఆలోచనలు జోరీగల్లా తలలో ముసురు కొంటున్నాయి తను అశోక్‌ని చూసి నాలుగేళ్ళు దాటుతోంది తను మెడిసిన్ ఐదవ సంవత్సరంలో ఉండగా అశోక్ అమెరికా వెళ్ళిపోయాడు మెడిసిన్ ప్రతీ సంవత్సరంలోను గోల్డుమెడల్ సంపాదించి ప్రొఫెసర్లు కూడా ఆశ్చర్యపడేటట్లు థీసిస్‌లు సబ్‌మిట్ చేసేవాడు

అతడు అమెరికా వెళ్ళిపోతున్నానని చెప్పినపుడు ఆశ్చర్యంగా అనుమానంగా అతని వైపు చూసింది తన అనుమానాన్ని గమనించిన అతను చిన్నగా

# మనసు కిచ్చిన మాట

నవ్వి కోమలా! ఇక్కడ తెలుసుకోలేని విషయాలు ఎన్నో అక్కడ తెలుసుకోవచ్చు నా పరిశోధనకి ఆ వాతావరణం ఎంతో అనువైనది అక్కడ సెటిలవడం నా ఉద్దేశ్యంకాదు అవకాశాన్ని వినియోగించుకొని అక్కడుండి తర్వాత ఇక్కడికి వచ్చేస్తాను దృఢంగా అంటున్న అతని మాటలకి మరి ఎదురు చెప్పలేక పోయింది

అశోక్! నీ ధ్యేయం ఏమిటి? కృషి చేస్తే అవకాశాలు రాకపోవు కాని మనసుని చంపుకొని మాటల విలువలు మార్చి ఎంత ఉన్నత శిఖరాలు చేరినా వ్యక్తిత్వానికి మాలిన్యం అంటక తప్పదు అంటూ ఇంకా ఎన్నో అతనితో చెప్పాలను కొంది కాని ఈ మాటలన్ని తన నోట్లోనే సమాధి అయ్యాయి

ఆ మర్నాడు మౌనంగా ఏరోడ్రోమ్‌లో అతనికి వీడ్కోలు చెప్పి భారంగా ఇంటికి వచ్చేసింది హౌస్ సర్జన్ అయ్యాక గవర్నమెంటు డాక్టర్‌గా కొండలూరులో ఉద్యోగం వచ్చింది ఇంట్లోవాళ్ళు ఫ్రెండ్స్ ససేమిరా ఆ ఊరు వెళ్ళడానికి ఒప్పుకోలేదు కాని ఒకనాడు తన గుండెల్లో బలంగా నాటుకొన్న అశోక్ మాటలు చెరగని ముద్ర వేసాయి ఎలాగైనా ఆ ఊరు తను వెళ్ళాలని నిశ్చయించు కొంది అతని ధ్యేయాన్ని తను సవాల్‌గా తీసుకోవాలను కొంది అందుకే వెంటనే వెళ్ళి అక్కడ జాయిన్ అయింది

కొండజాతులు విస్తారంగా ఉన్న కుగ్రామం అది మొదట అక్కడ అందరూ ఒక దేవతలాగ చూసేవాళ్ళు ఇక్కడికి ఏ డాక్టర్ వచ్చినా వెంటనే బదిలీ చేయించుకొని వెళ్ళిపోయేవారు మీరు కూడా ఉండకుండా వెళ్ళిపోతారా? అంటున్న వాళ్ళ మాటలు చూసి బాధ జాలి కలిగేవి అనాగరికంగా వాళ్ళు ఉపయోగించే నాటు మందులు ఎంతో సహనంతో మాన్పగలిగింది ఈ మందు బిళ్ళకి నొప్పి తగ్గిపోద్దా! అంటూ ఆశ్చర్యపోతున్న వాళ్ళని చూసి

గుండె చెరువయ్యేది ఈ దేశంలో కనీస వైద్య సదుపాయాలు కూడా తెలీని మనుషులు ఎంత మందో? మనసు బాధగా మూలిగేది

కోమలా! నిద్రపోతున్నావా! ఆలోచిస్తున్నావా? గట్టిగా కుదుపుతూ లత పిలుస్తూంటే జరిగిన సంఘటనలు నెమరు వేసుకొంటున్న కోమల కళ్ళు విప్పింది

ఎదురుగా కాఫీ కప్పుతో లత 'కప్పు' అందుకొంటూ చిన్నగా నవ్వింది నా గురించి అంటున్నావు కాని నువ్వసలు రెస్ట్ తీసుకోవా! వచ్చిన దగ్గర నుండి చూస్తున్నాను పనితో గొప్ప హడావుడి పడిపోతున్నావ్!

ఏం రెస్ట్ లేవే! రాక రాక నీవొస్తే మర్యాద చెయ్యకపోతే వెనకాల అనుకోవూ! గడుసుగా కళ్ళు తిప్పుతూ అంది

ఆ మాటలకి కోమల పడిపడి నవ్వుతూంటే లత కూడా శృతి కలపకతప్పలేదు

* * * *

కాన్ఫరెన్సు హాలు మెడికల్ కాలేజి ప్రొఫెసర్లు, స్టూడెంట్స్‌తో కిటకిట లాడుతోంది ప్రత్యేకమైన ఆహ్వానంమీద వచ్చిన డాక్టర్లు స్పెషలిస్టులు కూడా ఎంతో మంది ఉన్నారు

కోమల ఇంటి దగ్గర ఎంత ఉత్సాహంగా బయలుదేరిందో ఆ ఉత్సాహం అంతా నీరుకారి పోయింది ఆ హాలులోకి వచ్చేసరికి హాలంతా చాల గొడవగా ఉంది ఎవరికిష్టం వచ్చినట్లు వాళ్ళు మాట్లాడుకోసాగారు

సమావేశం ఇంకొక ఐదు నిమిషాలలో ప్రారంభం అవుతుందనగా గ్రేకలర్ సూటులో హాల్లోకి వచ్చాడు డాక్టర్ అశోక్ తర్వాత మెడికల్ కాలేజి ప్రిన్సిపాల్ మిగిలిన పెద్దలు విచ్చేసారు

వెంటనే హాలులో గొడవ సద్దు మణిగింది కోమల కళ్ళు సూటిగా అతన్నే చూస్తున్నాయి ఎత్తుగా బలిష్ఠంగా బాగా రంగుతేరి అమెరికన్‌లాగ కనిపిస్తున్నాడు అశోక్ అతని చూపులు నిర్లక్ష్యంగా ఉండి ఎటో చూస్తున్నాయి

ఆ క్షణంలోనే అతని పరిస్థితి అంచనా వేయగలిగింది కోమల అశోక్ ఇప్పుడు అమెరికా నుండి వచ్చినవాడు ఇండియానుండి అమెరికా వెళుతున్న అశోక్‌కు ఇప్పటి మనిషికి బాగా తేడా ఉంది

ఒక్కసారిగా మనసులో ఏదో అలజడి బాధా తరంగాల రావిడి గుండెలో ఎక్కువై చిన్నగా ఆమె శరీరం కంపించింది అది కొన్ని క్షణాల మాత్రమే తర్వాత క్రమంగా తేరుకొంది హాల్లో ఎవరెవరో మాట్లాడుతున్నారు అవేవీ కోమల శరీరాన్ని చల్లబరచటం లేదు ఒంట్లో వేడి లావాలా బయటకి జిమ్ముతోంది

తనను తాను నిలదొక్కడం కోసం గట్టిగా కళ్ళు మూసుకొంది అశోక్ గొంతు హాలులో ప్రతిధ్వనిస్తోంది మన దేశంలో కన్నా విదేశాలలో సైంటిస్ట్‌లకి డాక్టర్స్‌కి ఎక్కువ విలువ ఉంటుంది కారణం వాళ్ళు ప్రతిభ యొక్క గొప్పదనాన్ని



శ్రీరస్తు – శ్రీ త్రిపురసుందరీ వరశివాభ్యాంనమః

త్వరలో వెలువడుతుంది

# ఆంధ్రపత్రిక

త్వరలో వెలువడుతుంది

## శ్రీ క్షయ నామ సంవత్సర పూర్ణశాస్త్రీయ పంచాంగము



'దైవజ్ఞచిన్తామణి' శ్రీ పిడపర్తి చినకృష్ణమూర్తిశాస్త్రి,

'భాషాప్రవీణ' శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రి సిద్ధాన్తి సోదరులచే గుణింపబడినది.

ఆంధ్రపత్రికా కార్యాలయము

ప్రతి 1-కి రూ. 5-00




**కె ఎ ఆర్, గుంటూరు**

నా కాళ్ళుకొంచెం వంగి వున్నాయి 'విటమిన్ డి' లోపం వలన వచ్చే 'ఆస్టియోమలేసియా అని బావిస్తున్నాను తిరిగి తిన్నగా రావటానికి ఎక్సర్‌సైజులాంటి పద్ధతులేమన్నా వున్నాయా? అవి యింకా ఎక్కువ బెండ్ కాకుండా వుండానికి ఏం చెయ్యాలి?

మీరు ఆర్థోపీడిక్ స్పెషలిస్ట్‌లను సంప్రదించి వారి సలహా ప్రకారం చికిత్స చేయించుకోవటం మంచిది

**జి వై ఆర్ ఆదోని**

నాకు రెండు సం లుగా గుండె దగ్గర నొప్పి వస్తోంది ఈ నొప్పి ఉదయం పూట తీవ్రంగా ఉంటుంది అన్నము జీర్ణముకాదు నేను రోజూ యోగాభ్యాసము చేస్తాను వ్యాయామము మోటుగా అభ్యసించినందువల్లనే ఈ నొప్పికి కారణము అని అనుమానముగా ఉన్నది బీరు త్రాగితే గుండె జబ్బులు రావని, ఆరోగ్యప్రదమని విన్నాను వారానికి ఒక రోజు బీరు త్రాగాలని అనుకొంటున్నాను ఈ వయస్సులో బీరు త్రాగితే శరీరానికి హానికరమా? బీరు త్రాగితే ప్రయోజనము ఉన్నదా!

వ్యాయామానికి కడుపు నెప్పికీ సంబంధంలేదు డాక్టర్ల చేత పరీక్ష చేయించుకుని కడుపులో పుండు వంటిది ఉన్నదీ లేనిదీ తెలుసుకోవటం మంచిది

బీరు త్రాగటం వల్ల పెద్దగా ఏ ప్రయోజనమూలేదు

**జి ఎల్ ఎన్. కొండపల్లి**

మా తాత వయస్సు 70 సం మా తాతకు అతి మూత్ర వ్యాధి ఉంది ఈ వ్యాధి వచ్చి 8 నెలలు అవుతుంది కంటి చూపు తగ్గింది ఒక వస్తువు రెండు వస్తువులుగా కనపడుతుంది అని అపుడపుడు అంటారు

డయాబెటిక్ రెటినోపతీ అనేది అతి మూత్ర రోగం ఉన్నవారికి కళ్ళలో కలిగే మార్పు దీనికి నేత్ర వైద్యుల సహాయం, డయాబెటిక్ స్పెషలిస్టుల సహాయం అవసరం వీరిరువురి దగ్గరికీ మీ తాతగారిని తీసుకువెళ్ళి చికిత్స చేయించటం చాలా అవసరం!

**కె యస్–బళ్ళారి**

నా వయస్సు 20 సంవత్సరములు నా ముక్కు పొడవుగా పైకి లేచి యున్నది నలుగురెదుట నవ్వాలన్నా ముక్కు చాలా అసహ్యంగా కనబడుచున్నది మేము ప్లాస్టిక్ సర్జరి చేయించే స్థితిలో లేము

ప్లాస్టిక్ సర్జరి ద్వారా తప్ప ఇతర పద్ధతులేవీ దీనికి లేవు

**వై. యస్–హాస్‌పేట**

నా వయస్సు 61 సంవత్సరములు నాకు వివాహం కాక పూర్వం అంటే 21 సంవత్సరముల వయసులో వ్యాది వచ్చినది తర్వాత కొద్ది నెలల తేడాలో రెండు మూడు సార్లు వచ్చినది ఇంజెక్షన్స్‌తో బాగు చేయించినాను మళ్ళీ కొద్ది నెలలలో గనేరియా వచ్చినది దానిని కూడా బాగు చేయించాను సుమారు సంవత్సరం క్రితం నాకు పూర్తిగా మూత్రం రాకుండా ఆగిపోయినది ట్యూబు ఎక్కించి తీసినారు తర్వాత బాగానే వస్తున్నది

మీకు గొనోరియా అనే సుఖరోగం ఉన్నందు వల్ల ఇలా మూత్రవిసర్జనలో అవరోధం ఏర్పడుతుంది కొన్నాళ్ళ పాటు బాగున్నా మళ్ళీ పరిస్థితి యధాప్రకారం అవుతుంది. శస్త్ర చికిత్స నిపుణులను కలసి వారి సలహా పొందండి □

## మనసు కిచ్చిన మాట

గుర్తిస్తారు పరిశోధనలకి అనువైన సదుపాయాలు సహాయం అక్కడ పుష్కలంగా లభిస్తుంది ప్రతి ఒక్కరూ తమ పరిశోధన కోసం విదేశాలు వెళ్ళడం ఎంతైనా అవసరం అంటూ తన పరిశోధన గురించి క్లుప్తంగా చెప్పి తన ఉపన్యాసం ముగించాడు వేద వాక్యాలు విన్నట్లుగా జనం యొక్క చప్పట్లతో హాలు మారు మ్రోగింది

ఆఖరిగా ప్రిన్సిపాల్ లేచి ఆడియన్స్‌లో ఎవరైనా వచ్చి మాట్లాడవలసిందిగా కోరాడు ఆ మాటలకి ఏదో చైతన్యం వచ్చినట్లుగా లేచి మంత్ర ముగ్ధలా వేదిక పైకి నడిచింది కోమల అశోక్ సంభ్రమాశ్చర్యంతో ఆమె వంకే చూడసాగాడు

ఫ్రెండ్స్! ఈనాడు ప్రతి స్టూడెంట్ చదువు పూర్తికాగానే స్టేటస్ కోసం డబ్బు కోసం విదేశాలు వెళ్ళడం పరిపాటి అవుతోంది మన ప్రభుత్వం మన చదువు కయ్యే ఖర్చు భరిస్తుంటే మనం మాత్రం మన సేవను పరదేశాలకి అంకితం చేస్తున్నాం మన దేశంలోనే వైద్య సదుపాయం లేని చీకటి గ్రామాలు ఎన్నెన్నో ఆ చీకటి ప్రజలలో చిరుదివ్వెలు వెలిగించాలంటే ప్రతి స్టూడెంట్ తమ సేవని ఆ ప్రజలకి అంకితం చేయాలి ఇదే నా అభిలాష! కూర్చుంది

ఒక్క క్షణం హాలులో నిశ్శబ్దం ఆవరించి వెంటనే కరతాళధ్వనులతో హాలు మారు మ్రోగింది అందరూ ప్రశంశగా కోమల వైపు చూసారు కాన్ఫరెన్స్ పూర్తి అయినట్లుగా వందన సమర్పణ జరిగింది

* * * *

బయటికి వచ్చినప్పుడు లత ఆశ్చర్యంగా అడిగింది, ఎందుకలా అశోక్‌కి రివర్స్‌గా చెప్పావ్? ఆయన ఏమనుకొంటారు? అని అప్పుడనిపించింది కోమలకి అవును అశోక్ ఎమనుకుంటాడు? అని సరిగ్గా అప్పుడే చేయి ఊపి వస్తూ అశోక్ కనిపించాడు

అతను దగ్గరగా వస్తుంటే కోపం అంతా హరించిపోయి తనివితీరా అతన్నే చూడసాగింది

అశోక్ వాళ్ళ దగ్గరకి వచ్చి ప్రేమగా కోమల చేయి అందుకొన్నాడు మిస్ లతా! కోమలా నేను అలా బీచ్ వైపు వెళ్ళొస్తాం అభ్యర్ధనగా అన్నాడు

ఒకె ఒకె అంటూ కోమలని విడిచి కారు స్టార్ట్ చేసింది లత

పట్టుకొని గబగబా ఇసుక తిన్నెలమీదకి అతను లాక్కెళుతూంటే హుషారుగా అడుగులు వేసింది కోమల ఒక రాతి పక్కగా కూర్చున్నారిద్దరూ

స్పీచ్ బాగా ఇచ్చావ్! కాని ఎందుకంత కోపం నామీద? ఆప్యాయంగా అడిగాడు

కోపం! ఎందుకు? ఎవరిమీద! ఆశ్చర్యంగా అంటూ నా మనసులోని మాట అది! కాదు కాదు నా ప్రాణస్నేహితుడు ఒకనాడు నా గుండెలో నాటిన మాటలు చెప్పాను అంతే! అంటూ ఆగింది గుండెలోంచి తన్నుకొస్తున్న దుఃఖం ఇంక ఆగలేక పోయింది అతని ఒడిలో తల దూర్చి చిన్నపిల్లలా ఏడ్వసాగింది

వెంటనే అతడు ఆమెను పొదివి పట్టుకొని కన్నీరు తుడుస్తూ, కోమలా! నిన్ను ఎలా అభినందించాలో తెలీటం లేదు నా ధ్యేయాన్ని నీవు అమలుపరచి నాకు కనువిప్పు కలిగించావు నీ వ్యక్తిత్వం గురించి చెప్పడానికి బాష చాలడం లేదు ఇంక ఒంటరిగా నిన్ను అక్కడికి వెళ్ళనివ్వను ఆ చీకటి గ్రామాల్లో చిరుదీపాలు వెలిగించడానికి మనిద్దరం కలిసి వెళదాం నిజం! అంటూ ఆమె చేతిలో చెయ్యి వేసాడు వేద మంత్రాలు విన్నట్లుగా అతన్ని

## తెలుగుదేశం పార్టీకి గుణపాఠం!

ఫిబ్రవరి 15వ తేదిన జంటనగరాలలో జరిగిన హైదరాబాద్ మునిసిపల్ కార్పొరేషన్ ఎన్నికలలో మజ్లిస్ ఇత్తెహాదుల్ ముసల్మీన్ 37 స్థానాలు సంపాదించడం పంచతంత్రం కథలు తెలిసిన వారికి ఆశ్చర్య మేమీకాదు ఇద్దరు పోట్లాడితే మూడో వానికి లాభం అనేది ప్రపంచ మెరిగిన రాజనీతి తెలుగుదేశం నాయకులు లోగడ విదాన సబ ఎన్నికలలో చూపిన రాజనీతిజ్ఞతను ఈ ఎన్నికలలో చూపలేకపోవడం, విధాన సభ ఎన్నికలలో సహకరించిన మిత్రపక్షాలను దూరం చేసుకోడం ఈ పరిస్థితికి కారణం మునుపటి లాగే మిత్ర పక్షాలతో ఉమ్మడి కార్య క్రమంపై ఒప్పందం చేసుకొని వుంటే సులబంగా మెజారిటి వచ్చేది వోట్లు చీలిపోకుండ చూడడం గెలుపునకు మూల బంధం జంటనగరాల లో 15 లక్షల 16 వేల మంది వోటర్లు వున్నారు 1964లో కార్పొరేషన్ ఎన్నికలు జరిగాయి 1970లో కార్పొరేషన్ రద్దయింది తర్వాత 16 సంవత్సరాలకు తొలిసారిగా ఈ ఎన్నికలు జరిగాయి 100 స్థానాలకు 742 మంది పోటి చేశారు గుల్జార్ హౌస్ డివిజనులో 18 మంది పోటి చేశారు ఒక్క కాజీపురా డివిజనులో మాత్రమే ముఖాముఖి పోటి జరిగింది మజ్లిస్ 37 స్థానాలు, 'కాంగ్రెస్ 24 స్థానాలు, తెలుగుదేశం పార్టీ 24 స్థానాలు, బారతీయ జనతా పార్టీ 12 స్థానాలు, మార్కిస్ట్ పార్టీ ఒక స్థానం సంపాదించాయి ఒక ఇండిపెండెంటు గెలిచాడు విధాన సభ ఎన్నికలలో మజ్లిస్ నగరంలోని ఐదు స్థానాలు, తెలుగుదేశం మిత్రపక్షాలు ఏడు స్థానాలు, కాంగ్రెస్ కేవలం ఒక్కస్థానం సంపాదించాయి దీనినిబట్టి మజ్లిస్ స్థానాల వోట్లు సామాన్యంగా చీలక పోవడం, తక్కిన స్థానాల వోట్లు చీలడం గుడ్డివాడు విసిరిన రాయిలాగ ఎవరో గెలవడం సంభవించింది కనుకనే శ్రీ ఓవైసీ హైదరాబాద్ హమారా మేయర్ హమారా –అని ధీమాగా అనగలిగాడు తెలుగుదేశం పార్టీ ఇకముందైనా, మిత్ర పక్షాల సహకారం విషయంలో శ్రద్ధ చూపగలదనవచ్చు ఎంత వారికైనా చిన్నవారి సహకారం అవసర మవుతుంది పంచతంత్రంలో చెప్పిన సింహం ఎలుక కథ దీనికి ఉదాహరణ తెలుగుదేశం పార్టీకి తక్కువ స్థానాలు వచ్చినంత మాత్రాన దాని విధానాలను జంటనగరాల పౌరులు తిరస్కరించినట్లు కాదు జంట నగరాలలో రోడ్ల విశాలీకరణ ఉద్యానాల నిర్మాణం, రోడ్ల మరమ్మత్తు, మంచినీటి కోసం గొట్టపు బావుల ఏర్పాటు వంటి కార్యక్రమం 20 ఏళ్లలో జరగనిది ఈ రెండేళ్లలో జరిగిందని జంటనగరాలలోని ప్రతి పౌరుని అంతరంగానికి తెలుసు కాని ఎన్నికలు క్రికెట్ క్రీడ వంటివి జయాపజయాలు ఎన్నో కారణాలుగా సంబవిస్తుంటాయి కార్పొరేషన్ ఫలితాలు తెలుగుదేశం పార్టీ నాయకులకు కనువిప్పు కాగల వనడం నిస్సందేహం

## హైదరాబాదు నోట్‌బుక్

### అలా చేస్తే ఎంత బాగుండేది?

పోతన బాగవతం హిందీ అనువాదం ఆవిష్కరణ ఫిబ్రవరి 5వ తేది సాయంకాలం శ్రీకృష్ణ దేవరాయాంధ్ర బాషా నిలయంలో జరిగింది ఆంధ్రప్రదేశ్ మాజీ ముఖ్యమంత్రి డాక్టర్ ఎం చెన్నారెడ్డి గ్రంథాన్ని ఆవిష్కరించారు అధికార బాషా సంఘం అధ్యక్షులు డాక్టర్ కొత్తపల్లి వీరబద్రరావు అధ్యక్షత వహించారు ఉస్మానియా విశ్వవిద్యాలయం హిందీ శాఖ మాజీ అధ్యక్షులు ఆచార్య రాంనిరంజన్ పాండే ఉస్మానియా విశ్వవిద్యాలయం సంస్కృత శాఖ ఆచార్యులు డాక్టర్ ప్రమోద్ గణేశ్ లాల్యే శ్రీకృష్ణ దేవరాయాంధ్ర బాషానిలయం అధ్యక్షులు ప్రముఖ న్యాయవాది శ్రీ అవ్వా సత్యనారాయణ రావు గ్రంథ ప్రాశస్త్యాన్ని గురించి ప్రసంగించారు అనువాదకుల పక్షాన ఉస్మానియా విశ్వవిద్యాలయం హిందీ శాఖాధ్యక్షులు డాక్టర్ బీంసేన్ నిర్మల్ అనువాదం చేసిన పద్ధతిని వివరించి, హిందీ బాషా పరిశోధకులకు ఈ అనువాదం చాల ఉపయోగ కరమని అన్నారు తమతో సహకరించిన అనువాదకులను పేర్కొన్నారు ఈ అనువాదం దేవ నాగరి లిపిలో తెలుగు పద్యాలు యధామూలంగా హిందీ తాత్పర్యంగా సాగింది దీనిని డాక్టర్ బీమ్‌సేన్ నిర్మల్ సుప్రసిద్ధ హిందీ విద్వాంసులు శ్రీ శివరామ శర్మ డాక్టర్ శ్రీమతి నీరజా చక్రవర్తి మరి యిద్దరు చేశారు శ్రీ శివరామ శర్మగారు దాదాపు 80 ఏళ్లవారు వారందరూ సబకు వచ్చారు పుస్తక ప్రకాశకులు అనువాదకులందరినీ వేదిక మీద కూర్చోపెట్ట వలసింది, డాక్టర్ నిర్మల్‌తో పాటు వారినీ సన్మానించ వలసింది అలా జరుగలేదు అనువాదం ఆవిష్కరణ కదా, అనువాదకులందరినీ శాలువలతో సన్మానించినా ఐదు వందల రూపాయలకు మించదు శాలువలు వ్యయ బారమనుకుంటే చెరి ఒక పూలదండ వేసినా ఎంతో బాగుండేది సూక్ష్మంలో మోక్షం డాక్టర్ నిర్మల్ ఈ అనువాదంలో ప్రదానులు ఆయన కృషి వల్లనే ఇంత గొప్ప పని జరిగింది ఆయనను సన్మానించడం ఎంతైనా ఉచితం కాని , శివరామశర్మ దాదాపు 80 ఏళ్ల వృద్ధు కదా! హిందీ ప్రచారంలో హిందీ రచనలో రెండు తరాలు గడపిన వారు కదా! ఆయన నయినా ఒక పూలదండతో సత్కరించి వుంటే ఎంత బాగుండేది? ఆయనతో పాటే తక్కిన అనువాదకులు ఒకరూపాయ పూలదండకు నోచుకోలేక పోయారా?పుస్తక ప్రచురణ కర్తలు మరి కొంత ఉదాత్తంగా ప్రవర్తించి వుంటే, ఆవిష్కరణ సబ మరింత గంభీరంగా, ఆనందదాయకంగా వుండేది

### నార్ల గారి ప్రథమ వర్ధంతి:-

సుప్రసిద్ధ పత్రికారచయిత డాక్టర్ నార్ల వేంకటేశ్వరరావు ప్రదమ వర్ధంతి సబ ఫిబ్రవరి 16న ప్రెస్‌క్లబ్బులోని శ్రీ సూరవరం ప్రతాపరెడ్డి హాలులో జరిగింది అధ్యక్షత వహించిన న్యాయమూర్తి శ్రీ ఆమంచర్ల గంగాధరరావు తమ ప్రసంగంలో శ్రీ నార్ల పత్రికారచనలో తన ప్రత్యేక శైలిని ప్రవర్తింప జేశారన్నారు ఈనాడు ప్రదాన సంపాదకులు శ్రీ సి రామోజీరావు ప్రసంగిస్తూ, శ్రీ నార్ల తమ సంపాదకీయాలతో ప్రజలను ప్రభావితులను చేశారని దినపత్రికను ప్రజల దైనందిన జీవితంలో బాగంగా చేశారని అన్నారు సార్వత్రిక విశ్వవిద్యాలయం వైస్ చాన్సలర్ డాక్టర్ సి. నారాయణ రెడ్డి ప్రసంగిస్తూ, శ్రీనార్ల వీరేశలింగం, గురజాడ వేమనలను కలబోసిన వ్యక్తి అని అన్నారు హైదరాబాద్ విశ్వవిద్యాలయం తెలుగు శాఖాద్యక్షులు డ క్టర్ జి వి సుబ్రహ్మణ్యం శ్రీ నార్లకు బాషపైగల అదికారాన్ని విశదీకరించారు

### హెూమీ తల్యార్ ఖాన్ ప్రశంస:–

కేంద్ర మైనారిటీల కమిషన్ సభ్యుడు శ్రీ హెూమీ జె హెచ్ తల్యార్‌ఖాన్ మైనారిటీల విషయంలో రాష్ట్ర ప్రబుత్వం చేస్తున్న సంక్షేమ కృషిని ప్రశంసించారు రాష్ట్ర ప్రభుత్వం మైనారిటీస్ ఫైనాన్స్ కార్పొరేషన్ స్థాపించడం గొప్ప ముందంజ అని అన్నారు మైనారిటీల సంక్షేమం దేశ సమైక్యానికి ప్రదానమని ఆయన అన్నారు రాష్ట్ర ప్రభుత్వం శ్రీ తల్యార్‌ఖాన్ అబిప్రాయాలను తెలుసు కొనడంకోసం ఫిబ్రవరి 14న ఒక సమావేశం ఏర్పాటు చేసింది రాష్ట్ర ప్రబుత్వ ప్రధాన కార్యదర్శి శ్రీ శ్రావణకుమార్ మైనారిటీల సంక్షేమం కోసం రాష్ట్ర ప్రభుత్వం తీసుకొన్న వివిద చర్యలను వివరించారు రాష్ట్ర ప్రబుత్వం మైనారిటీల సంక్షేమానికి కృత నిశ్చయమై వుందని, శాయశక్తులా కృషి చేస్తుందని ఆయన అన్నారు

### ఉపశ్రుతి:–

మద్రాసులోని పైక్రాఫ్ట్స్ రోడ్ బెల్స్ రోడ్డు మూలలోని కేశాలంకరణ శాలకు ఒకరు వచ్చారు కేశాలంకరణకు ఆ శాల యజమాని శ్రీ కన్నయ్య మంచి మాటకారి, చదువుకున్న వాడు ఎలా కత్తరించ మంటారు?– అనడిగాడు ఆయనను నీ ఇష్టం– అన్నారు ఆయన నాయిష్టమేమి లేదు సార్ మీ శిరస్సు, మీ శిరోజాలు అంతా మీ యిష్టమే– అన్నాడు కన్నయ్య ఈ డెబ్బయ్యేళ్లలో మీ యిష్టమే అనే వాడివి నువ్వొక్కడివే కనిపించా-వయ్యా ఇంత వరకూ నీయిష్టం అన్న వారు ఒక్కరూ లేరు ఆఫీసులో అధికారుల ఇష్టం ఇంట్లో బార్యా పిల్లల ఇష్టం నాఇష్టం అన్న వాడివి నీ వొక్కడివే– అని ఆనంద బాష్పాలు రాల్చాడు ఆయన

–తిరుమల రామచంద్ర

# ఉత్తరాలు.....

( 4 వపేజీ తరువాయి)

## సీరియల్స్

పారా ముఖచిత్రంలో వెలువడిన ఆంధ్రసచిత్ర వారపత్రిక మమ్మల్ని ఎంతో ఆకట్టుకుంది ముఖ్యంగా ప్రేమ సాగరం' నవల చాలా బాగుంది

–దువ్వాడ శ్రీకాంత్ కాశీబుగ్గ

★ ★ ★

'ప్రేమసాగరం మమ్ములను ఎంతో ఆకట్టుకుంది రచయిత్రిగారికి మా హృదయపూర్వక అభినందనలు

ఇచ్ఛాపురం రామచంద్రరావు' గారి 3 డి సీరియల్ ఎంతో ఆసక్తి కరముగా సాగుతున్నది

–కె కృష్ణమూర్తిరావు కర్నూలు

★ ★ ★

హిందీ నటి పారా ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రిక మా ఇంటిల్లిపాదిని అలరించింది

'ప్రమీలా జనార్ధన్ గారి మనసుకు సంకెళ్ళు కొత్త మలుపు తిరిగింది

'సుదకు' మళ్ళీ మతి తప్పటం బాధనిపించింది ఆమెకు నయంకావాలని రవి ప్రతిమల దాంపత్య రదం సాఫీగా సాగాలని కోరుకుంటున్నాము

–యం క్రిష్ణకుమారి
యం సుదాకరరావు
షోలాపూర్

★ ★ ★

7 2 86 నాడు మాదవి ముఖచిత్రంతో వెలువడిన పత్రిక మమ్మల్ని ఎంతగానో ఆకట్టుకుంది ప్రేమసాగరం సీరియల్ చాలా బాగుంది ఎన్ బారతీదేవి గారికి మా దన్యవాదాలు

దువ్వాడ శ్రీకాంత్ కాశీబుగ్గ

## కారణాలు?

24–30,జనవరి 86 సంచికలో వ్రాసిన ఏ పండరినాద్ జాతిని జాగృతం చేసిన వందేమాతరం వ్యాసం చదివి మాకు తెలియని ఎన్నో విషయాలు తెలుసుకున్నాము

కాని కాకినాడ కాంగ్రెస్ సభలో మహమ్మదాలీ అధ్యక్షస్థానం నుండి ఆ గితం ఆలపించినపుడు అభ్యంతరం తెలిపారు అని వ్రాసారు దానికి గల కారణాలు వివరించలేదు దయచేసి పత్రికా ముఖంగా ఆ కారణాలు వివరించమని వ్యాసకర్తని మనవి చేస్తున్నాము

–కుప్పిలి శ్రీదేవి కుప్పిలి జ్యోతి విజయవాడ

## కథలు

ఈ వారం వచ్చిన మాదవి అట్ట పత్రికలో కుమారి ఏ వి శేషారత్నం గారు వ్రాసిన చాయారాగం అనే కథలో తల్లియొక్క 'అనురాగాన్ని ఆప్యాయతను కొడుకు గుండెల్లో నిలిచి పోవుట చాలా బావుంది ఈ కథ చదవడం వల్ల మేమొక మంచి కథ చదివామన్న తృప్తి మాకు కలిగింది

యం చంద్రశేఖర్ హైదరాబాద్

★ ★ ★

నటి మాదవి ముఖచిత్రంలో వెలువడిన 7–13 ఫిబ్రవరి 1986 సంచిక ముగ్ధమనోహరంగా వుంది ఈ వారం కథలలో ఆదర్శం అనుభవమైన వేళ కథ సందేశాత్మకంగా వుంది నిజమె వరకట్న పిశాచి మహాఉదృతంగా వున్న ఈ రోజుల్లో ఆడపిల్లలకి పెళ్ళి చేయడం ప్రతి తండ్రికి కష్టమే మరి

మోడేకుర్తి సత్యనారాయణ అన్నవరం

★ ★ ★

7–3 ఫిబ్రవరి 86 సంచికలో అమ్మ కథ నన్ను ఎంతగానో కదిలించి వేసింది చివరికి కళ్ళలో నీళ్ళు తిరిగాయి రచయితకు నా దన్యవాదాలు

చెన్నా కృష్ణవేణి శృంగవరపుకోట

★ ★ ★

మాదవి ముఖచిత్రంతో వెలువడిన 7–13 ఫిబ్రవరి 86 సంచికలో ఏ వి శేషారత్నంగారి చాయారాగం కథ రాగాలడోలికలో ముంచి తేలుస్తూ సంగీతలోకంలోకి కొనిపోయింది మాతృత్వంలోని మమకారాన్ని అమ్మ ఒడిలోని చల్లదనాన్ని గుర్తుకు తెచ్చింద మనసును స్పందింప జేసే యిటువంటి కదలకు ప్రముఖ స్థానం కల్పించే మీకు దన్యవాదాలు

పాట్నిడి చక్రరావు విశాఖపట్నం

★ ★ ★

మాదవి ముఖ చిత్రంతో వెలువడిన 7–13 సంచికలో బారతి గారి పగలు కాలిన కొవ్వొత్తి కథ చాలా బాగుంది కూతుళ్ళు తమ సంసారాలు చక్కగా చేసుకుంటూ కల కల లాడుతుంటే చూడాలని ప్రతి తండ్రి కోరుకుంటుంటాడు ఆచారాలు గౌరవం సాంప్రదాయాల అడుగున చితికి పోయే పరందామయ్య లాంటి వాళ్లను చూస్తుంటే జాలి కల్గుతుంది

నరికొండ వెంకటేశం
పద్మావతి లోయర్ మానేరుడ్యాం


Printed and Published for Nageswara Rao Estates Private Ltd ,

by S Nageswara Rao at the Andhra Patrika Press,

Gandhinagar, Vijayawada 3, Editor S Radhakrishna

Phones Business 61247, 61248, Editorial 75667



"మగధీరుడు"లో చిరంజీవి, జయసుధ